# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక పత్రిక

డిసెంబర్ 2007 77 రు. 10

- ఫోకస్ : తెలుగుసీమలో సామాజిక ఉద్యమాలు
  మూడు వ్యాసాలు
- సబ్సిడీలు పాలకుల అవసరం
- కృష్ణా గోదావరి బేసిన్ సహజవాయువు ప్రజల సొత్తు
- కోర్టు ధిక్కారం సమంజసమేనా?
- ప్రాథమికవిద్యకు పాడెకడుతున్న సర్కార్
- పాలకుల పరస్పర నిందారోపణలు
- వరి మద్దతు ధర

# యాభై ఏళ్ల ఆంధ్రప్రదేశ్ పై ఏకైక విశిష్ట సమాచార, విశ్లేషణా గ్రంథం



## సిడిఆర్‌సి ప్రచురణ

## ఇంగ్లీషులో, 568 పేజీలు

**హార్డ్ బౌండ్ (గ్రంథాలయ, మేలు ప్రతి) రు. 895**

**విద్యార్థుల కొరకు ప్రత్యేక ముద్రణ రు. 225**

# FIFTY YEARS OF ANDHRA PRADESH

## 1956 - 2006

## ప్రస్తుతం మార్కెట్లో ఉంది

యాభై సంవత్సరాల ఆంధ్రప్రదేశ్ జయాపజయాలపై,
అభివృద్ధి పథంలో ఒడిదుడుకులపై
నలభై విశ్లేషణాత్మక, సమాచార భరిత వ్యాసాలు, పట్టికలు
చరిత్ర, వ్యవసాయం, పరిశ్రమలు, మౌలిక సౌకర్యాలు, ఆర్థిక వ్యవహారాలు,
సామాజిక పరిణామాలు, విద్యా వైద్య రంగాలు
ఆంధ్రప్రదేశ్ పురోగతి గురించి తెలుసుకోదలచిన వారందరూ
తప్పనిసరిగా అధ్యయనం చేయవలసిన గ్రంథం
ప్రతి గ్రంథాలయంలోనూ ఉండవలసిన గ్రంథం

ప్రతులకు, వివరాలకు




**సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసెర్చ్ అండ్ కమ్యూనికేషన్**
మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040 - 66843495 ఇమెయిల్ : reachcdrc@yahoo.com

వీక్షణం రాజకీయార్థిక, సామాజిక మాస పత్రిక

డిసెంబర్ 2007
సంపుటి : 5
సంచిక : 12

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

సంపాదకీయం

# దేనికి ప్రత్యామ్నాయం?

రాష్ట్రంలో 2009 ఏప్రిల్ లోనో, అంతకు ముందేనో జరగనున్న ఎన్నికల జ్వరం భయం అన్ని రాజకీయ పక్షాలలో లోతయిన కదలికలకు కారణమవుతున్నది. అన్ని రాజకీయ పక్షాలూ ఈ పదహారు నెలల పాటు ధరించే ముసుగుల ద్వారా తమ గత రూపాలన్నిటినీ మార్చి వేయాలని ఎత్తులపై ఎత్తులు వేస్తున్నాయి. కొత్త కొత్త సమీకరణాలకు తెరలు లేపుతున్నాయి. దాదాపు అన్ని రాజకీయ పక్షాలూ ప్రత్యామ్నాయం గురించి మాట్లాడుతున్నాయి. చిరునామాలు మార్చడమే ప్రత్యామ్నాయమా, ఇంకా లోతయిన వ్యవస్థాగతమైన మార్పు ఏదయినా జరిగినప్పుడే ప్రత్యామ్నాయం అనాలా అనే తాత్విక చర్చను పక్కన పెట్టి చూసినా, ప్రత్యామ్నాయం అనే మాటను ప్రతి ఒక్కరూ హాస్యాస్పదమైన రీతిలో వాడుతున్నారు. కాంగ్రెస్, భారతీయ జనతాపార్టీల నాయకత్వంలో ఇప్పటివరకు ఏర్పడిన కూటములకు ప్రత్యామ్నాయంగా ఒక మూడోకూటమి ఏర్పడాలని అంటున్నారు. ఆ రెండు కూటములలో ఏదో ఒక సమయంలో భాగస్తులయిన పార్టీలతోనే మూడో కూటమిని ఏర్పరచడానికి ప్రయత్నిస్తున్నారు. నిజానికి మన సమాజం ముందు ఉన్న సమస్యల పరిష్కారాల విషయంలో ఆ రెండు కూటములకూ, ఈ మూడో కూటమి ప్రయత్నాలు చేస్తున్న వారికీ ఏమీ తేడాలేదు. ప్రపంచీకరణ, మతోన్మాదం, భూసంస్కరణలు, పేదరికం నిర్మూలన, చట్టబద్ధ పాలన, సమసమాజ దిశగా ప్రయాణం వంటి అన్ని అంశాలలోనూ ఈ అన్ని పార్టీల ధోరణీ ఒకటేనని 1992 నుంచి ఇప్పటి దాకా, కాషాయం నుంచి ముదురు ఎరుపు దాకా పార్టీలతో కూడిన ఈ కూటములన్నీ అధికారంలోకి వచ్చి రుజువు చేశాయి. రాష్ట్ర ప్రభుత్వాలను నిర్వహించిన, కేంద్ర ప్రభుత్వానికి సహకరించిన వామపక్షాలనబడేవి కూడ ఏమీ తేడాలేదని చూపుకున్నాయి. మూడో ప్రత్యామ్నాయం గురించి ఇటువంటి సర్కస్ ఫీట్లు ఒకవైపు జరుగుతుండగానే కుల సమీకరణాలతో ఒక కొత్త ప్రత్యామ్నాయ ప్రయత్నం కూడ మొదలయింది. అత్యధిక సంఖ్యాకులుగా ఉన్న దళిత, ఆదివాసి, బహుజన, మైనారిటీ వర్గాల వోట్లతో అల్ప సంఖ్యాకులుగా ఉన్న అగ్రవర్ణాలు ఇంతకాలం అధికారాన్ని చలాయిస్తున్నాయి గనుక ఆ స్థితి మారాలనే డిమాండ్ చాల న్యాయమైనదే, అవసరమైనదే. కాని ఇది కూడ నిజమైన ప్రత్యామ్నాయం అవుతుందా అనే ప్రశ్నలు తలెత్తడానికి అవకాశం ఇచ్చేలా ఈ ప్రయత్నాలు సాగుతున్నాయి. పైన చెప్పిన కూటములలో ఎప్పుడో ఒకసారి భాగమైన పార్టీలు, వ్యక్తులు ఇప్పుడు ఈ ప్రయోగాన్ని తలకెత్తుకోవడం ఒక సమస్య కాగా, ఒక అగ్రవర్ణాన్ని, అందులోనూ మనువాద భావజాలం ద్వారా సకల దుర్మార్గాలకూ మూలమైన అగ్రవర్ణాన్ని తమలో కలుపుకుని దళిత వర్గాల పాలన తెస్తామని ఆలోచించడం, ఆశించడం నిజమైన ప్రజా ప్రత్యామ్నాయం అవుతుందా ప్రశ్నార్థకమే. రాష్ట్రంలో సాగుతున్న అటువంటి ప్రయోగాలలోనైతే అనేక రాజకీయ ఎత్తుగడలు, దురుద్దేశ్యాలు, ఇతర ప్రజా ఉద్యమాలకు పోటీగా ఈ సమీకరణాలను నడిపే ప్రయత్నం స్పష్టంగా కనబడుతున్నాయి. అధికారం మాకు అనే నినాదమే వినబడుతోంది గాని ఆ అధికారం ఎందుకొరకో, ప్రజా జీవితంలో ఏ మౌలిక రాజకీయార్థిక మార్పును తెస్తుందో ప్రస్తావన లేదు. గమ్యం మరిచిపోయినవారు ప్రయాణం ఎప్పటికీ పూర్తి చేయలేరు అని కవి చెప్పినట్టు, ప్రత్యామ్నాయం అనేది గద్దెమీద కూచునే పిడికెడు మంది చిరునామా మార్చడంగా కాకుండా గద్దెకింద ఉన్న కోట్లాది ప్రజల సమస్యల పరిష్కారానికి దారి చూపేదిగా ఉండాలి. అంతవరకూ ఎన్ని కసరత్తులు జరిగినా సమాజానికి అవసరమైన మరమ్మత్తయితే జరగదు. ◆



**వీక్షణం చందా వివరాలు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రు. 120 |
| 3 సంవత్సరాల చందా | రు. 350 |
| 5 సంవత్సరాల చందా | రు. 550 |
| 10 సంవత్సరాల చందా | రు. 1000 |

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : reachcdrc@yahoo com

డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజన్సీస్, హైదరాబాద్.
ఫోన్ : 98482 49695
98484 28516

ప్రింటర్స్
చరితా ఇంప్రెషన్స్,
అజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

## ఉన్న నిజం చెప్పిన కాగ్ నివేదిక

దేశంలోని అన్ని ప్రభుత్వాల పనితీరు అసమర్థంగా, అవినీతి మయంగా, ప్రభుత్వ గణాంకాలు తప్పుల తడకలుగా ఉన్నాయిగనుక కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ (కాగ్) విడుదల చేసే ప్రతి వార్షిక నివేదికా, అది కేంద్ర ప్రభుత్వం విషయంలోనైనా, విభిన్న పార్టీల పాలనలో ఉన్న రాష్ట్ర ప్రభుత్వాల విషయంలోనైనా, తప్పులెన్నే నివేదికగానే ఉంటోంది. ఆ అర్థంలో 2006-07 సంవత్సరానికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వ పనితీరుపైన, ప్రత్యేకించి జలయజ్ఞం అవకతవకలపైన కాగ్ నివేదిక పెద్ద ఆశ్చర్యాన్ని కలిగించడం లేదు. గత మూడున్నర సంవత్సరాలుగా రాష్ట్రంలో సాగుతున్న కుంభకోణాల గురించీ అవినీతి గురించీ ప్రజలకు తెలిసిన విషయాలనే, ప్రచార సాధనాలలో వస్తున్న విషయాలనే కాగ్ నివేదిక మరొకసారి నిర్ధారించింది. కాగ్ నివేదిక ప్రకటించిన నిజాల మీద మసిపూసి మారేడుకాయ చేయడానికి రాష్ట్ర ప్రభుత్వం చేస్తున ప్రయత్నాలు విచిత్రంగా ఉన్నాయి. చంద్రబాబు నాయుడు పాలనాకాలంలో కూడ కాగ్ నివేదికలు ఆ పాలన తీరును తప్పుపట్టిన మాట నిజమే. ఆ పాలనలో కూడ అవినీతి విపరీతంగా జరిగినమాట నిజమే. కాని, ప్రస్తుత పాలనలో జరిగిన అవినీతికి అది సమర్థన కాజాలదు. ప్రభుత్వ గణాంకాల విశ్లేషణ ద్వారానే కాగ్ తన నిర్ధారణలకు వస్తుంది గనుక, కాగ్ చెప్పినవన్నీ నిజాలే అని ముందు ఒప్పుకుని, ఆ తప్పులకు బాధ్యులయిన వారిమీద చర్య తీసుకోవడం ప్రభుత్వం చేయవలసిన మొట్టమొదటి పని. మొదట ఆ పని చేసి ఆ తర్వాత కావాలంటే ఇవాళ తనను విమర్శిస్తున్నవారికి ఆ యోగ్యత లేదని కూడా అనవచ్చు. కాని ముందు తాను చేయవలసిన పని చేయకుండా విమర్శకుల వైపు వేలు చూపించడం సరికాదు. ఇంతకీ ఈ వ్యవహారం తప్పులు చేసిన ప్రభుత్వానికో, విమర్శిస్తున్న ప్రతిపక్షాలకో సంబంధించినది మాత్రమే కాదు. ప్రజాధనం దుర్వినియోగమయిందన్నది అసలు సమస్య. ప్రజలు ఆరుగాలం కష్టపడి కూడబెట్టిన సంపదను, కేవలం ఐదు సంవత్సరాల నిర్వహణ బాధ్యత అప్పగించబడిన ప్రభుత్వం కొల్లగొట్టడమనేది అసలు సమస్య. సమస్యను అటువైపునుంచి చూసినప్పుడు అది ఐదు వందల కోట్లా ఒక్కపైసానా అనేది కాదు, అసలు ఆ విధంగా ప్రజాధనం దుర్వినియోగం కావచ్చునా, అందుకు బాధ్యులైన వారిని ఎంత తీవ్రంగా శిక్షించి, వారు కైంకర్యం చేసిన ప్రజాధనాన్ని తిరిగి సంపాదించడం ఎట్లా అనేది సమస్య. ఇటువంటి దొంగతనాల వల్ల ప్రజలకు అందవలసిన అభివృద్ధిఫలాలు ఎట్లా దూరమవుతున్నాయనేది అసలు సమస్య. అంటే అది రాజకీయ పక్షాల సమస్య కాదు, ప్రజల సమస్య.

## మళ్లీ నందిగ్రామ్

నందిగ్రామ్‌లో మళ్లీ హింస చెలరేగింది. అధికార పక్షమైన సిపిఎం, దాని సమర్థకులు ఎన్ని వాదనలు, కారణాలు వినిపించినప్పటికీ, ప్రాణాలు పోగొట్టుకున్న 35 మంది, ఆశ్రయం కోల్పోయిన, అత్యాచారానికి గురి అయిన వందలాది మంది అనుభవించిన బాధ కాదనలేని వాస్తవం. వాళ్లు ఆ బాధ ఎందుకు అనుభవించవలసి వచ్చిందనేదానికి, వాళ్లు తమ భూమిని ప్రభుత్వం లాక్కొని ఒక విదేశీ కంపెనీకి అప్పగించగూడదని ప్రతిఘటించడం తప్ప మరొక కారణం కనబడదు. ఈసారి హత్యాకాండకు, దౌర్జన్యకాండకు పాల్పడిన వారెవరు? గత మార్చ్ హత్యాకాండ తర్వాత నందిగ్రామ్ నుంచి పారిపోయి, ఇతర ప్రాంతాల్లో తలదాచుకుని ఇప్పుడు నందిగ్రామ్‌ను పునరాక్రమించడానికి తరలివచ్చిన వాళ్లు. వాళ్లు అలా పారిపోవలసి రావడం విచారకరమే కావచ్చు గాని ఎందుకు పారిపోవలసి వచ్చింది? వాళ్లు 2006లో సలీం కంపెనీ ఏజంట్లుగా, సమర్థకులుగా పనిచేసి రైతాంగంపై భూమి ఇమ్మని ఒత్తిడి తెచ్చారు గనుక, 2007 జనవరిలో, మార్చ్‌లో పోలీసులు కాల్పులు జరిపేటప్పుడు, తాము కూడ తుపాకులు పట్టుకుని భూ ఆక్రమణను ప్రతిఘటించే ప్రజలపై వెతికి వెతికి దాడులు చేసి, కాల్చిచంపారు గనుక. అలా నందిగ్రామ్ ప్రాంతంలో తమ భూమి వదిలేదిలేదని ప్రతిఘటించిన ప్రజలకు, వారి భూమి నుంచి వారిని నిరాశ్రయులను చేసి ఆ భూమిని విదేశీ కంపెనీకి అప్పగించాలని ప్రయత్నించినవారికీ మధ్య ఘర్షణాపూరిత వాతావరణం నెలకొంది. హంతకులు, దౌర్జన్యపరులు, వారిని సమర్థించినవారు ఒక పక్కనా, తమ జీవనాధారాన్ని పోగొట్టుకోవడాన్ని ఎదిరించినవారు మరొక పక్కనా శత్రుపూరిత స్థితి నెలకొని అప్పటికే ఇరవై మంది ప్రాణాలు పోగొట్టుకోవలసి వచ్చింది. ఆ తర్వాత భూమిని ఆక్రమించబోమని వాగ్దానాలు వచ్చినా, తమ కుటుంబ సభ్యులను, తమ ఉద్యమ నాయకులను చంపిన, వేధించినవాళ్ల పట్ల బాధితులలో ఉండే ఆగ్రహాన్ని తగ్గించడానికి ఏ ప్రయత్నమూ జరగలేదు. సరిగదా ఇప్పుడు ఆ హంతకులు, భూ ఆక్రమణ సమర్థకులు ప్రభుత్వ, పాలకపక్ష సహకారంతో తిరిగివస్తూ, తమ పునరాగమన విజయోత్సవాలలో భాగంగా రక్తహోళీ జరుపుకున్నారు. ఈ వ్యవహారమంతా మార్క్సిజం పేరుమీద జరగడమే విషాదాలలోకెల్లా విషాదం.

## పాకిస్తాన్ సైనికపాలన

మళ్లీ ఒకసారి పాకిస్తాన్ అత్యవసర పరిస్థితి కోరలకు చిక్కింది. అరవై సంవత్సరాల అస్తిత్వంలో సగానికి పైగా సైనిక పాలనలోనే గడిపిన పాకిస్తాన్ నామమాత్రపు ప్రజాస్వామ్యాన్ని కూడ చవి చూడలేకపోయింది. 1956లో స్వతంత్ర రాజ్యాంగం రాసుకుని రెండు సంవత్సరాలు గడవకుండానే అయూబ్ ఖాన్ చేసిన సైనిక తిరుగుబాటుతో ప్రారంభమైన నిరంకుశ పాలనల పీడ పాకిస్తాన్ ప్రజానీకానికి ఇప్పటికీ వదలలేదు. అయూబ్ ఖాన్ పాలనలో పదకొండు సంవత్సరాలు, యాహ్యాఖాన్ పాలన రెండు సంవత్సరాలు గడిచి నామమాత్రపు ప్రజాస్వామ్యం వచ్చిందనుకుంటే ఆ ప్రజాస్వామిక పాలకుడు జుల్ఫికర్ అలీ భుట్టోను కూలదోసి, చట్టబద్ధంగా ఉరిశిక్షవేసి చంపించిన జియా ఉల్ హక్ మరొక తొమ్మిది ఏళ్లు పాలించాడు. ఆయన మరణంతో మొదలయిన ప్రజాస్వామిక యుగం పది ఏళ్లు కూడ నిండకుండానే జనరల్ పర్వేజ్ ముషర్రఫ్ సైనిక కుట్ర ద్వారా అధికారం సంపాదించి, రాజ్యాంగాన్ని మార్చివేసి, తనకు తాను ప్రజాస్వామ్యరంగు కూడ పూసుకున్నాడు. ప్రస్తుతం ముషారఫ్ పాలనకు వ్యతిరేకపవనాలు బలంగా వీస్తుండడంతో, అక్కడ ప్రతిపక్షాలు, న్యాయవ్యవస్థ అంతకంతకూ ఎక్కువగా బలం పుంజుకుంటూ సైనికపాలనను తోసిరాజనడానికి ప్రయత్నిస్తుండడంతో, ముషారఫ్ మళ్లీ ఒకసారి తన ప్రజాస్వామ్య ముసుగును పక్కనపెట్టి జనరల్ అవతారం ఎత్త దలచుకున్నాడు. రాజ్యాంగాన్ని రద్దుచేసి అత్యవసర పరిస్థితి విధించాడు. మిగిలిన భారత ఉపఖండ దేశాలన్నిటి లాగనే పాకిస్తాన్ ప్రజలు కూడా పేదరికాన్ని, అవిద్యను, అనారోగ్యాన్ని, అసమానతను అనుభవిస్తుండగా, ఈ సైనికపాలనలు పాకిస్తాన్ ఆర్థికవ్యవస్థను ఆయుధపోటీకి, అమెరికా బానిసత్వానికి కట్టిపడేశాయి. వలసపాలనకాలంలో భారతదేశంలో భాగమైన మన సోదరులు ఈ రకంగా ఇబ్బందుల పాలవుతుంటే భారత పాలకులు వారిమీదికి అదనపు కష్టాలు తెచ్చిపెట్టారు. వారి దేశం రెండు ముక్కలు కావడానికి కారణమయ్యారు. వారిమీద యుద్ధాలను రుద్దారు. పెనం మీదినుంచి పొయ్యిలో పడిన పాకిస్తాన్ ప్రజలకు సంఘీభావం ప్రకటించి వారి కష్టాల నుంచి గట్టెక్కించవలసిన ప్రపంచ ప్రజాభిప్రాయం బలంగా వ్యక్తంకాకపోవడం ఒక విషాదమైతే, అన్ని దేశాల పాలకులు ఈ పొయ్యిలో పేలాలు వేయించుకుతినడానికి ప్రయత్నిస్తుండడం మరొక విషాదం. ◆

## లోపలి పేజీల్లో...

### తెలుగుసీమ చరిత్రలో సామాజిక ఉద్యమాలు

సామాజిక ఉద్యమమంటే ఏమిటి, దాన్ని ఎట్లా అర్థం చేసుకోవాలి, దాని స్వరూప స్వభావాలేమిటి, దాని పరిధి పరిమితి ఏమిటి అనే ప్రశ్నలకు అందరూ అంగీకరించే నిస్సందేహమయిన సమాధానాలు లేవు. మనుషుల సామూహిక జీవనం మొదలయినప్పటి నుంచీ సామూహికంగా చేసిన ప్రయత్నాలు; కార్యాచరణలు; చిన్నదో పెద్దదో ఒక లక్ష్యం పెట్టుకుని అది సాధించడంకోసం జరిపిన ఆందోళనలు; ఉన్న సామాజిక స్థితిపట్ల అసంతృప్తిని వ్యక్తీకరించిన తిరుగుబాట్లు; జీవనంలో, ఉత్పత్తిలో, మత విశ్వాసాలలో, ఆచార వ్యవహారాలలో పరివర్తనలు; తెలిసిగాని తెలియకగాని సామాజిక మార్పు కోసం జరిగిన పెనుగులాటలు అన్నీ కూడ సామాజిక ఉద్యమాల అధ్యయనంలో భాగం కావలసినవే.

#### ఫోకస్ : తెలుగుసీమ చరిత్రలో సామాజిక ఉద్యమాలు



'వీక్షణం'లో అచ్చువుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

#### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

- సంపాదకులు

#### చందాదారులకు విజ్ఞప్తి

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

- సర్క్యులేషన్ మేనేజర్
9949391028



- **పొలి** – సేద్యం-కావ్యం – రాచపాళెం – 43 పేజీలు, 1/8 డెమీ, రు. 50. ప్రతులకు : శ్రీమతి ఆర్. లక్ష్మి, 28-3-169, తారకనాథ కాలనీ, అనంతపురం – 515 001. సెల్ : 9440222117, అన్ని ప్రముఖ పుస్తకాల షాపుల్లో

- **ఒక విధ్వంసక ముఖచిత్రం** – సరికొండ నరసింహరాజు – సృజన ఆర్ట్స్ అకాడమీ ప్రచురణలు, 186 పేజీలు, 1/8 డెమీ, రు.100, ప్రతులకు: పల్లవి పబ్లికేషన్స్, ఏలూరు రోడ్, విజయవాడ – 520 002. నవోదయ, ప్రజాశక్తి, విశాలాంధ్ర అన్ని బ్రాంచీల్లో

- **అవును నేను ఆదిలాబాదోన్నే** – డా. అప్పాల చక్రధారి – నిర్మల్ కల్చరల్ ట్రస్ట్ ప్రచురణలు, 78 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : శక్తి మెడికల్ హాల్, తిరుమల థియేటర్ ఎదురుగా, నిర్మల్ – 504 106. ఫోన్ : 08734 – 243141

- **పులి తరిమిన లేళ్లు – షెడ్యూల్డ్ కాని గిరిజనులు** – పి.ఎస్. అజయ్ కుమార్ – 5వ షెడ్యూల్ సాధన కమిటీ, ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ వృత్తిదారుల యూనియన్ ప్రచురణలు, 49 పేజీలు, 1/8 డెమీ, రు. 10

- **నాన్ షెడ్యూల్ ఆదివాసీల ఆర్తనాదం** – పి.ఎస్. అజయ్ కుమార్ – 5వ షెడ్యూల్ సాధన కమిటీ, ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ వృత్తిదారుల యూనియన్ ప్రచురణలు, 32 పేజీలు, 1/5 డెమీ, రు. 10

పై రెండు పుస్తకాల ప్రతులకు : పి.కె. రాధమ్మ, 12-3-36/7, శారదా కాలనీ, అనకాపల్లి-531 001. ఫోన్ : 08924 – 225722

- **మార్క్స్, ఏంగెల్స్‌ల రచనల సంక్షిప్త పరిచయం-1** – కొలకోవ్‌స్కీ, అనువాదకులు – ఇంగువ మల్లికార్జున శర్మ, లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, 32 పేజీలు, 1/8 డెమీ, రు. 10

- **మార్క్స్, ఏంగెల్స్‌ల రచనల సంక్షిప్త పరిచయం-2** – కొలకోవ్‌స్కీ, అనువాదకులు – ఇంగువ మల్లికార్జున శర్మ, లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, 36 పేజీలు, 1/8 డెమీ, రు. 12

- **మార్క్స్, ఏంగెల్స్‌ల రచనల సంక్షిప్త పరిచయం-3** – కొలకోవ్‌స్కీ, అనువాదకులు – వి.వి. కృష్ణారావు, లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, 24 పేజీలు, 1/8 డెమీ, రు. 8

పై మూడు పుస్తకాల ప్రతులకు : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, 5-85-4/బి, పండరీపురం, 1వలైన్, గుంటూరు-522 002, ఫోన్ : 9848877596, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో

- **గుజ్జనగూళ్లు** – వి. హనుమారెడ్డి – ప్రకాశం జిల్లా రచయితల సంఘం, 52 పేజీలు, 1/8 డెమీ., రు. 25, ప్రతులకు : బి. హనుమారెడ్డి, ప్రకాశం జిల్లా రచయితల సంఘం, రాజా పానగల్ రోడ్, ఒంగోలు – 523 002. సెల్ : 94402 88080

- **చదువులో సగం** – చుక్కా రామయ్య – రామయ్య విద్యాపీఠం ప్రచురణలు, 86 పేజీలు, 1/8 డెమీ., రు. 50, ప్రతులకు : జూలూరు గౌరీశంకర్, జర్నలిస్టు, 1-8-702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్ – 500 044



## పాఠకుల వీక్షణం

పత్రిక నవంబర్ సంచికలో వి. హనుమంతరావు గారి 'ఆంధ్రప్రదేశ్ ఆర్థిక స్థితిగతులు' వ్యాసంలో ఒక వ్యాఖ్య చూసి ఈ స్పందన రాస్తున్నాను. హనుమంతరావు గారు అటు ఇటుగా ఐదు దశాబ్దాల కాలంగా పత్రికారంగంలో ఉన్నా ప్రాథమిక విషయాలు సైతం అర్థం కాలేదో, లేదా రాజకీయ వైఖరి అలాగే ఉంటుందో తెలియదు. "నలభైయ్యవ దశాబ్దం చివరిరోజుల్లో తెలంగాణ ప్రాంతంలో, ఆంధ్రలో సాయుధ పోరాటం జరిపినప్పుడు ఇతర రాష్ట్రాల్లో కమ్యూనిస్టు నాయకులు కొందరు పోరాట క్రమంలో ఆ తప్పు చేశారు. ఈ పొరపాటు చేశారని విమర్శలు వస్తే - అప్పటి కేంద్ర పార్టీ నాయకత్వం పోరాటాలు చేయనివాళ్లు తప్పే చెయ్యరు, పోరాటం చేస్తేనే తప్పులు దొర్లుతాయని ఆ విమర్శకులను మందలించారని విన్నా. అలాగే, నీటి పారుదల ప్రాజెక్టుల నిర్మాణం అంటే ఏమిటో తెలియని ఒకటి, అర తప్ప ప్రాజెక్టులే నిర్మించని తెలుగుదేశం నాయకులు (తెలుగుగంగ తప్ప) 26 ప్రాజెక్టులను చేపట్టి, కుంటో, గుడ్డో, నిర్మాణం సాగిస్తున్న ప్రస్తుత పాలకులను గోబెల్స్ స్టైల్‌లో విమర్శించటమే విడ్డూరం" అని ఆయన రాశారు. జలయజ్ఞం ప్రస్తావన చేస్తూ తెలంగాణ సాయుధ పోరాటంలో జరిగిన తప్పిదాల సందర్భాన్ని ఉదహరించి, కాంగ్రెస్ ప్రభుత్వం చేస్తున్న జలయజ్ఞంలోని అవినీతిని పొరపాటుగా చెబుతూ లంకెపెట్టే ప్రయత్నం చేశారు. 2004 మేలో అధికారంలోకి వచ్చింది మొదలు ఇప్పటిదాక నిత్యమూ ప్రజల రక్తం తాగుతున్న పాలకుల్ని 'పొరపాటు' చేసేవారుగా చెప్పడాన్ని హనుమంతరావు గారి విజ్ఞతకే వదిలేస్తున్నాను.

**- పి. నిశాంత్**
హైదరాబాద్

తెలంగాణ జిల్లాల నుండి దుబాయ్, ఇతర గల్ఫ్ దేశాలలో పని చేసే నిర్మాణ కూలీలు వెనక్కు పంపివేయబడ్డారు. బహుశా వీక్షణం, సి.డి.ఆర్.సి వారి దుర్భర పరిస్థితులను, ఎందుకు ఊళ్లు వదిలి వెళుతున్నారు, అక్కడ వారి జీవన స్థితిగతులు, దోపిడీ ఇవన్ని అధ్యయనం చేసి వెనక్కి పంపివేయబడ్డ వాళ్లను ప్రత్యక్షంగా కలిసి, వారి అభిప్రాయాలు రికార్డ్ చేసి, ఒక వ్యాస రచన ప్రచురిస్తే బాగుంటుందని అభిప్రాయం. ఆలోచించగలరు.

**- భూ.సా.శి. రాజు**
హైదరాబాద్

'వీక్షణం' పత్రికలో అన్ని రంగాలకు సంబంధించిన వ్యాసాలు, విశ్లేషణలు వస్తున్నాయి. పత్రిక బాగుంది. శాస్త్రీయ విద్యా విధానంపై, గతితార్కిక భౌతికవాదం పై విరివిగా రచనలు వచ్చేలా చూడగలరని ఆశిస్తున్నాం.

**- ఎన్. నాగరాజు**
నల్లగొండ

గ్రూప్-1, గ్రూప్-2 పరీక్షలకు ఉపయోగపడేలాగ కూడ విశ్లేషణలు, వ్యాసాలు, గణాంకాలతో వీక్షణం పత్రికను తీసుకురాగలిగితే విద్యార్థులకు చాలా ఉపయోగకరంగా ఉంటుంది. ఇప్పటికే 'వీక్షణం' మాకు చాలా ఉపయోగకరంగా, ఆలోచనా స్ఫోరకంగా ఉంటోంది. మీరు ప్రచురించిన ఫిఫ్టీ ఇయర్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ (1956-2006)' తెలుగులో కూడ వస్తే మాకు ఎక్కువ ప్రయోజనకరంగా ఉంటుంది.

**- టి. కృష్ణ**
హనుమకొండ

ప్రత్యామ్నాయ సామాజిక రాజకీయ పత్రికలలో మామూలుగా శాస్త్ర విజ్ఞాన విషయాలు ఉండడం లేదు. ఏ ప్రగతిశీల ఆలోచనకైనా తప్పనిసరిగా ఉండవలసిన శాస్త్రపరిజ్ఞానం గురించి ఈ అశ్రద్ధ ఎందుకో అర్థంకాదు. 'వీక్షణం' కూడా ఇన్ని రోజులుగా శాస్త్ర విషయాలను నిర్లక్ష్యం చేసింది. ఆ పొరపాటును ఇప్పటికైనా కొడవటిగంటి రోహిణీ ప్రసాద్ గారి వ్యాసంతో సరిదిద్దుకున్నందుకు సంతోషం.

**- ఎం. వెంకటేశ్వర్లు**
మహబూబ్‌నగర్

### తెలుగు రచయితలందరికీ మనవి

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారు తెలుగు భాషలో 1901 నుండి 2007 వరకు గల కాలంలో తెలుగులో వివిధ ప్రక్రియలో రచనలు చేసిన రచయిత్రులందరి సమాచారంతో కూడిన 'తెలుగు రచయిత్రుల సమాచార సూచిక' అను పుస్తకాన్ని ప్రచురింప తలపెట్టారు. కవిత్వం, కథ, నవల, నాటిక, వ్యాసం, పరిశోధన, యాత్రా చరిత్ర, జీవిత చరిత్ర, బాల సాహిత్యం, తెలుగులోకి అనువాదం, సంపాదకత్వం/ సంకలనం అనే ప్రక్రియలో రచనలు చేసిన రచయిత్రులందరి జీవిత విశేషాలను ఈ పుస్తకంలో ప్రచురించాలని నిర్ణయించాం. కాబట్టి దయచేసి పై ప్రక్రియలలో రచనలు చేసిన రచయిత్రులందరు తమ రచనా వివరాలను, పాస్‌పోర్ట్ సైజ్ ఫోటోను పంపవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. మీ వివరాలు నవంబర్ 30 లోగా మాకు అందాలి. సహకరించ వలసిందిగా విజ్ఞప్తి.

**- కొండవీటి సత్యవతి**
హైదరాబాద్

మా చిరునామా :
స్త్రీవాద పత్రిక భూమిక
హెచ్.ఐ.జి.-II, బి-8, ఫ్లాట్ నెం. 1,
వాటర్ ట్యాంక్ వెనుక, బాగ్‌లింగంపల్లి,
హైదరాబాద్ - 500 044.
వివరాలకు ఫోన్ : 27660173

### గమనిక :

గౌరవ సంపాదకులు వి. హనుమంతరావుగారి ఫోన్ నెం. 93920 50878

## అసహజ మరణాలు నమోదు చేద్దాం!

ఆగస్ట్ 2006 నుంచి వీక్షణంలో అసహజ మరణాల సూచి ప్రారంభించాం. మన చుట్టూ అసహజంగా చనిపోతున్న రైతులు, చేనేత కార్మికులు, వరకట్న మరణాలు, రకరకాల ప్రమాదాలలో చనిపోతున్నవారు, వైద్యం అందక, ప్రకృతి వైపరీత్యాలతో మరణిస్తున్నవారు, హత్యలు ఇలా, అనేక సామాజిక రంగాలనుంచి మరణిస్తున్నవారి సంఖ్యనైనా నమోదు చేయడమే ఈ శీర్షిక ఉద్దేశ్యం. ఏయే సామాజిక, రాజకీయార్థిక కారణాలతో చనిపోతున్నారో పరిశోధన చేయాల్సి ఉంది. మేము చేస్తున్న ఈ ప్రయత్నంలో మీరూ పాలుపంచుకోవచ్చు. మీ జిల్లాలో అసహజంగా చనిపోతున్న వారి వివరాలను మాకు పంపండి. దీనికి పారితోషికంగా వీక్షణం ప్రతిని పంపిస్తాం. ఆసక్తి గలవారు వివరాలకై సంప్రదించండి. ఫోన్ నెం. 99891 89250, 99493 91028

**- సంపాదకులు**

## వీక్షణం మీ ముంగిట

'వీక్షణం' పత్రిక ఇప్పుడు మీకు మరింత చేరువలోకి వచ్చింది. రాష్ట్రంలోని అన్ని పట్టణాలలో, టౌన్‌లలోని న్యూస్ స్టాండ్‌లలో అందుబాటులో ఉంది. ఇక ఆలస్యమెందుకు... వెంటనే మీ ప్రతిని తెచ్చుకోండి!

## వారిని లేపొద్దు - ప్రభుత్వాలు కూలిపోతాయి

'తాగినోళ్ల వెన్నుపైనే సర్కారు మనుగడ' అన్నట్లు మద్యం అమ్మకాల్లో ఖజానాకు వచ్చే ఆదాయాన్ని మాత్రమే చూసే ప్రభుత్వాలకు ప్రజల సంక్షేమం అనేది అప్రధానం అయిపోయింది. ఈ ఆర్థిక సంవత్సరం ప్రభుత్వం మద్యం అమ్మకాల ద్వారా రు. 8450 కోట్లు ఆర్జించాల్సి ఉంది. అయితే ఇప్పటికే రు. 6000 కోట్ల అమ్మకాలతో నాలుగింట మూడు వంతుల లక్ష్యాన్ని అందుకుంది. రాష్ట్రంలో ప్రభుత్వ లైసెన్స్ పొందిన సుమారు ఆరున్నర వేల మద్యం దుకాణాలకు తోడు మారుమూల పల్లెల్లో లక్షకు పైగా బెల్ట్ షాపులు విస్తరించాయి. కోట్ల కుంభకోణ యజ్ఞాలు ఒకపక్క జరిగిపోతున్నా, మద్యంపై ఆదాయం నష్టపోతే ఎలా అని విధానకర్తలు ప్రశ్నిస్తారు. తాగేవారికి ఆత్మనిగ్రహం ఉండాలని ప్రవచిస్తారు. తాగుడు వలన పరిణమిస్తున్న కుటుంబాల ఆత్మహత్యలను, మహిళలపై అత్యాచారాలను, రోడ్డు ప్రమాదాలను ఈ 'అభివృద్ధి'లో భాగంగా చూడాలి.

## మళ్లీ మళ్లీ ర్యాగింగ్

పైకులం వారు కింది కులం వారిని, మెజారిటీ మతస్తులు మైనారిటీ మతస్తులను, పెద్దవాళ్లు చిన్నవాళ్లని, పురుషులు స్త్రీలని, భూస్వామి పాలేరును, పెట్టుబడిదారుడు కార్మికున్ని, పట్నవాసులు పల్లెటూరి వారిని, పై వర్గంవారు కిందివర్గం వారిని, మానసిక శ్రమ చేసేవారు శారీరక శ్రమ చేసేవారిని, సీనియర్లు జూనియర్లను మొత్తంగా పైనున్నవారు కిందనున్న వారిని హీనంగా చూసి, వేధించి ఆనందించే సంస్కృతిలో భాగమే ఈ ర్యాగింగ్. మనిషిని మనిషిగా గుర్తించే స్వభావం మన జీవన సంస్కృతిలో లేకుండాపోతోంది. ఇటీవలే మెదక్ జిల్లా వై.పి.ఆర్. కళాశాల విద్యార్థులు హవేలి ఘనపూర్‌లో మొదటి సంవత్సరం ఇంజనీరింగ్ విద్యార్థులను వేధించడం గానీ, కర్నూలు జిల్లా ఆలూరు మండల పరిధిలో అరికెర గురుకుల జూనియర్ కళాశాలలోని మారెన్న అనే విద్యార్థి ఆత్మహత్యా యత్నానికి ఒడిగట్టేలా చేయడంగాని ఈ సంస్కృతి కొనసాగింపులో భాగమే. చట్టాలు ఎన్నైనా ఉండవచ్చు, మారాల్సింది మన ఆలోచనా విధానమే.

## అర్హులకు గూడు అందలేదన్నందుకు...

భట్రాజులు, భజనపరులే తప్ప ఉన్నదేదో ఉన్నట్లు చెబితే రాజ్యాలు ఎప్పుడూ సహించలేదు. కబీర్ అయితే 'విమర్శకున్ని నీ ఇంటి ముందే ఇల్లు కట్టి పెట్టుకో, నీవు అభివృద్ధి చెందుతావు' అని అన్నాడు. కాని మన పాలకులు విమర్శను, ప్రశ్నలను ఎక్కడా పుట్టకుండా చేద్దామనుకుంటారు. గత ప్రభుత్వం మహిళా చైతన్యాన్ని చూసి 'ఇంత చైతన్యం పనికి రాదని' మండిపడితే, ఈ ప్రభుత్వం 'నోర్ముయ్...' అని అంటోంది. సమస్యకు పరిష్కారాల మాట సరే, అసలు ప్రశ్నను బైటికి రానివ్వకపోతే అభివృద్ధి ఎలా సాధ్యమౌతుంది? 'ప్రశ్న వచ్చిందంటే జవాబు ఉన్నట్లే' అని ఓ మేధావి అంటారు. ఇదంతా ఎందుకంటే ఇందిరమ్మ ఇళ్ల పథకంలో జరుగుతున్న అవినీతిని బైట పెట్టిన కర్నూలు జిల్లా కోడుమూరు ఆంధ్రజ్యోతి విలేకరి శ్రీరాములు, ఆంధ్రభూమి విలేకరి ఉరుకుందప్పలను నవంబర్ 7న అరెస్ట్ చేయడం ఏలికల అసహనానికి పరాకాష్ఠ. నియమ, నిబంధనలకు విరుద్ధంగా 89 వేల ఇళ్ల కేటాయింపులు జరిగాయని అధికారుల స్వచ్ఛంద వెల్లడిలో తెలిసిన విషయమే. అయితే ఈ అవకతవకలను విలేకరులు సాక్ష్యాలతో చూపడమే ప్రభుత్వానికి కంటగింపు అయింది.

## శ్రీకాకుళ పోరాటానికి నలభై ఏళ్లు

శ్రీకాకుళం పోరాటానికి ఈ అక్టోబర్ 31 నాటికి నలభై ఏళ్లు. శ్రీకాకుళం జిల్లా ఏజెన్సీ ప్రాంతంలో 1959-60 నాటికే కమ్యూనిస్టు పార్టీ గిరిజన ప్రజలను సమీకరించి, ఆందోళనలు ప్రారంభించింది. భూస్వాములు దురాక్రమించిన భూములను స్వాధీనం చేసుకోవడం, కూలీ రేట్ల పెంపుకై పోరాటాలు చేపట్టారు. 1961లో మొండెంఖల్లులో మొట్టమొదటి గిరిజన మహాసభ జరిగింది. వెంపటాపు సత్యం, ఆదిభట్ల కైలాసంల నాయకత్వంలో ప్రారంభమైన గిరిజన రైతాంగ పోరాటం, 1967 అక్టోబర్ 31న లేవిడిలో భూస్వామి అనుచరులు జరిపిన కాల్పుల లో కోరన్న, మంగన్నలు చనిపోవడంతో సాయుధ పోరాట రూపాన్ని తీసుకుంది. అప్పటి నుంచి ఇప్పటి దాకా గిరిజనులు పోరాడుతూనే ఉన్నారు. వాకపల్లి తరహా న్యాయాలు వారికి అందుతూనే ఉన్నాయి.

## పట్టపగలైనా స్త్రీలకు భద్రత ఉందా?

కరీంనగర్ జిల్లా తాడ్వాయ్‌కి చెందిన బాలిక (15) సామూహిక అత్యాచారానికి, హత్యకు గురయింది. తన ప్రేమను కాదన్న కారణంగా విశాఖపట్నం శ్రీ చైతన్య కళాశాలలో లెక్చరర్‌గా పనిచేస్తున్న దామోదరం కల్పన అనే విద్యార్థిని పై యాసిడ్‌తో దాడిచేసి గాయపర్చాడు. శ్రీకాకుళం జిల్లాలోని బారువ ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో ప్రిన్సిపాల్ విల్సన్‌రాజు తాగివచ్చి ద్వితీయ సంవత్సరం విద్యార్థినిపై అత్యాచారం చేయబోయాడు. ప్రేమిస్తున్నానంటూ యువకుడు వేధించడంతో కృష్ణా జిల్లా పసుపుబొట్ల పాలెం మహాలక్ష్మి (18) కిరోసిన్ పోసుకొని నిప్పంటించుని దీపావళి రోజు చనిపోయింది. ఇలా రాష్ట్రంలో స్త్రీలపై అత్యాచారాలు, హత్యలు, లైంగిక వేధింపులు, ఆత్మహత్యలు వరుసగా జరిగిపోతున్నాయి. సెప్టెంబర్ నాటికే మహిళలపై నేరాల కేసులు 15,315 నమోదయ్యాయి. వీటిలో వేధింపులకు సంబంధించి 7,534 కేసులు ఉన్నాయని తెలుస్తోంది. వీటన్నిటికీ పరిష్కారాలు కనుగొనాల్సిందే.

## ఆటోలకు మీటర్లు సరే... అవినీతికో?

హైదరాబాద్‌లో అక్టోబర్ 30 నుండి అయిదు రోజులపాటు ఆటో డ్రైవర్లు సమ్మె చేశారు. అరవై లక్షలకు పైగా జనాభా ఉన్న హైదరాబాద్ మహానగరంలో ప్రభుత్వ రవాణా వ్యవస్థను ఒక పథకం ప్రకారం బలహీనపరచడంతో ప్రజలు, ముఖ్యంగా మధ్యతరగతి వారు ఆటోలను ప్రత్యామ్నాయంగా చూడటం, అలవాటుపడటం జరిగిపోయాయి. మరోపక్క నిరుద్యోగ యువతకు ఆటోలు ఒకఉపాధిగా పరిణమించాయి. విధానాల ఫలితంగా పెట్రోలు, డీజిల్ ధరలు క్రమం తప్పకుండా పెరిగిపోతున్నాయి. కల్తీ ఇంధనం, కొలతల్లో మోసాలు, వర్షాలకు కొట్టుకుపోయిన గతుకుల రోడ్లు, వాటితో వచ్చే రిపేర్లు, నాసిరకం విడిభాగాలు, ఫైనాన్స్ వడ్డీలు, ట్రాఫిక్ పోలీసుల చలాన్లు, బండి అద్దె ఇవన్నీ పోగా మిగిలేది కడుపుకి సరిపోవడంలేదు. వీటన్నిటినీ అరికట్ట కుండా మీటర్లలో పరిష్కారం చూపాలనుకోవడం ప్రజలకూ, ఆటో నడిపేవారికీ మధ్య వైరుధ్యంగా సమస్యను చూపటమేగాని సమస్యను పరిష్కరించడం కాదు. మౌలిక కారణాలపై దృష్టి పెట్టనంతవరకు ఆటో సమ్మెలు పునరావృతం అవుతూనే ఉంటాయి. ◆

సంపన్నులకు ఇస్తే అది 'ప్రోత్సాహకం' పేదలకిస్తే అది 'సబ్సిడీ' అయి ప్రభుత్వానికి భారమైపోతుందా అని ప్రశ్నిస్తున్నారు **వి. హనుమంతరావు**

# సబ్సిడీనివ్వటం పాలకుల రాజకీయావసరం

ప్రధాని మన్మోహన్ సింగ్ సబ్సిడీ భూతాన్ని మళ్లీ సీసాలోంచి బయటకు తీసారు. ఆర్థికమంత్రి చిదంబరం 2005లో ఒకసారి, అంతకుముందు ఒకసారి సబ్సిడీ భూతాన్ని చూపించి, ఈ సబ్సిడీలు మన ఆర్థిక వ్యవస్థనే మింగేస్తున్నాయని దేశంలోని సమస్యలన్నీ ఈ సబ్సిడీల మూలానే అన్న అభిప్రాయాన్ని కలగ చేయటానికి ప్రయత్నించారు. అప్పటినుంచి సబ్సిడీలు ప్రతీ ఏటా పెరుగుతూనే వస్తున్నాయి. ఇవి దొంగ అరుపులేనని ప్రస్తుత ఆర్థిక పరిస్థితి చెబుతోంది. మన ఆర్థిక వ్యవస్థ ఎనిమిది నుంచి తొమ్మిది శాతం అభివృద్ధి చెందిందని ఈ ఆర్థికమంత్రే, ఈ ప్రధానే డబ్బా కొట్టుకొంటున్నారు. ఇపుడు ప్రధాని సబ్సిడీభారం లక్షకోట్లకు చేరిందని గుండెలు బాదుకొంటున్నారు. ఇలా ఆందోళనకరస్థాయికి సబ్సిడీలు చేరడానికి కారణం ఆయన 1991లో ప్రవేశపెట్టిన ఆర్థిక సంస్కరణలే, ఆ తర్వాత ప్రభుత్వాలు అవలంబించిన విధానాలే కారణమని తెలియదా? ఎంతసేపూ ఈ సబ్సిడీ భారం పెరగడానికి రైతులకిచ్చే సబ్సిడీలు, చవక దుకాణాలు ఏర్పాటు చేసి తగ్గించిన ధరలకు తిండి గింజలు సరఫరా చేయటం వల్లనే అన్నట్లు చూపించటం, తమ ప్రభుత్వం అవలంబిస్తున్న తప్పుడు విధానాలే అన్న విషయాన్ని దాచిపెట్టడమే. ఎవరు చేసిన తప్పును వారు అంగీకరించక పోవటం మనుషుల బలహీనత. ఆ బలహీనత వ్యక్తి పరమైతే అది ఆ వ్యక్తికే పరిమితమవుతుంది. కాని, 110 కోట్ల జనాభాపై దాని దుష్ప్రభావం పడితే కొంచెం లోతుకుపోయి పరిశీలించాల్సి ఉంటుంది.

## సబ్సిడీ అంటే

వస్తువులకుగానీ, సేవలకు గానీ వాటికయ్యే ఖర్చుకన్నా తక్కువ వసూలు చేస్తే, ఆ తేడాను ప్రభుత్వం భరిస్తే, దానిని సబ్సిడీ అంటోంది ప్రభుత్వం. బతికే హక్కు రాజ్యాంగం హామీ ఇచ్చింది. ప్రజలు బతకాలంటే తిండి, నీళ్లు, ఆరోగ్యం సమకూర్చాలి. ఇళ్లు, దుస్తులు – వీటన్నింటికీ ప్రభుత్వం హామీ ఇవ్వాలి. వాటిని సమకూర్చుకునే శక్తి ప్రజలకు లేకపోవడం వల్ల, అందుకు పేదరికమే కారణం కావటం వల్ల, ఆ పేదరికాన్ని అరవై సంవత్సరాల తర్వాత కూడా ప్రభుత్వాలు నిర్మూలించ లేకపోవడం వల్ల, ప్రజలకు ప్రభుత్వం కొంతమేరకు చేయవలసిన సహాయమే సబ్సిడీ. ఈ పరిస్థితి కల్పించింది ప్రభుత్వమే కాబట్టి, రాజ్యాంగం హామీ ఇచ్చిన హక్కును ప్రజలకు అందుబాటులోకి తేవడానికి సబ్సిడీ ఇవ్వవలసిన పరిస్థితి ఏర్పడింది. ప్రభుత్వం నుంచి ఈ సహాయాన్ని సాధించుకునే హక్కు ప్రజలకు ఉంది. ఉదాహరణకు, తిండి గింజల్ని చవక ధరలకు లభింపచేసినా, ఆ ధరలకు కూడా ప్రజలు వాటిని కొనలేని పరిస్థితిలో ఆకలి చావులకు గురవుతారు. సబ్సిడీ విధానం మీద విరుచుపడేవాళ్లు ఈ సత్యాన్ని గుర్తించాలి. ఎవరైనా ఈ విషయమై ప్రభుత్వాన్ని కోర్టుకు ఈడ్చవచ్చు. కోర్టుతీర్పు ఆ పిటిషనర్‌కు అనుకూలంగా వచ్చి తీరుతుంది. ఆ ఇబ్బందిలో పడకుండా ప్రభుత్వం సబ్సిడీ పథకాన్ని ప్రవేశపెట్టి తన అధికారాన్ని రక్షించుకుంటోంది. కేవలం పేదలకు, అవసరమైన వారికి అందేలా సబ్సిడీలను పరిమితం చేయడం కనీస ఉమ్మడి కార్యక్రమం లక్ష్యంగా నిర్ణయించి, దానిని అమలు పరచడానికి ప్రభుత్వం వాగ్దానం చేసింది. ఈ వాగ్దానాన్ని అమలు పరిచే దిశగా 2005లోనే ఢిల్లీలోని ఒక పరిశోధనా సంస్థను, సబ్సిడీల గురించి ఒక ప్రాతిపదిక పత్రాన్ని తయారు చేయమని ఆర్థిక మంత్రిత్వ శాఖ కోరింది. ఆ సంస్థ ఒక నివేదికను తయారు చేసి పంపగా, ఆ నివేదిక తమ ప్రజా వ్యతిరేక లక్ష్యాలకు అనుకూలంగా లేదని కాబోలు, తిప్పి పంపి, సవరించి పంపమని కోరడం గమనార్హం. ఆ పత్రం సహాయంతో సబ్సిడీ పత్రాన్ని ఒకదానిని పార్లమెంట్‌కు నివేదించారు. ఆ పత్రంలో సబ్సిడీల వివరాలున్నాయి. ఆ పత్రం కేంద్రప్రభుత్వం ప్రత్యక్షంగా ఇచ్చే సబ్సిడీల గురించి ప్రస్తావించింది గాని, పరోక్షంగా ఇచ్చే సబ్సిడీల గురించి ప్రస్తావించకపోవడం ఒక పెద్ద లోపం. ఇది లోపం అనేదానికన్నా – కావాలనే పరోక్ష సబ్సిడీలనే ముసుగు కింద దాచి పెట్టింది. ఎందుచేతనంటే, వాటిని కూడా ఈ నివేదికలో చర్చించి ఉంటే, ప్రభుత్వం బండారం బయటపడి ఉండేది. సంపన్నులు, వ్యాపారస్తులు, పారిశ్రామికవేత్తలకు ఇచ్చే సబ్సిడీలన్నీ ఆ ముసుగు కిందనే ఉన్నాయి. అసలు సబ్సిడీ నిర్వచనమే తప్పుడు నిర్వచనమని ఆచరణలో తేలింది. ఉదాహరణకు మన రాష్ట్రాన్నే తీసుకొంటే, శంషాబాద్ విమానాశ్రయం కోసం, బిజినెస్ స్కూలు కోసం కేటాయించిన భూములు లక్షల విలువచేసేవి కాగా, వాటిని కొన్ని వేలకే అమ్మకం చేయడం సబ్సిడీ కాదా? ప్రోత్సాహకాలు, మినహాయింపులు, అయిదు నుంచి పది సంవత్సరాల వరకు పన్నుల వసూళ్లు వాయిదా వేయడం, పారిశ్రామికవేత్తల నుంచి బ్యాంకులకు రావాల్సిన మొండిబాకీలను ముక్కు పిండి వసూలు చేయకుండా తాత్సారం చేయడానికి ప్రభుత్వం పరోక్షంగా తోడ్పడడం లాంటివన్నీ సబ్సిడీలే. హిందూ బిజినెస్‌లైన్ పత్రికలో వార్తప్రకారం ఎగుమతిదార్లకు ముట్టచెబుతున్న ప్రోత్సాహకాలు

రు. 40 వేల కోట్లు. ఇలాంటి సబ్సిడీలను ముసుగు కింద దాచిపెట్టి, ప్రత్యక్షంగా ఇచ్చే సబ్సిడీలనే నివేదికలో ఉదహరించి, అందులో రు. 25 వేల కోట్లు ఆహార సబ్సిడీ, ఎరువుల సబ్సిడీ అని నమ్మబలికి, రైతులకేదో దోచిపెట్టేస్తున్నట్లు ఆ నివేదిక తయారు చేసిన సంస్థ చెబితే, దాన్ని ప్రభుత్వం ఆమోదించడంలోనే కేంద్ర ప్రభుత్వ రైతు వ్యతిరేక వైఖరి స్పష్టమవుతోంది. సంపన్నులకు ఇస్తే అది 'ప్రోత్సాహకం' పేదలకిస్తే అది 'సబ్సిడీ' అయి ప్రభుత్వానికి భారమైపోతోంది. ఈ రైతు పేరుతో ఇచ్చే సబ్సిడీల్లో గమనించాల్సిన విషయాలు కొన్ని ఉన్నాయి. 1) ప్రభుత్వమే నియమించిన ధరల నిర్ణాయక కమిటీ, దేశ వ్యాపితంగా వివిధ ప్రాంతాల్లో వ్యవసాయానికయ్యే ఖర్చులను గమనంలోకి తీసుకొని కనీస ధర నిర్ణయిస్తుంది. ఆ ధర నిజంగా గిట్టుబాటు ధరేనా అనే విషయం అలా ఉంచి, ఆ ధరకు మించి కేంద్రం తన రాజకీయ అవసరాల కోసం, ఓట్లు దండుకోవడం కోసం ధరను పెంచి, ఆ పెంపుదల వల్ల అయ్యే అదనపు ఖర్చును కూడా వ్యవసాయానికిచ్చిన సబ్సిడీగా చిత్రిస్తుంది; 2) ఇలా హెచ్చుధర నిర్ణయించడంతో ధనికరైతులు తమ పంటనంతా ఆహార సంస్థకే అమ్ముతూ వచ్చారు. ఈ ధాన్యాన్ని దాచడానికి గోదాముల ఖర్చునూ, ధాన్యాన్ని కొనుగోలు చేయడానికి వెచ్చించిన సొమ్ముమీద వడ్డీనీ వ్యవసాయం ఖాతాలో చూపడం జరుగుతోంది; 3) ఈ బియ్యాన్ని చవక దుకాణాల ద్వారా సరఫరా చేయబోతే, పేద ప్రజల చేతుల్లో కొనుగోలు శక్తి లేకపోవడంతో, ఆ తిండిగింజలన్నీ ఆహార సంస్థ వద్దనే మేట వేసుకపోతున్నాయి. ఇలా కార్పొరేషన్ కయ్యే ఖర్చు కూడా వ్యవసాయం ఖాతాలో చూపిస్తున్నారు; 4) అసలు రైతు ఉత్పత్తికి ప్రభుత్వం ధర నిర్ణయించడమేమిటి, పారిశ్రామిక ఉత్పతుల ధరలను కూడా అలా ఎందుకు నిర్ణయించదు, అది రైతు వ్యతిరేక విధానం కాక మరేమిటనే వాదన కూడా ఉంది; 5) అయినా, మనదేశంలో రైతుకు నేరుగా ఇచ్చే సబ్సిడీ ఇతర దేశాలలో ఇచ్చే సబ్సిడీతో పోలిస్తే ఏ పాటిది?; 6) నిజంగా నిరుపేదలకు మాత్రమే చవక బియ్యం సరఫరా చేయాలనే పేరుతో కోట్లాది ఇతర పేదలను మార్కెట్ మీద ఆధారపడేలా చేయడంతో, చవక దుకాణాల ద్వారా తిండి గింజల విడుదల తగ్గి, గోదాముల నుంచి తిండిగింజలు విడుదల కాక, ఖర్చు పెరిగితే, అది కూడా వ్యవసాయం ఖాతాలో వేస్తున్నారు; 7) ఇప్పుడీ సబ్సిడీలను ఇస్తుంటేనే నిరుపేదలు కొనుక్కోలేని పరిస్థితి ఉండగా, మార్కెట్ శక్తులు రంగప్రవేశం చేయడానికి ప్రభుత్వం అవకాశం ఇచ్చినపుడు, ఆ హెచ్చు ఖరీదును పేదలు భరించగలరా? అది మరిన్ని ఆత్మహత్యలకు దారి తీయదా?; 8) వ్యవసాయం పేరుతో ఇచ్చే సబ్సిడీలన్నీ ఆచరణలో సంపన్నులే కాజేస్తున్నారని అనేక పరిశోధనలు వెల్లడించాయి. వారి కొమ్ముకాసే ప్రభుత్వాలు, ఆ సబ్సిడీని ఎందుకు ఉపసంహరిస్తాయి?; 9) ఎరువులకిచ్చే సబ్సిడీలు రైతుకివ్వడం లేదు; అవి ఎరువులు తయారు చేసిన కంపెనీలకు ముడుతున్నాయి.

## సబ్సిడీల్లో రెండు భాగాలు

ప్రభుత్వం సబ్సిడీలను రెండు భాగాలుగా విభజించింది. ప్రాథమిక విద్య, ప్రాథమిక ఆరోగ్యం, రోగ నివారణ, సామాజిక సంక్షేమం, భూసార రక్షణ, పర్యావరణ రక్షణ ఒక భాగమైతే, ఉన్నత విద్య, కుటుంబ సంక్షేమం, వ్యవసాయ పరిశోధన, భూ సంస్కరణలు, వరద నివారణ, ముంపు నివారణ రెండవభాగం. రెండవ భాగంలో ఇచ్చే సబ్సిడీలు ఇవ్వదగినవా అనే వాదం పక్కన పెడితే, ఈ రెండు భాగాలకిచ్చే సబ్సిడీలు మొత్తం సబ్సిడీ ఖర్చులో 34 శాతమైతే, సబ్సిడీకి అర్హతలేకపోయినా, ఇస్తున్న సబ్సిడీ 66 శాతం (2002-03) ఇది తర్వాత సంవత్సరంలో 58 శాతానికి తగ్గింది. అర్హత లేని సబ్సిడీలను ఎందుకు ఉపసంహరించరు? ఉదాహరణకు కొత్త పరిశ్రమలకు అయిదు శాతం పన్నురాయితీ అనేది, ఆ తరగతులకు సబ్సిడీ ఇవ్వడమే. అలాంటి సబ్సిడీని ఉపసంహరించవచ్చు కదా, కాని ఉపసంహరించరు. ఎందు చేతనంటే వాటిని భోంచేస్తున్న వర్గాలకూ ప్రభుత్వానికీ చుట్టరికం అలాంటిది.

1991లో సంస్కరణలు ప్రవేశపెట్టిన నాటి నుంచి సబ్సిడీలను కత్తిరించి, యూజర్ ఛార్జీలు వసూలు చేయాలనే ప్రపంచ బ్యాంకు షరతుల మేరకు వీలు దొరికినపుడల్లా సాధారణంగా సబ్సిడీల మీద, ప్రత్యేకంగా పేదలకిచ్చే ఆహార సబ్సిడీల మీద, వ్యవసాయ సబ్సిడీల మీద యుద్ధం సాగిస్తూనే ఉన్నారు. మరో మాటలో చెప్పాలంటే, 'మీకు సబ్సిడీ ఇచ్చేది లేదు, మీ చావేదో మీరు చావండి' అని పరోక్షంగా పేదలకు, రైతాంగానికి చెప్పడమే. సబ్సిడీల మీద తాజా నివేదిక కూడా ఆ వర్గాలమీద సంధించిన మరో బాణమే. దేశంలో ఆర్థిక సమస్యలన్నిటికీ ఈ సబ్సిడీలే కారణమనే విధంగా ప్రచారం సాగుతోంది.

## గుట్టు రట్టు చేసే గణాంకాలు

ఇంత చిన్న మొత్తానికి అంత పెద్ద అర్భాటమెందుకు? పశ్చిమ దేశాల్లో నిరుద్యోగులకిచ్చే సహాయం, ఆయా ప్రభుత్వాల కరెంట్ వ్యయం లో సగానికి సగం ఉంది. దేశంలో పారిశ్రామికవేత్తలు ఎగ్గొట్టడానికి ప్రయత్నిస్తున్న మొండి బకాయిలను వసూలు చేస్తే ఆ మొత్తంలో ఆహార సబ్సిడీ సంవత్సరాల పాటు ఇవ్వవచ్చు. సబ్సిడీల గురించి 1997లో ప్రభుత్వం ప్రకటించిన మొదటి నివేదిక ప్రకారం ప్రత్యక్ష, పరోక్ష సబ్సిడీల గురించి ప్రస్తుత నివేదిక ప్రస్తావించకపోవడంలో అసలు రహస్యం ఇదే. ఆ గణాంకాలు కూడా ప్రచురిస్తే గుట్టురట్టు అవుతుంది. అనర్హులకు సబ్సిడీలు ఇవ్వకూడదని ఒకవైపు విధాన ప్రకటన చేస్తూ మరోవైపు వారికే సబ్సిడీలు అందచేస్తూంటే, అలాంటి ప్రభుత్వాన్నేమనాలి? ఉదాహరణకు యూరియా ఎరువులపై సబ్సిడీనే తీసుకొంటే, సేద్యపు నీటి సౌకర్యం బాగా ఉన్న ప్రాంతాల్లో అది ధనిక రైతులకే ఉపయోగ పడుతుంది. జొన్న, కంది, ఉలవ వంటి మెట్ట పంటలు పండించే బీదాబిక్కి రైతులకు యూరియా అవసరమే ఉండదు. కాబట్టి యూరియాపై సబ్సిడీ వల్ల బాగుపడేవారు యూరియా ఉత్పత్తిదారులు, ధనిక రైతులే. ఈ నివేదిక మీద ప్రభుత్వం నిర్ణయం తీసుకోనే ముందు దానిని పార్లమెంట్‌లో ప్రవేశపెట్టి ప్రజా ప్రతినిధులు వెలిబుచ్చిన అభిప్రాయాలను గణనలోకి తీసుకొని అవసరమైన మార్పులు చేయాలి.

## సబ్సిడీలు రాజకీయ అవసరమే

సబ్సిడీ ఇవ్వటం పాలకులకు రాజకీయ అవసరం. ప్రజలు స్వశక్తితో నిలబడగలిగితే, తమ విచక్షణను ఉపయోగించుకొనే అవకాశం

ఉంటుంది. అందువల్ల పాలకులు తమ అధికారాన్ని కాపాడుకోవాలంటే, ప్రజలు తమ అవసరాలను తీర్చుకోలేని పరిస్థితిలో ఉండాలి. ఎప్పుడూ ప్రభుత్వ సహాయం కోసం ఎదురు చూస్తూ ఉండాలి. ఎన్నికల్లో ఓట్లు పడాలంటే 'సహాయం' అనే తాయిలం చూపాలి. అందుచేత సబ్సిడీ విధానాన్ని రద్దు చేయడమనేది జరగదు. ఈ విధంగా ప్రభుత్వం సబ్సిడీలు ఇవ్వడం పేదల అవసరమే కాదు, రాజకీయ నాయకుల అవసరం కూడా. అయితే, సబ్సిడీ పథకాన్ని పూర్తిగా రద్దు చేయకుండా అనేక రకాల మతలబులతో ఆ భారాన్ని తగ్గించుకోవడానికి పాలకులు ప్రయత్నిస్తున్నారు.

సబ్సిడీ పథకాలను కొనసాగించాలంటే కోట్ల రూపాయలు ఖర్చు చేయాలి. సబ్సిడీలలో మూడవ వంతు వ్యవసాయానికే పోతోంది. అలా సబ్సిడీల వల్లనే, విదేశాల మీద ఆధారపడకుండా తిండి గింజలు పండించు కోగలుగుతున్నాం. కాని అది స్వయం పోషకత్వం కాదు. 26 శాతం మంది పేదరికపు రేఖకింద ఉండి ఒక పూట తిని, మరోపూట తినక జీవిస్తున్నారు. వారంతా తినగలిగితే మనం పండించే 210 కోట్ల టన్నుల తిండిగింజలు చాలవు. ఇంకా ఎక్కువ పంట పండించాలి. అందుకు పెట్టుబడులు పెట్టాలి. కానీ, ఆర్థిక సంస్కరణలు ప్రవేశ పెట్టిన తర్వాత వ్యవసాయంలో పెట్టుబడులు క్షీణించాయి. ఉత్పత్తి పెరుగుదల కూడా క్షీణించింది. అసలు వ్యవసాయానికో విధానాన్నే రూపొందించని ఘనత మన ప్రభుత్వాలదే. అర్థ శతాబ్దాం తర్వాతే ఒక విధాన పత్రం అంటూ రూపుదిద్దుకొంది. తమకు అవసరమైన తిండి గింజలు పండించుకోలేని రాష్ట్రాలు ఇతర రాష్ట్రాల మీద ఆధారపడవలసి వస్తోంది. పంజాబ్, హర్యానా, ఆంధ్రలో కొన్ని జిల్లాలలో ఎనభై శాతం పైగా బియ్యం సేకరించి, వెనుకబడిన రాష్ట్రాలకు తరలించవలసి వస్తోంది. అలా తరలించడానికి రవాణా, పరిపాలనా వ్యవస్థలకు ఎక్కువ ఖర్చు చేయవలసి వస్తోంది. అనేక రాష్ట్రాల్లో తలసరి తిండిగింజల ఉత్పత్తి చాలా తక్కువ. ఈ హెచ్చుతగ్గులు విధాన వైఫల్యం. వర్షాలు, నేల స్వభావం దృష్ట్యా పంటలు అన్ని రాష్ట్రాల్లో ఒకేలా ఉండకపోవచ్చు గాని, ఉత్పాదతకత పెంచడానికి వీలుంది. విధానాల ఫలితమే వైఫల్యంలో ఇంతకంటే ముఖ్యమైన అంశం – భూ సంస్కరణలను అమలు పరచి, దున్నేవారికే భూమిని ఇవ్వలేకపోవటం. భూమి ఉంటే, బొటాబొటిగా నైనా భుక్తికి సరిపోతుంది. తిండిగింజల కోసం జనం ప్రభుత్వ చౌక దుకాణాలకు పరుగులు తీయవలసిన పనిఉండదు. సబ్సిడీ ఖర్చు అసలు ఉండదు. తలబరువైన ఫుడ్ కార్పొరేషన్ ఖర్చు ఉండదు. ఆర్థిక మంత్రి సబ్సిడీల గురించి నివేదికలు తయారు చేయించవలసిన పని ఉండదు.

## ప్రపంచబ్యాంకు ఒత్తిడి

సబ్సిడీల మీద ప్రభుత్వం ఇలా విరుచుకుపడటానికి మరో ముఖ్య కారణం, ప్రపంచబ్యాంకు ఒత్తిడి. ఆ బ్యాంకు రుణం ఇవ్వడానికి సబ్సిడీల తొలగింపు ఒక ప్రధానమైన షరతు. ప్రభుత్వం ప్రజలకు ఎటువంటి సేవలు అందించాలన్నా సర్వీస్ ఛార్జీలు వసూలు చేసి తీరాలని బ్యాంకు ప్రాథమిక షరతు. ఈ షరతులకు తల ఒగ్గడం వల్లనే రైతుకు ఎరువుల సబ్సిడీపై కోత విధించారు. చవక దుకాణాల్లో ధరలు పెంచారు. నీటి తీరువా పెరిగింది. ఈ దృష్ట్యా, రాజకీయ అవసరాల దృష్ట్యా ప్రభుత్వం కనీస మద్దతు ధర పెంచటం, అది ద్రవ్యోల్బణానికి దారితీయడం జరుగుతోంది. ఇది ఆర్థిక వ్యవస్థను అతలాకుతలం చేస్తోంది. అలా ఇబ్బందుల్లో పడితేనే భారతదేశం రుణాల కోసం బ్యాంకువైపు చూస్తోంది. అప్పుడే తమ వడ్డీ వ్యాపారం సజావుగా సాగుతుంది.

పేదరికపు రేఖ కింద ఉన్న వారందరికీ సబ్సిడీ ధరకు తిండి గింజలను అందించటం ప్రభుత్వ విధానం. ఈ నిర్ణయం సబబుగానే ఉన్నట్లు అనిపిస్తుంది. కాని, పేదరికం అంటే నిర్వచనం ఏమిటి? ఆ రేఖకు ఎగువ ఉన్నవారందరూ చవక ధరల దుకాణాల వద్దకు వెళ్లవలసిన అవసరం లేనంత ధనవంతులా? ప్రభుత్వ నిర్వచనం ప్రకారం ఏడాదికి రు. 15 వేల ఆదాయం పైన ఉన్న వారందరికీ సబ్సిడీ బియ్యం లభించవు. అంటే రోజుకు రు. 7.53లు ఆదాయం ఉన్న వారందరూ ప్రభుత్వం దృష్టిలో ధనవంతులే. వీరంతా టార్గెట్ గ్రూపులోకి రారు. ఇదెంత దారుణమైన నిర్వచనమో చెప్పవలసిన పనిలేదు.

సబ్సిడీ అంటే, నిరుపేదలకు ఇచ్చే సబ్సిడీ బియ్యమేనా? ఇంక మరెవరికీ సబ్సిడీ ఇవ్వడం లేదా? సబ్సిడీ విధానం మీద గుడ్లురిమి చూసేవారంతా సబ్సిడీలు మింగుతున్నవారే. ఇంట్లో విద్యుద్దీపం, వంటింట్లో గ్యాస్, ఆర్టిసి బస్సుల్లో ప్రయాణం, కిరసనాయిలు – సబ్సిడీలెన్నో ఉన్నాయి. మోటారు సైకిల్, కారు సబ్సిడీ ధరకు సరఫరా చేసే పెట్రోలుతోనే నడుస్తున్నాయి. వాటికే కాదు, అనేక ఇతర ధనికవర్గాలు, పారిశ్రామికవేత్తలు సబ్సిడీలు భోంచేస్తున్నారు. అయితే వారందరికీ ఇచ్చే సబ్సిడీలకు 'ప్రోత్సాహకాలు' అనే పేరు పెట్టారు.

ఉదాహరణకు పరిశ్రమలు, గనుల రంగానికి 14.25 శాతం, అనేక ఆర్థిక సేవలకు 22.4 శాతం సబ్సిడీలు ముదుతున్నాయి. ఎగుమతిదార్లకు ప్రోత్సాహకాలు, మినహాయింపులు వగైరా పేర్లతో ఇచ్చే సబ్సిడీ సంవత్సరానికి రు. 39 వేల కోట్లు. వారందరికీ సబ్సిడీలు, ప్రోత్సాహకాలు ఇవ్వటం దేశం అభివృద్ధి కోసమేనని చెబుతున్నారు. కాని 110 కోట్ల ప్రజలకు తిండిగింజలు పండించే రైతుకు ఇచ్చే సబ్సిడీ ప్రభుత్వానికి భారం అయిందట. సబ్సిడీ విషయంలో వివక్ష చూపటం రాజ్యాంగ విరుద్ధం.

ప్రస్తుతం ప్రభుత్వం రూపొందించుకొన్న కనీస ఉమ్మడి కార్యక్రమం ప్రకారం 'సబ్సిడీలను నిజంగా నిరుపేదలైన వారికి, అవసరమైన వారికి అందచేస్తాం' అని హామీ ఇచ్చింది. ప్రభుత్వానికి పేద ప్రజలంటే ఎంత ప్రేమో అనిపిస్తుంది. అయితే సమాజంలో ఇతర వర్గాలకు ప్రోత్సాహకాల పేరుతో ఇచ్చే సబ్సిడీలు మానేస్తారా? దేశంలో 70 శాతం భూకమతాలు చిన్న, సన్నకారు రైతులవే. అంటే సబ్సిడీలు ఈ 70 శాతం మందికీ ఇస్తారా? ఇస్తే సమస్యే లేదు. అలా ఇవ్వదలచుకొన్నప్పుడు సబ్సిడీల మీద రచ్చ రేపడమెందుకు, నివేదిక అవసరమేమిటి? ఈ నివేదికకు, ఇదివరకు తయారు చేయించిన నివేదికకు తేడా ఏమిటి? అప్పుడూ, ఇప్పుడూ నిజమైన పేదలకే సబ్సిడీలు ఇవ్వాలని రెండు నివేదికలూ సిఫార్సు చేశాయి. వాటిని గతంలో ఎందుకు అమలు పరచలేదు? ఈ ప్రశ్నలకు ఆర్థికమంత్రి చిదంబరం సమాధానమివ్వాలి. ◆

పంటల మద్దతు ధరను నిర్ణయించడంలో హేతుబద్ధతను, ఉత్తర దక్షిణ ప్రాంతాల మధ్య అందిస్తున్న సహకారంలోని వ్యత్యాసాలను ప్రశ్నిస్తున్నారు **మట్టెవాడ చంద్రకళ, రాపర్తి శ్రీనివాస్**

# వరికి ప్రభుత్వం వెయ్యి ఇస్తుందా?

దక్షిణభారత దేశంలో ప్రధాన ఆహారం వరి, ఉత్తరభారత ప్రజలకు ముఖ్య ఆహారం గోధుమ ఆహార పంటలలో ముఖ్యమైనవి. దక్షిణ భారతదేశంలో వరికి ఈ ఏడాది ఖరీఫ్ సీజన్ మొదటి నుంచి రైతాంగానికి సానుకూలంగానే ఉంది. ప్రధాన పంటల సాగు విస్తీర్ణం కూడా పెరిగింది. పంటల దిగుబడుల అంచనాలు ఆశాజనకంగా ఉన్నాయి. అన్ని బాగానే ఉన్నాయి అనుకున్న దశలో పంటలకు ప్రభుత్వం మద్దతు ధరలు ప్రకటించడం లేదు. ఆరుగాలం కష్టపడి పండించిన పంటలకు కనీస మద్దతు ధర కూడా లభించని పరిస్థితి నెలకొంది. దీంతో రైతాంగంలో అందోళన నెలకొంది. కొన్నింటికి వరి, గోధుమతో సహ ఆయా పంటలకు మద్దతు ధరలను ప్రకటించిన కేంద్రంలోని ఆర్థిక వ్యవహారాల మంత్రివర్గ సంఘం గోధుమ మద్దతు ధరను క్వింటాల్‌కు రు. 750 నుంచి రు. 1000లకి అంటే రు. 250 పెంచి వరికి మాత్రం రు. 50 బోనస్‌గా ప్రకటించి చేతులు దులుపుకుంది. గోధుమ మద్దతు ధరను పెంచడం హర్షంచవలసినదే. అదే సమయంలో వరి పట్ల ఈ చిన్న చూపు దేనికన్నదే ప్రశ్న? మద్దతు ధర నిర్ణయంలో ఏ మాత్రమైన హేతుబద్ధతను పాటిస్తున్నారా అన్నది మరో ప్రశ్న. గోధుమ సాగు కంటే వరిసాగుకి ఎక్కువ పెట్టుబడి పెట్టాలి. రెండింటి దిగుబడి మధ్య తేడా పెద్దగా ఉండదు. సాధారణ రకం వరి మద్దతుధర క్వింటాల్‌కి రు. 645, 'ఎ'గ్రేడ్ రకానికి రు. 675లు అయినప్పుడు; మొక్క జొన్న మద్దతు ధర రు. 625 అయినప్పుడు పెద్దగా వ్యయ ప్రయాసలు లేని జొన్నవైపే వరి రైతుమొగ్గడా? సూత్రరీత్యా; పెట్టుబడి వ్యయం, ఇప్పటి ధరలలో హెచ్చుతగ్గులు మార్కెట్‌ధరతో సహా 11 అంశాల అధారంగా వ్యవసాయ ధర నిర్ణయించాలి. వ్యవసాయం ఏటా 20 శాతం పెరుగుతుంటే మద్దతు ధర 5 శాతం పెరగడం లేదు. ధాన్యం మద్దతు ధరను ప్రకటించటంలో కేంద్ర ప్రభుత్వం వివక్ష చూపుతుందన్న వాదనలో వాస్తవం లేదని ఒకపక్క అంటుంటే, మరోపక్క ఉత్తరాది పంటలకు అధికంగా మద్దతు ధర ఇస్తూ దక్షిణాది పంటలను నిర్లక్ష్యం చేస్తున్నారని విమర్శలు వస్తున్నాయి.

| దేశంలోని వరి పంటను సాగుచేసే ప్రధాన రాష్ట్రాల వివరాలు | | |
|---|---|---|
| రాష్ట్రం | సాగువిస్తీర్ణం (లక్షల హెక్టార్లలో) | దిగుబడి (లక్షలటన్నులలో) |
| పశ్చిమబెంగాల్ | 57.83 | 148.85 |
| ఉత్తరప్రదేశ్ | 53.39 | 95.56 |
| ఒరిస్సా | 44.72 | 64.66 |
| చత్తీస్‌ఘడ్ | 37.47 | 43.83 |
| బీహార్ | 31.23 | 24.72 |
| ఆంధ్రప్రదేశ్ | 30.86 | 96.01 |
| పంజాబ్ | 26.47 | 104.37 |
| అస్సాం | 23.77 | 34.71 |
| తమిళనాడు | 18.73 | 50.62 |
| మధ్యప్రదేశ్ | 16.22 | 11.69 |
| మూలం : వార్త దినపత్రిక, 28 అక్టోబర్, 2005 | | |

ఆంధ్రప్రదేశ్ ప్రధానంగా వ్యవసాయ రాష్ట్రం. ప్రజలు వ్యవసాయం దాని అనుబంధ రంగాలపై ఆధారపడి జీవిస్తున్నారు. రాష్ట్రంలో 47శాతం పంట భూమి ఉంది. కాగా, రైతులు ఎక్కువగా ఆహార పంటలు పండించడానికి ప్రాధాన్యత ఇస్తున్నారు. మొత్తం వ్యవసాయ భూమిలో 87 శాతం ఆహార పంటలు పండిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో ఏటా 12 మిలియన్ టన్నులు, పశ్చిమబెంగాల్‌లో 15 మిలియన్ టన్నులు, ఉత్తరప్రదేశ్‌లో 12 మిలియన్ టన్నులు, పంజాబ్‌లో 10 మిలియన్ టన్నుల బియ్యం ఉత్పత్తి అవుతోంది. ఉత్పత్తి వ్యయాన్ని పరిగణనలోకి తీసుకుని మద్దతు ధరలను కేంద్రం ప్రకటిస్తుంది.

వరిపంట పండించటంలో రైతులు ఎన్నో సమస్యలను ఎదుర్కోవాల్సి వస్తోంది. వరదలతో రైతులకు పంటనష్టం వాటిల్లడం, అతివృష్టి, అనావృష్టి, నీటి పారుదల సౌకర్యలు లేకపోవడం, విద్యుత్ సమస్య, వీటితో పాటు తాము పండించిన పంటను మార్కెట్లో అమ్మేటప్పుడు ఎన్నో మోసాలను ఎదుర్కొలేక నష్టపోతున్నారు. వ్యవసాయ ఖర్చులు బాగా పెరిగిపోయాయి. వ్యవసాయ పెట్టుబడులపై సబ్సిడీలు నామమాత్రంగా ఉన్నాయి. మనదేశంలో నామ మాత్రంగా 2.7 శాతాన్ని మాత్రమే అదీ ఎరువుల ద్వారా సబ్సిడీ ఇస్తున్నారు. ఇదికూడ కొద్దిమంది రైతులకు మాత్రమే. ఏయే పంటలకు ఎంత మద్దతు ధర ఉండాలన్న విషయాన్ని పరిశీలించడానికి ఉన్నతాధికారులతో కూడిన కమిటీని నియమిస్తున్నట్లు ప్రభుత్వం పేర్కొన్నది. గోధుమ మద్దతు ధరతో సమానంగా వరికి మద్దతు ధర కల్పించాలని అందరు గగ్గోలు చేస్తున్నారు. వరి మద్దతు ధర వివాదంపై ఒక కమిషన్ ఏర్పాటు చేయాలి. ప్రొ. స్వామినాథన్ నేతృత్వంలో జాతీయ వ్యవసాయ

| గోధుమ, వరి మద్దతు ధరలు | | |
|---|---|---|
| సంవత్సరం | వరిధాన్యం మద్దతు రేటు | గోధుమ మద్దతు రేటు |
| 1990-91 | 230 | 225 |
| 1992-93 | 270 | 250 |
| 1993-94 | 310 | 330 |
| 1994-95 | 340 | 350 |
| 1995-96 | 360 | 360 |
| 1996-97 | 380 | 380 |
| 1997-98 | 415 | 475 |
| 1998-99 | 440 | 510 |
| 1999-2000 | 490 | 550 |
| 2000-01 | 510 | 580 |
| 2001-02 | 530 | 610 |
| 2002-03 | 530 | 620 |
| 2003-04 | 550 | 630 |
| 2004-05 | 560 | 640 |
| 2005-06 | 570 | 700 |
| 2006-07 | 620 | 850 |
| 2007-08 | 695 | 1000 |
| మూలం : వార్త దినపత్రిక, 28 అక్టోబర్, 2005 | | |

కమిషన్ వంటల మద్దతు ధర నిర్ణయ విధానానికి కొన్ని సూచనలు ఇచ్చింది. రైతుల ఖర్చు 50 శాతం చేర్చి కనీస అదనపు ధర నిర్ణయించమని అక్టోబర్, 2006 లో కేంద్ర ప్రభుత్వానికి కమిషన్ నివేదిక సూచన. ఈ సూచనను బట్టి వరి మద్దతు ధరను (క్వింటాల్) రు 800 పెట్టుబడి 50 శాతం అదనం కలిపి రు. 1200గా, చెరకు మద్దతు ధర రు. 1200, 50శాతం పెట్టుబడి అదనంగా రు.1800, పత్తి మద్దతు ధర క్వింటాల్ రు. 2000, 50 శాతం పెట్టుబడితో కలిపి రు. 3000గా, పాల ధరను లీటరుకు రు. 14 పెట్టుబడి 50 శాతం అదనంగా వెరసి రు.21గా నిర్ణయించవలసిన అవసరం ఉంది. చాల మంది రైతులకు జాతీయ కమిషన్ ఒకటి ఉందనీ, అది ఈ మధ్య ఒక నివేదికను కేంద్ర ప్రభుత్వానికి ఇచ్చిందనీ, ఈ నివేదికను తక్షణం అమలు చేయాల్సిన బాధ్యత కేంద్ర ప్రభుత్వంపైన ఉందన్న సంగతి తెలియదు. మరోవైపు వరి మద్దతు ధర వెయ్యి ఇవ్వాల్సిందే అని ఇటు ప్రతిపక్షాలు, రైతులు అందరు ప్రభుత్వాల పైనా ఒత్తిడి తీసుకొస్తున్నారు. చివరికి కేంద్ర వ్యవసాయ మంత్రి శరద్‌పవార్‌కూడా! గోధుమకి, వరికి మధ్య ధరలో ఇంత వ్యత్యాసం సరికాదని స్పష్టంగా చెప్పారు. ఇతర దేశాల్లో ఇస్తున్నట్లుగా మన దేశంలోనూ సబ్సిడి ఇవ్వాలి. బోనస్‌ను మద్దతుధరలో కలపాలి. భారత ఆహారసంస్థ, పౌరసరఫరాలశాఖ, మార్క్‌ఫెడ్, వ్యవసాయ మార్కెట్ కమిటీలు, ఇతర ప్రభుత్వ సంస్థలు రైతునుంచి నేరుగా ధాన్యాన్ని కొనుగోలు చేసి వాటిని మిల్లింగ్ చేసి ప్రజాపంపిణి వ్యవస్థ ద్వారా ప్రజలకు అందుబాటులో ఉండేటట్లు చేస్తే అటు రైతులకు ఇటు ప్రజలకు లాభం చేకూరుతుంది.

ప్రభుత్వం పనిచేయడం లేదని చెప్పడంలేదు రైతులకు ఉపయోగపడినా పడక పోయినా విస్తరణ కార్యక్రమాలు పెద్ద ఎత్తున చేపడుతోంది. రైతుల సంక్షేమమే తమ ధ్యేయమని పదే పదే పాలకులు ప్రకటించుకుంటున్నారు. ఎన్ని ప్రభుత్వాలు మారినా తమ పరిస్థితి మాత్రం మారడం లేదని రైతులు వాపోతున్నారు. ఇతర దేశాలతో పోల్చితే మన రైతులకు ప్రభుత్వం ఇస్తున్న సబ్సిడీ చాల తక్కువ. అమెరికా లాంటి దేశాలు 28 శాతం నుంచి 75 శాతం వరకు సబ్సిడీలు ఇస్తుంటే, మన రైతులకు కేవలం 2.7శాతం వ్యవసాయ రంగానికి సబ్సిడీ అందిస్తున్నారు. ఇక పండిన ఉత్పత్తులను అమ్ముకోవడంతో సహా రైతులు అనేక ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. ఈ పరిస్థితులను అధిగమించేందుకు కనీస మద్దతుధర కొంతలో కొంత ఊరట కల్గిస్తుంది. గోధుమకు ప్రకటించిన వెయ్యిరూపాయల మద్దతుధర వరికి కూడా వర్తింపచేయడంలో ఏ కోణంలో చూసినా న్యాయంగా ఉంటుంది.

| రాష్ట్రంలో వరిసాగు వివరాలు | | |
|---|---|---|
| సంవత్సరం | విస్తీర్ణం (లక్షల హెక్టార్లలో) | దిగుబడి (లక్షలటన్నులలో) |
| 2001-02 | 38 25 | 113 90 |
| 2002-03 | 28.22 | 73.27 |
| 2003-04 | 29.75 | 89.53 |
| 2004-05 | 30.86 | 96.01 |
| 2005-06 | 41 04 | 132.93 |
| 2006-07 | 38.75 | 115.8 |

దేశంలో కనీస మద్దతు ధరలు ప్రకటించే విధానం 1960వ దశకం మధ్యలో ప్రారంభమైంది. దేశాన్ని ఆహార రంగంలో స్వయం సమృద్ధం చేసే లక్ష్యంతో గోధుమలు, ధాన్యం సేకరణ ధరలను కొంత ఉదారంగా ప్రకటించింది. వీటి ఉత్పత్తి పెంచి ఆహార ధాన్యాల ధరల్లో స్థిరత్వం సాధించడానికి.

1980 దశకంలో వరి, గోధుమల పంట విస్తీర్ణం బాగా పెరిగి కనీస మద్దతు ధరను గట్టిగా అమలు చేస్తున్నా, ఆ పంటలు పండించే రాష్ట్రాలు ఏదెనిదిమికి మించలేదు. దేశంలో ఆహార ధాన్యాల కొరత ఉన్నప్పుడు వ్యవసాయ ఉత్పత్తికి అయ్యే వ్యయం ఆధారంగా ధరలు నిర్ణయించాలని ధరల నిర్ణయాక సంఘం ప్రభుత్వాన్ని కోరింది. వ్యవసాయ రంగంలో అభివృద్ధి రేటు దేశం మొత్తం మీద కన్నా మన రాష్ట్రంలోనే అధికం. ప్రభుత్వం నీటి పారుదల రంగానికి అధిక ప్రాధాన్యత ఇచ్చింది.

ఐతే రైతులు తమ పంటల ఉత్పత్తి, ఉత్పాదకత పెంచాలంటే వారికి లాభసాటి ధర రావలసి ఉందని స్వామినాధన్ కమిషన్ పేర్కొన్నది. వ్యవసాయం ఉత్పత్తులు మార్కెట్‌లో ప్రైవేట్ రంగానికి, సహకార సంఘాలకు ప్రముఖ స్థానాన్ని కల్పించాలని కమిషన్ కోరింది. అలాగే మద్దతు ధర దేశమంతా సక్రమంగా అమలు జరగాలని, పెరుగుతున్న వ్యవసాయపెట్టుబడులకు అనుగుణంగా కనీస మద్దతు ధర కల్పించాలని స్వామినాధన్ కమిషన్ కోరింది. వ్యవసాయం ఆర్థికంగా లాభసాటిగా వున్నప్పుడే ఈ రంగంలో రైతులు నిలదొక్కుకొనే అవకాశం ఉంది.

వరి పంట సాగు విస్తీర్ణంలో కొంత పెరుగుదల కనిపిస్తున్నప్పటికీ దిగుబడులు మాత్రం ఆ మేర పెరగడం లేదు. అందువలన క్రమంగా సాగు విస్తీర్ణంతో పాటు దిగుబడి తగ్గుతోంది. రాష్ట్రంలో వరి సాధారణ విస్తీర్ణం 30 లక్షల హెక్టార్ల వరకు ఉంది. ఖరీఫ్ సీజన్‌లో 22 లక్షల హెక్టార్ల విస్తీర్ణం ఉండగా, రబీలో 8 నుంచి 10 లక్షల హెక్టార్లలో వరి పంట సాగవుతోంది. మిగతా రాష్ట్రాలతో పోలిస్తే విస్తీర్ణంలో 6వ స్థానంలో ఉండగా, ఉత్పత్తిలో మూడవ స్థానం, ఉత్పాదకతలో రెండవ స్థానంలో ఉంది. దేశంలోనే 'రైస్ బౌల్'గా ఖ్యాతిగాంచిన వరి పంటలకు సరైన మద్దతు ధరనిచ్చి అటు పంటను, ఇటు రైతులను ప్రభుత్వమే నిలబెట్టాలి.

◆

**అధికారంలో ఎవరున్నా 1991 తరువాత, ప్రైవేటీకరణ ప్రక్రియ వేగవంతమయ్యాక ప్రభుత్వ రంగ పరిశ్రమలను, వాటి ఆస్తులను ప్రైవేట్ వ్యక్తులకు తెగనమ్మారంటున్నారు వి. చలపతిరావు**

# పరస్పర నిందారోపణల పర్వం

ప్రస్తుత ముఖ్యమంత్రి, మాజీ ముఖ్యమంత్రి చంద్రబాబుల అవినీతి అక్రమార్జనలపై పరస్పరం నిందారోపణలు చేసుకోవటం, రాష్ట్ర ఆర్థిక పరిస్థితి గురించి రాష్ట్ర ఖజాన పరిస్థితి గురించి ఏమి సూచిస్తోంది? ఎలాంటి సంకేతాల నిస్తున్నదన్న సంగతిపై ఈ రాష్ట్రంలో ఉన్న ప్రతీ బాధ్యతాయుతమైన పౌరుడు ఆలోచించవలసి ఉంది. ఒక ముఖ్యమంత్రి అక్రమార్జన ఏ పద్ధతులలో వస్తుంది, ఏ మార్గాలలో ఒక ముఖ్యమంత్రి ప్రజాధనాన్ని కాజేయగలరు, అన్న విషయాన్ని ఇతరుల కన్న ముఖ్యమంత్రి పదవి చేసినవారే బాగా చెప్పగలరు. వై.ఎస్. తలపెట్టిన జలయజ్ఞం సంబంధించిన జలవిద్యుత్ ప్రాజెక్టులన్నీ చుట్టొచ్చి చంద్రబాబు, వై.ఎస్. ముఖ్యమంత్రిగా గంటకు ఒక కోటిరూపాయలు సంపాదిస్తున్నారని ఆయనపై ఒక తీవ్రమయిన విమర్శనాస్త్రం ప్రయోగించారు. అందులో మధ్యంతర ఎన్నికల గాలి కూడా వీయటం వలన, చంద్రబాబు ఈ విమర్శను పేల్చారు. ఇంత పెద్ద ఎత్తున ఆదాయానిచ్చే కామధేనువు లాంటి ముఖ్యమంత్రి పీఠాన్ని ఏ విధంగా నయిన మరల ఆక్రమించుకోవాలని చంద్రబాబు కలగనటం సహజమే కదా. అందులో తొమ్మిది ఏండ్లు ఆ సింహాసనాన్ని అధిష్ఠించిన వ్యక్తి దీని లోతుపాతులు వై.ఎస్. కన్న ఎక్కువగా ఈయనకే ఎక్కువ తెలిసి ఉండాలి. అందుకే ఆయన నిందారోపణ చేయగానే, ఆంధ్రప్రదేశ్ ఖజానాలో ఎవరయిన దొంగలు పడి దోచుకుంటున్నారా అన్నట్లు ప్రజలు భావించారు.

ఇలాంటి నిందారోపణలు రాజకీయులు గల్లీ నుండి ఢిల్లీ దాకా ఒకరి పై ఒకరు, ఒక పార్టీ వారు ఇంకొక పార్టీ వారిపై చేయటం ఈ దేశంలో పరిపాటి అయింది. ముఖ్యంగా 1991లో మన దేశంలో ఆర్థిక సంస్కరణలు ప్రవేశపెట్టిన తర్వాత, ప్రైవేటీకరణ ప్రక్రియ వేగవంతం చేసిన పిదప రాజకీయులు, అధికారంలో ఉన్న వాళ్లు ఎన్నో పబ్లిక్ సెక్టర్ పరిశ్రమలను, వాటి ఆస్తులను ప్రైవేట్ వ్యక్తులకు, తమ అనుయాయులకు అమ్మివేసి, వేలకోట్ల అక్రమార్జనకు ఎగబడ్డారు. చంద్రబాబు ఈ కార్యక్రమాన్ని తన హయాంలో నిర్విఘ్నంగా ప్రైవేటీకరణ పేర కొనసాగించారు. ప్రపంచబ్యాంకు నుండి తన హయాంలోనే 70 వేల కోట్ల రూపాయల రుణాలు తీసుకవచ్చి హైదరాబాద్ ఇతర నగరాలలో, గ్రామాలలో నాసిరకం సి.సి. రోడ్లు వేయించి తనూ, తన పార్టీవారు వేల కోట్ల రూపాయలు ఆర్జించిన సంగతి ఎవరికి తెలియదు? తానేదో బుద్ధిపూస అని, వై.ఎస్. మాత్రమే గంటకొక కోటి రూపాయలు సంపాదిస్తూ రాష్ట్రాన్ని నిలువునా దోచుకుంటున్నాడని అంటున్నాడు. చంద్రబాబే ఒక సందర్భంలో 'తాను ఆర్థిక సంస్కరణలకు కిటికీలు తెరిస్తే వై.ఎస్. తలుపులు తెరిచారని' అన్నారు. వాస్తవంగా తాను కిటికే కాదు తెరిచింది, తలుపులే బార్లా తెరిచారు. రాజకీయులకు అక్రమ సంపాదన రుచి చూపెట్టారు. ఇప్పుడు వై.ఎస్. అక్రమ సంపాదనకు ఫ్లడ్ గేట్ తెరిచారని చెప్పవచ్చు.

ఇలాంటి అవినీతి నిందారోపణలు పూర్వం దక్షిణాదిన జయలలితపై, ఉత్తరాదిన లాలూ ప్రసాద్ యాదవ్‌పై వచ్చాయి. విచారణ పై విచారణలు కొనసాగాయి. అయినప్పటికీ వాటినన్నింటిని అధిగమించి, రాజకీయాలలో యథావిధిగా దృఢంగా నిలదొక్కుకొని ఉన్నారు. అక్రమ సంపాదనను నిరాటంకంగా అనుభవిస్తూనే ఉన్నారు. ఇలా అక్రమ సంపాదన అనేది నేటి భారతదేశ రాజకీయాలలో, రాజకీయ సంస్కృతిలో విడరానంత అంతర్భాగమయి కూర్చుంది. ఇటీవలి అంతర్జాతీయ ట్రాన్స్‌పరెన్సీ సంస్థ ఒకటి సర్వే చేసి, భారతదేశంలో గత సంవత్సరం కన్న ఈ సంవత్సరంలో (2007) అవినీతి స్థాయి 2 శాతం తగ్గిందని ప్రకటించింది. ఒకవేళ తగ్గితే మంచిదే. కాని ఈ సంస్థ ఏ విషయాలను పరిగణనలోకి తీసుకొని అవినీతి స్థాయి రెండు శాతం తగ్గిందని ప్రకటించిందో కానీ, ఈ దేశం లో అధికారంలో ఉన్న రాజకీయాలలో మాత్రం అవినీతి పెచ్చు పెరిగింది. ఎందుకంటే రాజకీయులపై, ప్రభుత్వోద్యోగులపై ఎ.సి.బి. శాఖ నిఘా ఉన్నట్లు ఏ సంస్థపైనా లేదు. కనుక వీరు ప్రజాధనాన్ని ఒక హక్కుగా భావించి దోపిడీ చేస్తున్నారు. ముఖ్యంగా మన రాష్ట్రంలో అవినీతి అందలం ఎక్కి రాజ్యమేలుతోంది. సమాల్ బహిరంగంగా మీడియాకు అవినీతి ఆఫీసర్ల గురించి ఇచ్చిన రిపోర్ట్ అదే రుజువు చేస్తోంది. ముఖ్యమంత్రులు, మంత్రులు బాహటంగా అవినీతికి పాల్పడితే ఉద్యోగులూ తెగబడతారు, దీనిలో సంశయం లేదు. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ యంత్రాంగానికి అవినీతి తెగులు బాగా అంటుకొని ఉంది. అది రాజకీయుల చలవే.

చంద్రబాబు తనపై చేసిన తీవ్ర అవినీతి ఆరోపణలకు వై.ఎస్. ప్రతిస్పందిస్తూ, రెండు ఎకరాల ఆసామి కొడుకు అయన చంద్రబాబు స్కాలర్‌షిప్ పై చదువుకున్నారని, అలాంటి మామూలు కుటుంబం నుండి వచ్చిన వ్యక్తి, ముఖ్యమంత్రిగా ఉన్నపుడు 'రెండు వేల కోట్ల ఆస్తులతో చంద్రబాబు దేశంలో సంపన్న రాజకీయుడిగా తెహల్కా పేర్కొంది' అని ప్రత్యారోపణ చేశారు.

ఎన్.టి.ఆర్ హయాంలో చంద్రబాబు కాంగ్రెస్ నుండి తెలుగుదేశంలో ప్రవేశించి, ఆ పార్టీ జనరల్ సెక్రటరీగా పని చేస్తున్న తరుణంలోనే, మొత్తం ఆంధ్రప్రదేశ్‌లో వివిధ జిల్లాల్లో రెండువేల ఎకరాల భూమి బీనామీ పేర్లతో సంపాదించి మామిడి, బత్తాయి వగైరా తోటలు పెట్టారని, తర్వాత వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వ హయాంలో ఒక ఆరోపణ వచ్చింది. ఈ ఆరోపణపై విచారణ చేయించటానికి అప్పటి కాంగ్రెస్ ప్రభుత్వం ఒక ఐ.ఎ.ఎస్. అధికారిని ప్రత్యేకంగా నియమించింది. ఆయన ఒకటి రెండు సంవత్సరాల పాటు విచారణ జరిపారు. తర్వాత ఆ ఫైలు గతి ఏమయిందో తెలియదు. బహుశా ఈ విషయం వై.ఎస్. స్మృతికి తట్టనట్లుంది. లేకపోతే దీని ప్రసక్తి కూడా తెచ్చేవారు. నేటి రాజకీయులు అధికారం కోసం ఎదుటి వారి మీద అందివచ్చిన విమర్శనాస్త్రాల నన్నింటిని ప్రయోగించటానికి వెనుకాడటం లేదు.

వై.ఎస్. చంద్రబాబుపై చేసిన సదరు ఆరోపణకు జవాబుగా 'వై.ఎస్. ఒక తాపి మేస్త్రీ కొడుకని, అటువంటి వారు ప్రసుత్తం 29,000 కోట్ల రూపాయల ఆస్తులకు యజమాని ఎలా అయ్యారని చంద్రబాబు ప్రత్యారోపరణ చేశారు. ఇలా ప్రస్తుత ముఖ్యమంత్రిపై మాజీ ముఖ్యమంత్రి ఇంతటి తీవ్ర అవినీతి ఆరోపణలు చేస్తుంటే ప్రజలు నిస్సహాయ స్థితిలో ముక్కు మీద వేలు వేసుకొని చూస్తున్నారు. అయినా అంతకన్నా వాళ్లు వేరే ఏమి చేయగలరు? వీరిరువురు బాధ్యతాయుత పదవులు నిర్వహించినవారు ఇలా అధికారం కొరకు బజారున పడి ఇంత చౌకబారుగా ఒకరి మీద ఒకరు అవినీతి ఆరోపణలు చేసుకోవడం ఆశ్చర్యంగా ఉన్నప్పటికీ ఈ ఆరోపణలు మాత్రం సత్యదూరం కావు. ఆ సంగతి ప్రజలకు తెలుసు.

ఒకాయన రెండు ఎకరాల రైతు కొడుకైనా, ఇంకొకాయన తాపి మేస్త్రి కొడుకైనా ప్రజాస్వామ్య వ్యవస్థలో ఎంతటి చిన్న స్థాయి కుటుంబాల నుండి వచ్చిన వ్యక్తులైనా, ముఖ్యమంత్రి లేదా ప్రధాన మంత్రి పదవులను అధిష్ఠించవచ్చును, లేదా రాష్ట్రపతి పదవికి కూడా ఎన్నిక కావచ్చును. మన రాజ్యాంగం ఇలాంటి అవకాశాన్ని బీద, ధనికులు అనే తేడా లేకుండా అందరి పౌరులకు కలుగజేసింది. కాని ఇలా అధికారానికి వచ్చిన వ్యక్తులు అధికార దుర్వినియోగం చేస్తూ ప్రజాధనాన్ని అడ్డగోలుగా నిరాటంకంగా దోపిడీ చేయటానికి వీలు లేదు. ఇది తప్పకుండా నేరమవుతుంది. కాని ప్రభుత్వోద్యోగులపై ఎ.సి.బి. సంస్థ నిఘా ఉంచినట్లు, రాజకీయులపై కొరవడింది. కనుక రాజకీయులు విచ్చలవిడిగా అవినీతి చర్యలకు తెగబడుతున్నారు. వీరిపై ఇకనయిన చట్టపరంగా చెక్ ఉంటే మంచిది. ఒక గట్టి నిఘా సంస్థను ఏర్పాటు చేయటం అవసరం.

ఈ దేశంలో ధీరుబాయి లాంటి సామాన్యుడు వ్యాపారంలో కష్టపడి తెలివిగా పెట్టుబడులు పెట్టి ఆయన కాలంలోనే పెద్ద కోటీశ్వరుడు, పెద్ద కంపెనీల యజమాని కాగలిగాడు. ఆయన తర్వాత ఆయన ఇరువురు కుమారులు కూడ టాటా, బిర్లాలను మించిపోయి, ప్రపంచ స్థాయి ధనవంతులయినారు. అది వారి శ్రమ, వారి అదృష్టం. దేశ ప్రజలెవ్వరికి వారి అదృష్టం పై కినుక ఉండదు, అభ్యంతరం ఉండదు. కాని రాజకీయాలలోకి చొరబడి ప్రజలను మోసం చేస్తూ ప్రజాధనాన్ని దోచుకోవడం సహించరాని నేరం. ఇవ్వాల్టి రాజకీయు లందరూ అధికారానికి వచ్చి ప్రజా ధనాన్ని దోచుకొని టాటా, బిర్లాల కన్న ఎక్కువ ధనవంతులు కావాలని చూస్తున్నారు. ప్రజాస్వామ్య విలువలను మంట కలుపుతున్నారు. ఆంధ్రప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి, ప్రస్తుత ముఖ్యమంత్రి తాము అవినీతికి అతీతంగా స్పష్టంగా ఉన్నామని రుజువు చేయదలచుకుంటే వారిరువురూ హైకోర్టు సిట్టింగ్ జడ్జీ విచారణకు ఒప్పుకోవాలి.

ఏ ప్రభుత్వంలోనయిన ముఖ్యమంత్రి పదవిలో ఉన్నవారు అవినీతి పరులయితే ఆ ప్రభుత్వ యంత్రాంగమంతా పై నుండి కింది వరకు అవినీతితో నిండిపోయే ప్రమాదం ఉంది. ఇప్పుడు ఈ రాష్ట్రంలో జరుగుతున్నదదే.

మహా ఘోరమైన విషయమేమిటంటే నాడు దూబగుంట గ్రామ స్త్రీ జనం ఉద్యమించి సాధించుకున్న మద్య నిషేధ చట్టాన్ని ఎన్.టి.ఆర్. తర్వాత మాజీ ముఖ్యమంత్రి చంద్రబాబు, ప్రస్తుత ముఖ్యమంత్రి ఆ చట్టానికి తూట్లు పొడిచి యథావిధిగా ఆబ్కారి విధానాన్ని నడిపించడమే కాక, చీప్ లిక్కర్ షాపులు, బెల్టు షాపులు లాంటివి పెట్టి, గ్రామాలలో, పట్టణాలలో బీద జనానికి చీప్ లిక్కర్ తాగటం అలవాటు చేశారు. కార్మికులు, బీదవాళ్లు తాగుడు వ్యసనాలకు బానిసలై వారి కుటుంబాలు నాశనం కావటానికి ఈ ఇరువురు నాయకులు కారణమని చెప్పవచ్చును. వీరి రాజకీయ విధాన అంతర్భావమేమిటంటే బీద జనం ఎన్నికల సమయంలో మేము పంచే చీప్ లిక్కర్ తాగి, తాగిన మత్తులో మాకు ఓట్లు వేయాలి. మేము అధికారంలోకి వచ్చిన తరువాత ప్రజాధనాన్ని దోచుకున్నా ఇంకే విధమైన అప్రజాస్వామిక చర్యలు చేసినా, వారు ప్రశ్నించకూడదు. వారు తాగుడు వ్యసనంలో మునిగి ఉండాలి, మేము ప్రజా ధనాన్ని దోచుకుంటూ తేలియాడాలి. అనేదే ఈనాటి రాజకీయుల ఆలోచన, ఆచరణ విధానం. గల్లీ నుండి ఢిల్లీ దాకా ఇదే విధానం బలపడుతోంది. ఎన్నికల సమయంలో వీరు చేసే వాగ్దానాల తీరు, అంటే బీదలకు ఇండ్లు కట్టిస్తామని అన్నా, రెండు రూపాయలకు కిలో బియ్యం ఇస్తామని చెప్పినా, పావలా వడ్డీకి రుణ సౌకర్యం కల్పిస్తామన్నా బీదలను బిచ్చగాళ్లుగా తయారు చేసి తమ దయా దాక్షిణ్యాలపై ఆధారపడి ఉండేటట్లు చేయడమే. మధ్య తరగతి మేధావులు చదువుకున్న వారు ప్రభుత్వంలో ప్రబలుతున్న అవినీతిని ప్రశ్నించినా, రాజకీయులు అదరడం లేదు, బెదరడం లేదు. ఎందుకంటే వారికి తెలుసు ఈ మధ్యతరగతి చదువుకున్న వారు ఓట్లు ఎవరికీ వేయరు. కనుక ఓటింగ్ సరళిపై వీరు ప్రభావం చూపలేరు. అందువలన వీరి మాటలకు వారి దృష్టిలో విలువలేదు.

మూడు పంచవర్ష ప్రణాళికలు అమలు జరిగిన తర్వాత ప్రభుత్వ ఆదేశాలపై ప్రొఫెసర్ మహలోనబీస్ సదరు ప్రణాళిక అమలును సమీక్ష చేసి, దేశంలో ధనవంతులు మరింత ధనవంతులుగా ఎదిగిపోయారని, బీదవారు బీదవారిగానే మిగిలిపోయారని రిపోర్ట్ ఇచ్చారు. ఈ పరిస్థితి ఇప్పటివరకు అదే విధంగా కొనసాగుతోంది. ఈ పరిస్థితి ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ తర్వాత చాలా ఎక్కువయింది. దీనికంతటికి ఆనాడయిన, ఈనాడయిన ప్రభుత్వ యంత్రాంగంలో ప్రబలిన అవినీతే కారణం. ◆

ప్రపంచంలో ఏ ప్రాంతంలోనైనా స్థానికంగా లభ్యమయ్యే సహజవనరులను ఉపయోగించుకునే తొలి హక్కు ఆ ప్రాంతానికే ఉంటుందనేది సహజ న్యాయ సూత్రం అంటోంది **కె.జి. బేసిన్ గ్యాస్ సాధన పోరాట కమిటీ**

# వనరులేవైనా ముందు స్థానికులకే

ఆంధ్రప్రదేశ్‌లో విస్తారమైన సహజవనరులు పుష్కలంగా ఉన్నాయి. ఉన్న సహజ వనరులన్నింటినీ సక్రమంగా వినియోగించుకొని ఉంటే రాష్ట్రంలో సర్వతో ముఖాభివృద్ధి జరిగి ఉండేది. అయితే ఉన్న సహజ వనరులను సక్రమంగా ఉపయోగించుకోక పోగా ఆ సంపద కార్పొరేట్ సంస్థల ద్వారా ఇతర రాష్ట్రాలకు తరలిపోతున్న విచిత్రమే కృష్ణా-గోదావరి బేసిన్ గ్యాస్ కథ. ప్రపంచంలో ఏ ప్రాంతంలోనైనా స్థానికంగా లభ్యమయ్యే సహజవనరులను ఉపయోగించుకునే తొలి హక్కు ఆ ప్రాంతానికే ఉంటుందనేది సహజ న్యాయ సూత్రం. కె.జి. బేసిన్‌లో జరుగుతున్నది సర్వజనామోదాన్ని పొందిన ఈ సహజ న్యాయ సూత్రానికి పూర్తిగా భిన్నమైన పరిస్థితి.

కృష్ణా-గోదావరి బేసిన్, కృష్ణా-గోదావరి నదుల పరీవాహక ప్రాంతాలకు దగ్గరగా ముఖ్యంగా తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలో వ్యాపించి ఉంది. ఇది భూ ఉపరితల పరంగా చూస్తే 28 వేల చదరపు కిలోమీటర్ల లోనూ, సముద్ర గర్భంలో చూస్తే 24 వేల చదరపు కిలోమీటర్ల పరిధిలోనూ విస్తరించి ఉంది. ఈ ప్రాంతంలో చమురు, గ్యాస్ నిక్షేపాలు సమృద్ధిగా ఉన్నాయని నిపుణుల అంచనా. ఈ బేసిన్‌లో ప్రస్తుతం లభ్యమయ్యే సహజవాయువు విలువ రెండు లక్షల యాభైవేల కోట్ల రూపాయలకు మించి ఉంటుందని అంచనా. దీనిద్వారా సంవత్సరానికి సగటున పదివేల కోట్ల రూపాయల విదేశీ మారక ద్రవ్యాన్ని ఆదా చేయవచ్చు. కేంద్ర ప్రభుత్వ రంగ సంస్థ అయిన ఒ.ఎన్.జి.సి. (ఆయిల్ అండ్ నేచురల్ గ్యాస్ కార్పొరేషన్) ఈ ప్రాంతంలో గత యాభై సంవత్సరాలుగా చమురు, గ్యాస్ నిలువల కోసం పరిశోధనలు జరుపుతోంది. 1978లో నర్సాపురం వద్ద మొదటి బావిని తవ్వి గ్యాస్‌ను కనుగొన్నారు. అక్కడేకాక ఆ బేసిన్‌లోని ఇతర ప్రాంతాలలో కూడా చమురు గ్యాస్ నిక్షేపాలు బయటపడ్డాయి. ఒ.ఎన్.జి.సి. తాటిపాక గ్రామంలో మినీ ఆయిల్ రిఫైనరీని ప్రారంభించింది. దానిలో రోజుకు పదిహేను వందల నుండి రెండు వేల బ్యారళ్ల ముడి చమురు నుండి నాఫ్తా, డీజిల్, కిరోసిన్‌ల తయారీని ప్రారంభించింది. ఒ.ఎన్.జి.సి. కున్న ఆస్తులన్నింటిలోకీ అత్యంత ఎక్కువ ఉత్పాదకత ఉన్న ఆస్తులలో కె.జి. బేసిన్ ఒకటని ఆ సంస్థ ఉన్నతాధికారులే అంగీకరించారు. 2001-02లోనే కె.జి. బేసిన్ నుండి ఒ.ఎన్.జి.సి. 2.82 లక్షల టన్నుల ఆయిల్‌ని, 1.769 బిలియన్ క్యూబిక్ మీటర్ల గ్యాస్‌ను అమ్మింది. ఆంధ్ర ప్రభుత్వానికి 550 కోట్ల రూపాయల రాయల్టీని కూడా చెల్లించింది. ఇలాంటి సంపద్వంతమైన కె.జి. బేసిన్ గ్యాస్ నిల్వలపై ఆధిపత్యం ఒ.ఎన్.జి.సి. నుండి ప్రైవేట్ కార్పొరేట్ సంస్థల చేతులలోకి మారడాన్ని అర్థం చేసుకోవాలి.

ఈ క్రమం 1997లో కేంద్ర ప్రభుత్వం ఆమోదించిన నూతన అన్వేషణ, లైసెన్సింగ్ విధానం (ఎన్.ఇ.ఎల్.పి) తో ప్రారంభమైంది. ఇది 1999-2000లో అమలులోకి వచ్చింది. ఈ విధానం అమలులోకి రాకముందు దేశంలోని సహజవాయువు నిక్షేపాలపై ప్రభుత్వ పూర్తి అజమాయిషీ ఉండేది. గ్యాస్ ఉత్పత్తిదారులు ఎంత ధరకు అమ్మాలో, రవాణాకు ఎంత ఖర్చవుతుందో, సంబంధిత సంస్థలు లాభాలను ఎలా పంచుకోవాలో ప్రభుత్వమే నిర్ణయించేది. 1990 దశకం తొలి సంవత్సరాల వరకు ప్రభుత్వ రంగ సంస్థలయిన ఒ.ఎన్.జి.సి., ఆయిల్ ఇండియా లిమిటెడ్ గ్యాస్‌ను ఉత్పత్తి చేసేవి. మరొక ప్రభుత్వ సంస్థ గ్యాస్ అథారిటీ ఆఫ్ ఇండియా లిమిటెడ్ (జి.ఎ.ఐ.ఎల్) ఈ గ్యాస్‌ను రవాణా చేసి మార్కెటింగ్ చేసేది. ప్రభుత్వం నిర్ణయించిన రేట్లకనుగుణంగా జి.ఎ.ఐ.ఎల్.కు, గ్యాస్ వినియోగదారునికి మధ్య దీర్ఘకాలిక కొనుగోలు, అమ్మకాల ఒడంబడికలు జరిగేవి.

కొత్త చమురు, గ్యాస్ నిక్షేపాల అన్వేషణ కోసం భారత ప్రభుత్వం 1990 దశకం మధ్య భాగంలో ప్రైవేట్ సంస్థలను ఈ రంగంలోకి ఆహ్వానించింది. అలా కనుగొన్న చమురు, గ్యాస్ ధరను నిర్ణయించటానికి టి.ఎల్. శంకర్ ఆధ్వర్యంలో ఒక కమిటీని నియమించింది.

ఈ విధంగా చమురు గ్యాస్ నిక్షేపాల అన్వేషణలో ప్రైవేట్ వ్యాపార సంస్థలకు భాగస్వామ్యం కల్పించే ఉద్దేశ్యంతోనే, కేంద్రం 1997లో ఎన్.ఇ.ఎల్.పి.ని చేసింది. ఈ నూతన విధానానికి రెండు లక్ష్యాలను ప్రభుత్వం ప్రకటించింది. సముద్ర గర్భంలోనూ, భూ ఉపరితలంలోనూ నూతన గ్యాస్ నిక్షేపాల కోసం అన్వేషణను ప్రోత్సహించటం ఒకటి. పెరుగుతున్న అవసరాల కనుగుణంగా స్వదేశీ గ్యాస్ ఉత్పత్తిని పెంచి దిగుమతులపై ఆధారపడటాన్ని తగ్గించటం రెండవది. ఈ పథకం కింద ప్రభుత్వం వేలంపాట ద్వారా కొన్ని నిర్దిష్ట ప్రాంతాలలో నిక్షేపాల అన్వేషణకు ప్రైవేట్ కార్పొరేట్ సంస్థలకు అవకాశాన్ని కల్పించింది. ఈ పథకం ప్రకారం తాము పెట్టిన పెట్టుబడిని లాభాలతో సహా త్వరగా రాబట్టుకోవడానికి వీలుగా ప్రభుత్వంతో సంప్రదించి ధర నిర్ణయించే అవకాశాన్ని ప్రభుత్వం ఈ నూతన అన్వేషణదారులకు కల్పించింది. ఈ పథకంలో మరొక ముఖ్యమైన అంశం 'లాభం గ్యాస్' (ప్రాఫిట్

గ్యాస్). ఉత్పత్తిదారులు గ్యాస్‌ను అన్వేషించి వెలికి తీయడానికి అయ్యే ఖర్చు, ప్రభుత్వానికి చెల్లించాల్సిన పన్ను, రాయల్టీల మొత్తాన్ని ఖర్చుగా భావించి, గ్యాస్‌ను అమ్మగా వచ్చిన పైకం నుండి ఈ ఖర్చును మినహాయిస్తే మిగిలిందే 'లాభం గ్యాస్'. ఈ లాభం గ్యాస్‌ను ప్రభుత్వం, ఉత్పత్తి సంస్థ ఎలా పంచుకోవాలనే దానిపై సంప్రదింపుల ద్వారా ఒడంబడిక చేసుకోవాలి. ప్రభుత్వం ఆ లాభంలో తన వాటాను నగదు రూపంలోకానీ, వస్తు రూపంలో కానీ తీసుకోవచ్చు.

ఈ నూతన విధానం ప్రకారం చమురు బావుల వేలంపాట 1999లో ప్రారంభమయింది. ఇప్పటికి ఆరు వేలం పాటలు జరిగాయి. వీటి ద్వారా కేంద్ర ప్రభుత్వం ఉపరితల, సముద్రగర్భ బ్లాకుల్లో 161 బావులకు సంబంధించి ఒడంబడికలు కుదుర్చుకుంది. కృష్ణా - గోదావరి బేసిన్‌లో సముద్ర గర్భంలోని బావులలోనే అత్యధికమైన గ్యాస్ నిక్షేపాలున్నాయి. ఈ వేలం పాట ఫలితంగా మొత్తం విస్తీర్ణంలో ఒ.ఎన్.జి.సి.కి 51.05 శాతం; రిలయన్స్‌కు 46.40 శాతం, కెయిన్స్‌కి 2.55 శాతం ప్రాంతాలలో నిక్షేపాల అన్వేషణకు హక్కు లభించింది. కాని కనుగొన్న గ్యాస్ పరిణామాన్ని చూస్తే రిలయన్స్‌కి 77.59 శాతం, ఒ.ఎన్.జి.సి. కి 17.24 శాతం; కెయిన్స్‌కి 5.17 శాతం లభించింది.

ఒ.ఎన్.జి.సి.కి - ఆర్.ఐ.ఎల్.కు దాదాపు సమాన విస్తీర్ణంలో వాటా లభించినా, ఉత్పత్తిలో సింహభాగం రిలయన్స్ కంపెనీకి లభించటమే గమనించాల్సిన విషయం. దీనిని బట్టి రిలయన్స్ కంపెనీకి దక్కిన బావులన్నీ సంపద్వంత మయినవనీ, ఒ.ఎన్.జి.సి.కి వట్టిపోయిన బావులు లభ్యమయ్యేటట్లు చూశారనీ తెలుస్తుంది.

## రిలయన్స్ కంపెనీ విస్తరణ

ప్రస్తుతం మన దేశంలోనూ, రాష్ట్రంలోనూ చమురు, గ్యాస్ నిక్షేపాలపై దాదాపు ఏకఛత్రాధిపత్యం కలిగిన రిలయన్స్ కంపెనీ ఒక సాధారణ వ్యాపార సంస్థకాదు. మూలధనంలోనూ, లాభార్జనలోనూ దేశంలోని కార్పొరేట్ సంస్థలన్నిటిలోకీ అగ్రగామి రిలయన్స్. అతి సాధారణ స్థాయికి చెందిన ధీరూభాయి అంబానీ సారధ్యంలో ఈ కంపెనీ తన సామ్రాజ్యాన్ని అనేక రంగాలలోకి విస్తరించుకొన్నది. బట్టల తయారీ - అమ్మకం, చమురు గ్యాస్ నిక్షేపాల వెలికితీత - పెట్రోల్ బంకుల ద్వారా అమ్మకం నుండి కూరగాయలు, పండ్లు, నిత్యజీవితావసర వస్తువుల అమ్మకం వంటి అన్ని రంగాలలోనూ వ్యాపించిన రిలయన్స్ దేశ, విదేశాలలో వ్యాపించి బహుళజాతి సంస్థగా రూపొందింది. ధీరూభాయి అంబానీ మరణానంతరం ముకేష్, అనీల్ అంబానీలు రిలయన్స్ సామ్రాజ్యానికి నూతన అధిపతులయ్యారు. అటు కేంద్రంలోనూ, ఇటు రాష్ట్రాలలోనూ ఏ పార్టీ అధికారంలో ఉన్నా తమ వ్యాపార సామ్రాజ్య ప్రయోజనాలను కాపాడుకోగలిగిన శక్తి యుక్తులు ఈ సంస్థలకున్నాయి. ప్రపంచంలోనే అత్యంత సంపన్నులలో మొదటివానిగా ముకేష్ అంబాని నిలిచాడు. అలాంటి రిలయన్స్ కంపెనీ చేతులలో దేశాభివృద్ధికి ప్రత్యేకించి మన రాష్ట్రాభివృద్ధికి అత్యంత కీలకమైన వనరు 'సహజ సిద్ధమైన గ్యాస్ సంపద' చిక్కుకుపోయింది.

## సహజ వాయువు వలన ఉపయోగాలు

ఆధునిక ప్రపంచమంతా చమురు, సహజవాయువులపై ఆధారపడి ఉంది. అందులో ముఖ్యంగా సహజవాయువు ఒక ప్రాంత అర్థికాభివృద్ధికి ఎంత కీలకమో తెలుసుకోవటానికి అనేక ఉదాహరణలున్నాయి. బాంబే హైగ్యాస్ కారణంగా గుజరాత్ రాష్ట్రంలోనూ, నార్త్ గ్యాస్ కారణంగా బ్రిటన్‌లోనూ పారిశ్రామికీకరణ అత్యంత వేగంగా జరిగింది. విద్యుత్ ఉత్పాదనలో సహజవాయువుది కీలకమైన పాత్ర. మన రాష్ట్రంలో ప్రస్తుతం నీటిద్వారా, బొగ్గుద్వారా విద్యుత్ ఉత్పత్తి జరుగుతున్నది. జల విద్యుత్ ఉత్పాదన చవకే గానీ జలవనరులకు సాగు, తాగునీటి అవసరాల దృష్ట్యా అనేక పరిమితులున్నాయి. బొగ్గుని విద్యుదుత్పాదనలో ఉపయోగించటం వలన ఖర్చు పెరగటమే కాక బొగ్గు నిక్షేపాలు పరిమితంగా ఉండటం కారణంగా అధికోత్పత్తిని సాధించలేం. అంతేగాక బొగ్గు ఆధారిత విద్యుత్ ఫలితంగా పర్యావరణానికి తీవ్రమైన హానీ జరుగుతున్నది. ఖర్చు దృష్ట్యా చూసినా, పర్యావరణం దృష్ట్యా చూసినా మిథేన్ అధిక పాళ్లువున్న కె.జి. బేసిన్ గ్యాస్ ద్వారా విద్యుత్ ఉత్పాదన చేయటం లాభదాయకం. అణుధార్మిక శక్తి నుండి విద్యుత్ ఉత్పాదన చేయవచ్చుగానీ, అమిత ఖర్చుతో కూడుకున్నదే కాక, ప్రజారోగ్యం దృష్ట్యా చాలా ప్రమాదకరమైనది కూడా.

కేవలం విద్యుత్ ఉత్పాదనలోనే గాక ఎరువుల తయారీలో కూడా సహజ వాయువు ఎంతగానో ఉపయోగపడుతుంది. దానితోపాటు చౌకగా లభించే గ్యాస్ ఆధారిత విద్యుత్‌ను అందించటం ద్వారా సిమెంట్, సెరామిక్, రసాయనిక, అల్యూమినియం, స్టీల్‌ప్లాంట్, ఫాబ్రికేషన్ తదితర పరిశ్రమలలో ఖరీదైన విద్యుత్‌మీద ఆధారపడటం తగ్గుతుంది. ఉదాహరణకు విశాఖ ఉక్కు కర్మాగారానికి గ్యాస్ సరఫరా చేస్తే సంవత్సరానికి 1200 కోట్ల రూపాయల ఖర్చు తగ్గుతుందని అంచనా. కె.జి. బేసిన్ గ్యాస్ చాలినంతగా న్యాయమైన ధరకు లభిస్తే కాకినాడ నుండి విశాఖపట్నం వరకు కాలుష్య రహిత రసాయనిక పరిశ్రమ కారిడార్‌ను నెలకొల్పవచ్చు.కె.జి. బేసిన్‌లో 200 ఎం.ఎం.ఎస్.సి.ఎం.డి. (మిలియన్ మెట్రిక్ స్టాండర్డ్ క్యూబిక్ మీటర్స్ పర్ డే) గ్యాస్ నిక్షేపాలు కనుగొన్నారు. కేవలం ఒక్క ఎం.ఎం.ఎస్.సి.ఎం.డి. గ్యాస్ సుమారు వెయ్యికోట్ల విలువైన పారిశ్రామిక పెట్టుబడిని ఆకర్షించగలదని నిపుణుల విశ్లేషణ. అంటే కె.జి. బేసిన్ గ్యాస్‌లో సగాన్ని ఉపయోగించుకొన్నా మనం లక్షకోట్ల విలువైన పారిశ్రామిక పెట్టుబడులను ఆకర్షించవచ్చు. లక్షలాదిమందికి ఉపాధి అవకాశాలను కల్పించవచ్చు.

మన రాష్ట్రంలో 1500 మెగావాట్ల ఉత్పత్తి సామర్థ్యం ఉన్న గ్యాస్ ఆధారిత విద్యుత్ ఉత్పాదనా కేంద్రాలున్నాయి. అవి గౌతమి, కోనసీమ, వేదగిరి, జి.వి.కె. విద్యుత్ ప్రాజెక్టులు. అయితే గ్యాస్ సరఫరా లేక అవి విద్యుత్‌ను ఉత్పత్తి చేయటం లేదు. లోపభూయిష్టమైన విద్యుత్ కొనుగోలు ఒప్పందాల ఫలితంగా ఈ గ్యాస్ ఆధారిత విద్యుత్ ప్లాంట్లకు అవి పని చేయకపోయినా రాష్ట్ర ప్రభుత్వం పెద్ద మొత్తంలో డబ్బు చెల్లించవలసి వస్తోంది. కె.జి. బేసిన్ నుండి ఈ విద్యుత్ పరిశ్రమలకు గ్యాస్‌ను సప్లై చేస్తే ప్రభుత్వానికి ఆర్థికభారం తగ్గడమే గాక రాష్ట్రంలో విద్యుత్ కొరత, కోత ఉండదు. రవాణా రంగంలో బస్సులకు, లారీలకు, కార్లకు, ఆటోలకు సి.ఎన్.జి. గ్యాస్ వాడకం వలన ఖర్చు తగ్గటమే గాక పర్యావరణాన్ని కూడా రక్షించవచ్చు.

గృహ అవసరాలకు గ్యాస్‌ను పైపుల ద్వారా అతి చౌకగా

అందించవచ్చు. దీని మూలంగా గ్యాస్ సిలెండర్లపై ప్రభుత్వ సబ్సిడీ భారం తగ్గుతుంది. ప్రస్తుతం మూడు వందల రూపాయలకు పైగా ఖరీదవుతున్న వంటగ్యాస్ సిలెండర్‌కు సమానమైన గ్యాస్‌ను పైపులైను ద్వారా వంద రూపాయలకు ఇవ్వవచ్చును.

## అంగట్లో అన్నీ ఉన్నా....

ఈ విధంగా పారిశ్రామికీకరణకు, ఆర్థికాభివృద్ధికి, విద్యుత్ కొరత నిర్మూలనకు, ఉద్యోగ అవకాశాల మెరుగుదలకు, వాతావరణ కాలుష్య నిరోధానికి, వంటగ్యాస్‌కు అత్యంత అవసరమైన సహజవాయు నిక్షేపాలు మన ముంగిట్లో – అంటే కె.జి. బేసిన్‌లో పుష్కలంగా ఉన్నా, ఆ వనరులను ఉపయోగించుకోలేని దుస్థితిలో మనం ఉన్నాం. దీనికి రెండు కారణాలున్నాయి. ఒకటి – కె.జి. బేసిన్ గ్యాస్ సంపద రాష్ట్ర సరిహద్దులు దాటి పోవటం; రెండు – ధర నిర్ణయంలో రిలయన్స్ కార్పొరేట్ సంస్థ ఒత్తిళ్లకు కేంద్ర ప్రభుత్వం లొంగిపోవటం.

సహజ న్యాయ సూత్రాల ప్రకారం కె.జి. బేసిన్‌లో లభ్యమయ్యే సహజవాయువు మన రాష్ట్ర అవసరాలు తీరిన తర్వాత మన సరిహద్దులు దాటిపోవాలి. సహజ వనరుల యాజమాన్యం, నియంత్రణ ఒక ప్రాంత ప్రజలందరి ప్రయోజనాలను న్యాయమైన రీతిలో కాపాడేటట్లుగా రాజ్యవ్యవస్థ వ్యవహరించాలని భారత రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలు చెప్తున్నాయి. సహజ న్యాయానికి, రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధంగా కె.జి. బేసిన్‌లో లభ్యమవుతున్న సహజ వాయువు మన సరిహద్దులు దాటి 1500 కిలోమీటర్ల దూరంలో ఉన్న గుజరాత్ రాష్ట్రానికి తరలిపోతున్నది. ఉత్తరప్రదేశ్, బెంగాల్‌లకు తరలించటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. గత పది సంవత్సరాలుగా రాష్ట్రాన్ని పరిపాలించిన పాలకుల నిష్క్రియాపరత్వం, నిర్లక్ష్యం, చేతకాని తనమే మన సంపద ఈ విధంగా తరలిపోవటానికి కారణం.

గుజరాత్ రాష్ట్ర ప్రభుత్వం పెట్రోలియం కార్పొరేషన్‌ను ఏర్పరిచింది. తనకు కేటాయించిన 1850 చదరపు కిలోమీటర్ల ప్రాంతంలో డ్రిల్లింగు ప్రారంభించిన మూడు వందల రోజుల్లోనే 20 ట్రిలియన్ క్యూబిక్ ఫీట్ల గ్యాస్‌ను కనుగొన్నది. రెండు లక్షల కోట్ల విలువైన గ్యాస్‌ను స్వంతం చేసుకున్నది. గుజరాత్ రాష్ట్ర ప్రభుత్వం లాగా మన రాష్ట్ర ప్రభుత్వం కూడా ప్రభుత్వ ఆధ్వర్యంలో పెట్రోలియం, సహజ వాయువు సంస్థను నెలకొల్పి ఉంటే కె.జి. బేసిన్ గ్యాస్ నిక్షేపాలపై ఆధిపత్యం రాష్ట్రానికే దక్కి ఉండేది. అలాంటి ముందు చూపు పాలకులకు లేని ఫలితంగా గుజరాత్‌కు సహజవాయువును తరలిస్తుంటే ప్రభుత్వం చోద్యం చూస్తూ ఉండిపోయింది.

## ధర నిర్ణయంలో రిలయన్స్‌కు దాసోహం

ఇది ఎన్రాన్ దురంతాన్ని పోలి ఉన్నది. పెట్రోలు, సహజ వాయువుల వ్యాపారంలో గుత్తాధిపత్యాన్ని సంపాదించుకున్న రిలయన్స్ కంపెనీని ప్రభుత్వం నిలవరించ లేకపోవడం స్పష్టంగా కనపడుతోంది. అమెరికాలో ఎన్రాన్ కంపెనీకి అక్రమ లాభాలు చేకూర్చడంలో అక్కడి సెనెటర్లు 'కృషి' చేసిన ఉదంతాన్ని ఇది గుర్తుకుతెస్తోందని పత్రికలు చెప్తున్నాయి.

కె.జి. బేసిన్ సహజవాయువు ధరను నిర్ణయించటం ఒక ప్రహసనంగా మారింది. రిలయన్స్ కంపెనీ గుజరాత్‌లోని నేషనల్ థర్మల్ పవర్ కార్పొరేషన్‌కు (ఎన్.టి.పి.సి.) కె.జి. బేసిన్ నుండి ఒక ఎం.ఎం.బి.టి.యు గ్యాస్‌ను 2.97 డాలర్లకు సరఫరా చేస్తానని ఒప్పుకుంది. తదనంతరం ప్లేటు ఫిరాయించి 4.33 డాలర్ల రేటుకు మాత్రమే ఒక యూనిట్ సహజ వాయువును సరఫరా చేస్తానని చెప్పింది. ఒకపక్క గెయిల్ సంస్థ లాంకో లాంటి పరిశ్రమలకు 1.97 డాలర్లకు సరఫరా చేస్తుండగా రిలయన్స్ ఇంత ఎక్కువ ధరను ప్రకటించటం గమనార్హం. ఆ రేటుకి అంగీకరించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరింది. రిలయన్స్ పేర్కొన్న ఆ ధరను నిర్ణయించటానికి శాస్త్రీయమైన ఆధారాలు లేవని, అది ఏకపక్షంగా ఉందని ఆ ధరకు సహజ వాయువును కొనుగోలు చేస్తే ఎరువులు, విద్యుత్, తదితర పరిశ్రమలకు ఇచ్చే సబ్సిడీ భారం అధికమౌతుందని విమర్శలు వచ్చాయి.

ఈ నేపధ్యంలో ధర అంశాన్ని పరిశీలించటానికి కేంద్రం కార్యదర్శుల కమిటీని నియమించింది. ధరను నిర్ణయించటానికి రిలయన్స్ కంపెనీ అనుసరించిన సూత్రాలు లోపభూయిష్టంగా ఉన్నవనీ, పారదర్శకంగా లేవనీ కమిటీ అభిప్రాయపడింది. సహజ వాయువుల ధరలు, ఉపయోగితాంశాలను నిర్ణయించటంలో ప్రభుత్వానికి సార్వభౌమాధికారం ఉందని ఈ కమిటీ వక్కాణించింది. ఈ మొత్తం అంశాన్ని పరిశీలించటానికి, పారదర్శకంగానూ బాధ్యతాయుతంగానూ నిర్ణయాలు చేయడానికి ఒక రెగ్యులేటరీ ఏజెన్సీ, పటిష్టవంతమైన ఆడిట్ వ్యవస్థ ఉండాలని కమిటీ సూచించింది.

తదనంతరం ధర నిర్ణయ సమస్యను రంగరాజన్ అధ్యక్షతన గల ప్రధాని ఆర్థిక సలహామండలి పరిశీలించింది. పరిశ్రమలు అనుసరిస్తున్న మార్కెట్ సూత్రాల ఆధారంగానే రిలయన్స్ కంపెనీ ధర నిర్ణయించటాన్ని ఈ కమిటీ సమర్థించింది. ఈ అంశంలో సహజవాయువు జాతి అంతటికీ సంబంధించిన సంపద అనే అంశాన్ని గాలికి వదిలేసి ఒక కార్పొరేట్ సంస్థ దేశాన్ని దోచుకోవటానికి ఆర్థిక సలహా మండలి ఆమోద ముద్ర వేసింది.

రిలయన్స్ కంపెనీ నిర్ణయించిన ధరపట్ల వివిధ వర్గాల నుండి చెలరేగిన విమర్శల కారణంగా ఈ అంశాన్ని కేంద్ర ప్రభుత్వం ప్రణబ్ ముఖర్జీ అధ్యక్షతన గల మంత్రుల కమిటీకి అప్పచెప్పింది. ఆ కమిటీ ఏదో ఘనకార్యం చేసినట్లుగా నటించి రిలయన్స్ కోరిన 4.33 డాలర్ల ధరను 4.2 డాలర్లకు తగ్గించింది. కొండను తవ్వి ఎలుకను పట్టటం అంటే ఇదే. 2.43 డాలర్ల రేటుకి సహజవాయువు అమ్మినా విపరీతంగా లాభాలు సంపాదించుకోవటానికి రిలయన్స్‌కి అవకాశం ఉన్నప్పటికీ మంత్రుల కమిటీ 4.2 డాలర్ల రేటు నిర్ణయించటం వెనుక ఉన్న కుట్రను ప్రజలు అర్థం చేసుకోవాలి. ప్రభుత్వాలు కార్పొరేట్ సంస్థల చెప్పుచేతల్లో ఉంటూ జాతి ప్రయోజనాల కన్నా వ్యాపార ప్రయోజనాలకే ప్రాధాన్యత ఇచ్చాయనేది వాస్తవం.

## పెట్టుబడి పెంపు – కాకి లెక్కలు

నూతన విధానాల ప్రకారం రిలయన్స్ లాంటి కాంట్రాక్టర్లు పెట్టిన పెట్టుబడిని తీసుకునేదాకా లాభం పెట్రోలు ఉండదు. సహజవాయువు వెలికితీతలో రిలయన్స్ పెట్టిన పెట్టుబడిపైన ప్రభుత్వ లాభం పెట్రోలు,

రాయల్టీలు ఆధారపడి ఉంటాయి. వాస్తవంగా ఖర్చు చేసిన దానికన్నా మించి పెట్టుబడి ఎక్కువ చూపినందువలన ప్రభుత్వ రాబడి తగ్గడమేకాక ఆలస్యంగా వస్తుంది. ఈ లోపల చమురు బావిలో చమురును, గ్యాస్‌ను రిలయన్స్ త్వరగా తోడుకొని అమ్ముకొని వట్టి బావిని ప్రభుత్వానికి అప్ప చెబుతుంది. పెట్టుబడి ఎక్కువ చూపించినందు వలన రెండు లాభాలు. ఒకటి పెట్టుబడి త్వరగా తీసుకోవచ్చు. రెండు పెట్టుబడికి రెండున్నర రెట్లు ధనం తిరిగి వచ్చేవరకు ప్రభుత్వానికి పైకం చెల్లించ కుండా నిక్షేపాలు అనుభవించవచ్చు. కాకిలెక్కలు చూపించి పెట్టుబడి పెంచినందువలన అయాచితంగా అంతులేని ధనార్జనచేసి ప్రజలను మోసపుచ్చుతున్నారు. ఈ పనిని రిలయన్స్ చేసి చూపిస్తుంటే ప్రభుత్వం వంతపాడుతోంది. రిలయన్స్ మొదట చూపిన పదివేల కోట్ల పెట్టుబడిని అమాంతంగా 36 వేల కోట్ల పెట్టుబడిగా మార్పుచేసి చూపింది. అందుచేతనే కార్యదర్శుల కమిటీ లెక్కలలో పారదర్శకత కావాలన్నది.

ఆలస్యంగానైనా మేల్కొన్న రాష్ట్ర ప్రభుత్వం కె.జి. బేసిన్ సహజ వాయువులో మన రాష్ట్రానికి న్యాయ సమ్మతమైన వాటా లభించాలని కోరింది. అయితే రిలయన్స్ సంస్థ తాను ఉత్పత్తి చేస్తున్న సహజ వాయువులో 28 ఎం.సి.ఎం.డి.లు తన తమ్ముడికే చెందిన అనిల్ అంబానీ గ్రూపుకు, 12 ఎం.సి.ఎం.డి.లు గుజరాత్‌లోని ఎన్.టి.పి.సి.కి సరఫరా చేయటానికి అంగీకరించాననీ, మిగిలింది తన పరిశ్రమలకు, తన తమ్ముడి పరిశ్రమలకు, తన రేటుకి కొనే ఇతర వినియోగదారులకు సరఫరా చేయాలి కాబట్టి కొత్తగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి ఒక్క యూనిట్ సహజవాయువుని కూడా సరఫరా చేయలేనని తేల్చి చెప్పింది.

దీని ఫలితంగా మన రాష్ట్రంలో ఇప్పటికే ప్రైవేట్ రంగంలో నెలకొల్పిన మూడు గ్యాస్ ఆధారిత విద్యుత్ ఉత్పాదనా కేంద్రాలకు తాను చెల్లిస్తున్న నష్టపరిహార భారం మరింత జటిలమవుతున్న దృష్ట్యా ముఖ్యమంత్రి సరఫరా, ధరలకు సంబంధించిన కొన్ని సూచనలు చేస్తూ కేంద్రానికి 29 లేఖలు రాశారు. ఆ లేఖలలో ఆయన ప్రతిపాదించిన అంశాలలో ముఖ్యమైనవి.

1. కేంద్ర ప్రభుత్వానికి వచ్చే లాభం గ్యాస్‌లో భాగంగా కె.జి. బేసిన్‌లో లభ్యమయ్యే దానిలో యాభై శాతం మన రాష్ట్రానికి ఇవ్వాలి.
2. గ్యాస్ ధరను నిర్ణయించటానికి ఒక రెగ్యులేటరీ కమిటీ ఉండాలి.
3. రిలయన్స్ కంపెనీ ఒక ఎం.ఎం.బి.టి.యు. సహజ వాయువును 1.97 డాలర్లకు లేదా కనీసం 2.34 డాలర్లకు సరఫరా చేయాలి.
4. రాష్ట్ర భూభాగం గుండా వెళ్తున్న గ్యాస్ పైపులైన్లపై లెవీ వసూలు చేసుకొనే అధికారం రాష్ట్రానికుండాలి.

న్యాయబద్ధమైన ఈ సూచనలలో ఏ ఒక్కదానిని కూడా కేంద్ర ప్రభుత్వ మంత్రుల కమిటీ పరిగణనలోకి తీసుకోనే లేదు. అంతేకాదు, తాను స్వయంగా కమిటీ ముందు హాజరయి వాదనను వినిపిస్తానన్న ముఖ్యమంత్రి అభ్యర్ధనను కూడా మంత్రుల కమిటీ తిరస్కరించింది. ఇది రాష్ట్ర ప్రజలందరూ తీవ్రంగా అభ్యంతరం తెలుపవలసిన అంశం. మంత్రుల కమిటీ రిలయన్స్ సంస్థకు దాసోహం అయిన తరువాత ముఖ్యమంత్రి ప్రసంగిస్తూ 'ధర విషయంలో పోరాటం ముగిసింది' అన్నారు.

కనుక మన రాష్ట్రానికి చెందిన ఈ సహజ వనరు పై హక్కును మనం రక్షించుకోవటానికి మనమే పోరాడవలసిన అవసరం ఏర్పడింది. పన్నెండవ ఆర్థిక సంఘం కూడా ఏ ప్రాంతంలో దొరికే సహజ వనరుల పైన అయినా ఆ ప్రాంతానికి వినియోగితా ప్రాధాన్యతను ఇవ్వాలని సూచించింది. అందుచేత మనది వితండవాదం కాదు. మన రాష్ట్రంలో లభ్యమయ్యే సహజవనరులలో కొంత భాగాన్ని మాత్రమే మన రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధి కోసం డిమాండ్ చేస్తున్నాం. ఇది అత్యంత హేతుబద్ధమైన, న్యాయబద్ధమైన డిమాండ్.

భూమిలోపల కొన్ని వేల సంవత్సరాల పరిణామాల ఫలితంగా సహజ వాయువు ఏర్పడింది. కె.జి. బేసిన్ వద్దనున్న ప్రజలు సముద్రపు ఆటుపోట్లను, అల్పపీడనాలను, వాయుగుండాలను, ఉప్పెనలను, సునామీల కష్టాలను ఎదుర్కొంటూ జీవిస్తున్నారు. అంతేకాక భారీ యంత్రాలు, వాహనాలు తిరగడం వలన రోడ్లు చెడిపోవడం, శబ్ద కాలుష్యం వంటి కష్టాలను వారనుభవిస్తున్నారు. మన గ్రామాల నుండి పొలాల నుండి గ్యాస్ పైపులైన్లను గుజరాత్‌కు తీసుకువెళుతూ మనకు ఒక్క కె.జి.గ్యాస్ కూడా ఇవ్వరట. సరియైన నష్టపరిహారం ఇవ్వకుండా పైప్‌లైన్ల చెకింగ్ పేరుతో పొలాలను తెగతొక్కుతున్నా, మనం మాట్లాడకూడదట. కె.జి. బేసిన్ నుండి గ్యాస్ తీసినందువలన భూగర్భంలో వచ్చే పెను మార్పులు, నేలకోత, పొలాలు ఉప్పురికి పోవటం మాత్రం ప్రజలు భరించాలట. స్థానిక అవసరాలు తీర్చడాన్ని నిరాకరించి సుదూర ప్రాంతాలకు గ్యాస్ తీసుకు వెళ్లడాన్ని అనుమతించరాదు, సహించరాదు.

మన రాష్ట్రంలో లభించే సహజ వనరులను దోచుకుని రిలయన్స్ వంటి కార్పొరేట్ సంస్థలు ఇబ్బడిముబ్బడిగా తమ వ్యాపార సామ్రాజ్యాన్ని విస్తరించుకోవటాన్ని మన ప్రజల ప్రయోజనాల దృష్ట్యా మనం వ్యతిరేకించాలి. లేని పక్షంలో మనం భవిష్యత్ తరాల ముందు దోషులుగా నిలబడవలసి వస్తుంది.

నిజానికి ఇది ప్రభుత్వ, ప్రజాప్రతినిధుల బాధ్యత. అయితే ఇప్పటివరకు మన ప్రజాప్రతినిధులు స్పందించాల్సిన రీతిలో స్పందించని ఫలితంగా ఒక సమష్టి కార్యాచరణతో ప్రజా ఉద్యమాన్ని నిర్వహించ వలసిన బాధ్యత ప్రజల మీదే పడింది. విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు అనే నినాదంతో గతంలో మన రాష్ట్ర ప్రజలు నిర్వహించిన తీరులోనే సుదీర్ఘమైన ప్రజా ఉద్యమాన్ని నిర్వహించకపోతే కె.జి.బేసిన్ సహజ వాయువులో మన వాటా మనకు దక్కదు. కనుక ప్రజలందరం ఈ ఉద్యమంలో పాల్గొని దీని పునాదిని విస్తృతం చేసి ఉద్యమాన్ని బలోపేతం చేయటంద్వారా మన న్యాయసమ్మతమైన డిమాండ్లను సాధించుకుందాం.

## డిమాండ్లు

1. కె.జి. బేసిన్‌లో లభ్యమయ్యే సహజవాయువు ముందుగా మన రాష్ట్ర అవసరాలు తీర్చాలి, తర్వాతనే సరిహద్దులు దాటాలి.
2. రిలయన్స్ కార్పొరేట్ సంస్థకు దాసోహమై కేంద్ర ప్రభుత్వం నిర్ణయించిన సహజ వాయువు ధరను వెంటనే తగ్గించాలి.
3. గృహ అవసరాలకు వంట గ్యాస్‌ను పైపు లైన్లద్వారా 14 కేజీలకు సమానమైన గ్యాస్ వంద రూపాయలకు నిరంతరాయంగా సరఫరా చేయాలి.
4. కేంద్ర ప్రభుత్వానికి రాయల్టీగా లభించే సహజవాయువులో కనీసం యాభై శాతం రాష్ట్రానికి కేటాయించాలి. ◆

ప్రభుత్వం చేపడుతున్న విద్యాయజ్ఞంలో సమాజంలోని బడుగు, బలహీనవర్గాల ప్రజల ప్రయోజనాలు సమిధలౌతున్నాయని, ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్య లక్ష్యం నీరుగారిపోతోందని అంటున్నారు **జి. రమేష్**

# ప్రాథమిక విద్యకు పాడెకట్టబోతున్న సర్కార్

లోక కళ్యాణం కోసం లోగడ యజ్ఞాలు సాగేవి. అవిప్పుడు రాష్ట్ర సర్కారు ప్రాయోజకత్వంలో లోక కంటకంగా జరుగుతున్నాయి. జలయజ్ఞం, భూ యజ్ఞాల వరసలో విద్యా యజ్ఞాన్ని ఈ ప్రభుత్వం తాజాగా తలపెట్టింది. ప్రాథమికోన్నత విద్యారంగం సముద్ధరణే ధ్యేయమంటూ పైకి ఎన్ని మాటలు చెప్పినా, ప్రాథమిక స్థాయికి కూడా ప్రైవేట్ విద్యా వ్యాపారాన్ని విస్తరించే దురాలోచనే ఈ నిర్ణయంలో ప్రస్ఫుటమవుతోంది. పాఠశాల స్థాయిలో విద్యా ప్రమాణాలు పెంచేందుకు చేపట్టదలచిన భారీ సంస్కరణల్లో భాగంగా వచ్చే రెండేళ్లలో గ్రామీణ బాలబాలికల కోసం మూడువేల గురుకుల పాఠశాలలు ప్రారంభించాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. మొదట జిల్లాకు రెండు గురుకులాలతో మొదలుపెట్టి క్రమంగా ప్రతి మండలానికి విస్తరించదలచిన ఈ 'కాన్సెప్ట్ స్కూళ్ల'లో సిబిఎస్ఇ సిలబస్‌తో ఆరు నుంచి పన్నెండో తరగతి దాక బోధిస్తామనడం బాగానే ఉంది. ఈ గురుకులాల ఏర్పాటుకు సర్కారు ప్రైవేట్ భాగస్వామ్యాన్ని ప్రాతిపదికగా చేసుకోవడమే వివాదాస్పద మవుతోంది. ఈ పాఠశాలల కోసం పాతిక నుంచి ముప్పై ఎకరాల భూమి, సిలబస్, నిపుణుల సలహాలు, ఉపాధ్యాయ శిక్షణ, సౌకర్యాల కల్పన వంటి వాటికి భరోసా ఇస్తుంటే, భాగస్వామ్య సంస్థలు పాలన వ్యవహారాల్ని పర్యవేక్షిస్తాయంటున్నారు. సీట్ల భర్తీకి చట్టబద్ధ రిజర్వేషన్ల అమలుతోపాటు, యాజమాన్య కోటాలకూ వాటాగా చోటుపెట్టారు. దానదీనా ప్రాథమిక విద్య ప్రైవేటీకరణకు తలుపులు బార్లా తెరుస్తున్నారు. ఇప్పటిదాకా ఆర్థిక స్తోమత గలవారు తమ పిల్లల్ని ప్రైవేట్ స్కూళ్లు, కాన్వెంట్లలో చదివిస్తుంటే, ఆర్థికంగా బలహీన వర్గాల పిల్లలకు సర్కారీ బళ్లే దిక్కవుతున్నాయి. అవి వానకాలం చదువులని తెలిసినా, వాటిలోనే తమ పిల్లలకు నాలుగు అక్షరం ముక్కలు నేర్పిస్తున్న నిరుపేదలకు ఆపాటి వెసులుబాటునూ దూరం చేసేలా రాష్ట్ర సర్కారు 'ప్రాథమిక' ప్రయోగాలకు సిద్ధపడుతోంది. తాను చేపడుతున్న విద్యాయజ్ఞంలో - సమాజంలోని బడుగు బలహీనవర్గాల ప్రజల ప్రయోజనాల్నే సమిధులు చేస్తోంది.

అందరికీ ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్య అందించాలంటున్న మానవ హక్కుల చార్టర్‌పై స్వాతంత్ర్యానికన్నా ముందే, 1946లోనే ఇండియా సంతకం చేసింది. తరువాత వెలువడిన భారత రాజ్యాంగం దాన్నొక ప్రాథమిక హక్కుగానే గుర్తించలేకపోయింది. పద్నాలుగేళ్ల లోపు పిల్లలందరికీ పదేళ్లలోగా నిర్బంధ ఉచిత విద్య అందించాలన్న ఆదేశిక సూత్రాలకు ఏ గతి పట్టిందో కళ్లకు కదుతూనే ఉంది. ప్రాథమిక విద్యారంగంలో అద్భుత విజయాలు నమోదు చేసిన చైనా, జపాన్ వంటివి ప్రగతి రేసులో దూసుకుపోతున్నాయి.

ప్రాథమిక విద్యారంగాన్ని పరిపుష్టం చెయ్యడంలో ఆరు దశాబ్దాలుగా కొరగాని నిర్వాకం వెలగబెట్టిన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు గురుకులాల పేరిట స్వీయ బాధ్యతల్ని దులపరించుకొనే దుర్మార్గానికి ఒడిగడుతున్నాయి. రాష్ట్ర వ్యాప్తంగా దాదాపు 24 వేల పాఠశాలల్లో సౌకర్యాలు లేవని విద్యాశాఖనే ఇటీవల రాష్ట్ర హైకోర్టుకు నివేదించింది. అన్ని విధాలుగా కొరతల కోమాలో కొట్టుమిట్టాడుతున్న ప్రాథమిక విద్యారంగానికి తగు చికిత్స చేసి జవజీవాలు కల్పించడం రాష్ట్ర ప్రభుత్వ రాజ్యాంగబద్ధ విధి. నిరుడు జూన్‌లో హైకోర్టు ఆ మాటే స్పష్టపరిచింది. ప్రాథమిక విద్యాపరికల్పన అనేది పార్లమెంట్ చేసిన చట్టం. ఆ చట్టాన్ని అమలు చేయాల్సిన బాధ్యత రాష్ట్ర సర్కారుపై ఉంది. ఎన్ని వేల కోట్ల రూపాయలు ఖర్చు అయినాసరే, మౌలిక వసతులు కల్పించాలి అని హైకోర్టు ఘంటాకంఠకంగా చాటినా, సర్కారుకు చీమ కుట్టినట్లయినా లేదు. పై పెచ్చు ప్రాథమిక విద్యపై వ్యయభారాన్ని గణనీయంగా తగ్గించుకొనేలా భిన్న మార్గాల్లో ప్రయత్నిస్తున్న ఈ ప్రభుత్వం కొత్త 'కాన్సెప్ట్' పేరిట అసలుకే ఎసరు పెట్టాలనుకుంటోంది. ప్రయోగాల ముసుగులో రాజ్యాంగబద్ధ విధుల నుంచి పలాయనం చిత్తగించడమే ఈ గురుకుల గూడుపుఠాణి.

భారతదేశం ఎదుర్కొంటున్న మౌలిక సమస్యలన్నింటికి ప్రభుత్వ-ప్రైవేట్ భాగస్వామ్యంతో సృజనాత్మక పరిష్కారాలు కనుగొనాలని ఎన్నో వేదికలపై నుంచి ప్రపంచ బ్యాంకు ఎలుగెత్తుతోంది. అలాంటి పుర్రెలకు పుట్టిన బుద్ధే ఈ ప్రాథమిక గురుకులాలు. కాగా, కేంద్రం ఇలాంటి ప్రయోగాల పట్ల ఇంత ఆసక్తి ఎందుకు కనబరుస్తోంది? దీనికి సమాధానం నిరుడు అక్టోబర్‌లో జాతీయ విజ్ఞాన సంఘం ప్రధానికి రాసిన లేఖలో దొరుకుతుంది. నాణ్యమైన సార్వత్రిక విద్య ప్రాథమిక స్థాయిలో అందరికీ అందడం జాతి ప్రగతికి ఎంతో కీలకమన్న విజ్ఞాన సంఘం కొన్ని కీలక సూచనలు చేసింది. విద్యా హక్కు నమూనా బిల్లును రాష్ట్రాలకు పంపి స్థానికంగా అలాంటి చట్టాలు చేసుకోవాలన్న హితవుతో సరిపుచ్చకుండా, పంచాయితీరాజ్ చట్టం మాదిరిగా కేంద్రమే ఈ విషయంలోనూ చొరవ కనబర్చాలనీ కమిషన్ సిఫారసు చేసింది. అందుకు అవసరమైన భూరి నిధులకూ కేంద్రమే పూచీపడాలని విస్పష్టంగా సూచించింది. చట్టాలు చేయడంలో ఉన్న ఉబలాటం నిధుల

కేటాయింపులో, సక్రమ వ్యయీకరణల్లో కొరవడబట్టే - ఇంతకాలంగా ప్రాథమిక విద్యారంగం అనాథలా వెక్కివెక్కి ఏడుస్తోంది. గురుకులాల పేరిట ప్రైవేట్ భాగస్వామ్యం ప్రయోగం ఆంధ్రప్రదేశ్‌లో విజయవంతమైతే ఆ నమూనాను తక్కిన రాష్ట్రాలకు కేంద్రం ప్రతిపాదించగల వీలుంది. స్వీయ బాధ్యతకు నీళ్లొదిలేలా సర్కారీ బళ్లకు ఉరితాళ్లు పేనుతూ, ప్రైవేట్ శక్తుల్ని పెద్ద ఎత్తున స్వాగతిస్తున్న కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, అంతిమంగా బాలసరస్వతిని సంతలో సరుకు చేస్తున్నాయి. చదువు 'కొన'గలిగే వాళ్లకే ప్రాథమిక విద్యనూ పరిమితం చేసే రాష్ట్రసర్కారు ధోరణి రాజ్యాంగ విరుద్ధం. కోట్లాది బడుగు, బలహీన వర్గాల పిల్లలభవితకు ఈ ప్రైవేటీకరణ ప్రయోగాలు అక్షరాల శరాఘాతం.

## మూసివేత యజ్ఞం

పాము తన గుడ్లను తనే తిన్నట్టుగా తన యాజమాన్యంలోవి స్కూళ్లను రాష్ట్ర ప్రభుత్వమే గొంతు నులిమి చంపుతోంది. విద్యాహక్కుకు తూట్లు పొడుస్తూ విద్యార్థులు తక్కువగా ఉన్నారన్న కారణంతో వేలాది స్కూళ్లను మూసివేయడానికి పథకం సిద్ధం చేస్తోంది. నడుస్తున్న (2006-07) విద్యా సంవత్సరంలో వెయ్యికి పైగా స్కూళ్లకు గోరీ కట్టిన ప్రభుత్వం 2007-08లో అంతకు మరికొన్ని రెట్ల సంఖ్యలో స్కూళ్లను అంపశయ్యపైకి నెట్టడానికి సిద్ధమవుతోంది. ఇరవై కంటే తక్కువ సంఖ్యలో విద్యార్థులు ఉన్న పాఠశాలలను మూసివేయ దగ్గవిగా పాఠశాల విద్యాశాఖ భావిస్తోంది. పాఠశాల విద్యాశాఖ తాజాగా సేకరించిన గణాంకాల ప్రకారం 2006-07 విద్యా సంవత్సరంలో 6,617 ప్రాథమిక పాఠశాలల్లో ఇరవై మందికంటే తక్కువ విద్యార్థులు నమోదయ్యారు. వీటన్నిటినీ దశలవారీగా మూసివేసే సూచనలు కనిపిస్తున్నాయి. పది మందికంటే తక్కువ మంది విద్యార్థులు నమోదైన పాఠశాలలు 1345 లెక్కకు తేలాయి. దాదాపు ఇవన్నీ మూతపడేవే. వాటితోపాటు పదిహేనుకు లోపు విద్యార్థులున్న పాఠశాలలను కూడా మూసివేయాలన్నది ప్రభుత్వ యోచన. ఏకీకృత సర్వీస్ నిబంధనల వివాదంతో నిలిచిపోయిన ఉపాధ్యాయుల బదిలీలను చేపట్టి, అప్పుడే మూసివేత యజ్ఞాన్ని కూడా ప్రారంభించాలనీ పాఠశాలల విద్యాశాఖ అంటోంది. గత ఏడాది పదిమంది విద్యార్థులున్న పాఠశాలలను మూసివేయాలనీ ఆదేశాలు ఇవ్వగా, ఈసారి మరో అడుగు ముందుకు వేస్తోంది. 2005-06లో ఒక్క విద్యార్థి కూడా చేరని ప్రాథమిక పాఠశాలలు 415 లెక్క తేలగా, ఒకటి నుంచి తొమ్మిది మంది విద్యార్థులు చేరిన పాఠశాలలు 1300 తేలాయి. కొన్ని మినహాయింపులు ఉన్నప్పటికీ దాదాపు ఇవన్నీ ఈ విద్యా సంవత్సరంలో పనిచేయటం లేదని సమాచారం. గత సంవత్సరం 19 మంది వరకు విద్యార్థులు చేరిన ప్రాథమిక పాఠశాలల సంఖ్య 6657గా లెక్క తేలింది. వాటిలో కొన్ని మూసివేసినా ఈ ఏడాది కూడా దాదాపు అంతే సంఖ్యలో (6617) ప్రాథమిక పాఠశాలల్లో ఇరవై కంటే తక్కువ (19 వరకు) విద్యార్థులు చేరారు. అంటే ఏటేటా విద్యార్థుల సంఖ్య తగ్గిపోతున్న స్కూళ్లు వేల సంఖ్యలో పెరుగుతున్నాయన్నమాట. అంతేకాకుండా గత ఏడాది తక్కువ (ఇరవై లోపు) విద్యార్థులు నమోదైన పాఠశాలల్లోనే ఈ ఏడాది కూడా తక్కువ విద్యార్థులు చేరారన్నమాట. వరుసగా రెండేళ్లపాటు విద్యార్థుల సంఖ్య తక్కువ ఉంది కాబట్టి మూసివేతకు 'అర్హత' సంపాదించినట్టే.

తాజా గణాంకాల ప్రకారం రాష్ట్రంలోని ప్రాథమిక పాఠశాలల్లో చాలా వరకు (54,277 స్కూళ్లు) యాభై మంది కంటే తక్కువ విద్యార్థులున్నవే. అదే సమయంలో ప్రైవేట్ పాఠశాలల్లో ప్రాథమిక దశలో ఉన్న విద్యార్థుల సంఖ్య వందల్లో ఉంటుంది. రాష్ట్రంలోని ప్రైవేట్ అన్ ఎయిడెడ్ పాఠశాలల్లో చేరిన విద్యార్థుల సంఖ్య 2004-05లో 35,46,959గా ఉంటే 2005-06లో 40,08,234కు పెరిగింది. ప్రస్తుత సంవత్సరంలో మరింత పెరిగే అవకాశం ఉంది. ప్రభుత్వ స్కూళ్లు మూసివేయడం వల్ల వాటిలో చదివే విద్యార్థుల్లో ఎక్కువ భాగం డ్రాపౌట్ అవుతుంటే మిగిలిన వారు సమీపంలోని ప్రైవేట్ పాఠశాలల్లో చేరుతున్నారు. కాగా 'మేమెక్కడా పాఠశాలలను మూసివేయడం లేదు. పిల్లలు రాకపోవడం వల్ల పాఠశాలలు పని చేయడం లేదంతే' అని ప్రభుత్వం లోకాన్ని నమ్మింప జూస్తున్నది.

## సర్కారు బడుల్లో చెట్టెక్కుతున్న చదువులు

ఉన్నత విద్యలో కోరలు చాచిన విద్యావ్యాపారం ఇప్పుడు పాఠశాల స్థాయిలోనూ విస్తరిస్తోంది. గ్రామీణ ప్రాంతాల్లోని మండల ప్రజాపరిషత్, జిల్లా పరిషత్, ఎయిడెడ్ పాఠశాలల్లో కనీస సౌకర్యాలు కొరవడడంతో కొత్తగా బడికి వేళ్లే వారిలో మెజారిటీ పిల్లలు వాటివైపు కన్నెత్తి చూడడం లేదు. పైగా ఇప్పటికే ఆయా పాఠశాలల్లో చదువుతున్న వారు ప్రైవేట్ పాఠశాలల వైపు పరుగులు పెడుతున్నారు. ఫలితంగా గత ఒక్క ఏడాదే ప్రైవేట్ పాఠశాలల్లో చేరే పిల్లల సంఖ్య 10.98 శాతం పెరిగింది. మొత్తం ఎన్‌రోల్‌మెంట్‌లో ప్రైవేట్ అన్ ఎయిడెడ్ పాఠశాలల వాటా 32.11 శాతానికి పెరిగింది. ఇది కేవలం గుర్తింపు పొందిన పాఠశాలల వాటాకాగా, గుర్తింపు లేని పాఠశాలల ఎన్‌రోల్‌మెంట్ కలుపుకుంటే ప్రైవేట్ వాటా 38.67 శాతానికి చేరుకుంది. గత రెండేళ్లలో రాష్ట్రంలోని ప్రైవేట్ పాఠశాలల ఎన్‌రోల్‌మెంట్ తొమ్మిది లక్షల మేరకు పెరిగింది. అదే సమయంలో ప్రభుత్వ, స్థానిక సంస్థల, మునిసిపల్ పాఠశాలల్లో పిల్లల సంఖ్య తగ్గింది. 2006-07 విద్యా సంవత్సరంలో వివిధ యాజమాన్యాల వారీగా పాఠశాలల్లో చేరిన పిల్లల వివరాలను ఒకసారి పరిశీలిస్తే గుర్తింపు పొందిన పాఠశాలల్లో 1,38,51,230 మంది, గుర్తింపులేని ప్రైవేట్ పాఠశాలల్లో 9,08,138 మంది పిల్లలు చేరినట్లు లెక్కలు తేలింది. గుర్తింపు పొందిన పాఠశాలల్లో 2005-06లో మొత్తం విద్యార్థుల సంఖ్య 1,35,11,923 మంది కంటే 2006-07లో ఈ సంఖ్య 2.51 శాతం పెరిగింది. విద్యార్థుల సంఖ్య 3,39,307 పెరిగింది. అయితే ఈ పెరుగుదల ప్రభుత్వ అజమాయిషీలోని పాఠశాలలకు చేరలేదు. పైగా ప్రభుత్వ అజమాయిషీలోని మండల పరిషత్, జిల్లా పరిషత్, మునిసిపల్, ఎయిడెడ్ పాఠశాలల్లోని పిల్లల సంఖ్య దాదాపు 1.20 లక్షల మేరకు తగ్గింది. ప్రైవేట్ పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య 4,40,108 వరకు పెరిగింది. స్థానిక సంస్థలు, ఎయిడెడ్ పాఠశాలల్లో ఎన్‌రోల్‌మెంట్ తగ్గినా, ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య ఇరవై వేలు పెరగడం విశేషం.

సర్కారు బడుల్లో సౌకర్యాల కొరత, ఇంగ్లీష్ మీడియం పై మోజు ప్రైవేట్ పాఠశాలల్లో పిల్లల సంఖ్య పెరగడానికి ప్రధాన కారణాలుగా నిలుస్తున్నాయి. మరోవైపు ప్రభుత్వం కూడా ప్రపంచ బ్యాంకు మార్గదర్శకాల మేరకు ప్రాథమిక దశలోనే ప్రైవేట్ వాటాను పెంచేందుకు

**కేంద్రంలో అత్యధిక కాలం కాంగ్రెస్ పార్టీ అధికారంలో ఉంది గనుక ప్రజల ఆకాంక్షలను నిర్లక్ష్యం చెయ్యడంలో, ఉద్యమాలని విద్రోహాలకు గురి చెయ్యడంలో కాంగ్రెస్‌కు మించింది లేదని అంటున్నారు నాగోబా**

# రెండో ఎస్సార్సీ - మరో వంచన

కేంద్రంలో కాంగ్రెస్‌కు, లెఫ్ట్‌పార్టీలకు అణుబంధం తెగి పోయిందన్న సూచనలు కన్పించినప్పటి నుంచి ఇక యుపిఎకి నూకలు చెల్లినాయని అందరూ భావించారు. కేంద్రంలో మధ్యంతర ఎన్నికలు ఎప్పుడైనా వస్తాయని ఊహాగానాలు జోరుగా సాగినాయి. కేంద్రంతోపాటు రాష్ట్రంలో కూడా ఎన్నికలు వస్తాయని ఊహాగానాలు సాగినాయి. రాష్ట్రంలో రాజకీయాలు వేడెక్కినాయి. ముఖ్యంగా కాంగ్రెస్‌లోని తెలంగాణ నాయకుల్లో దిగులు, ఆందోళన స్పష్టంగా వ్యక్తమైనాయి. ఎన్నికలలోగా తెలంగాణ అనుకూల ప్రకటన రాకపోయినట్లయితే కాంగ్రెస్ తీవ్రంగా నష్టపోతుందన్న అభిప్రాయాన్ని మధుయాష్కీ పదే పదే బహిరంగంగానే ప్రకటించాడు. ఢిల్లీలో తెలంగాణ వాదులు ఏర్పాటు చేసిన ఒక సదస్సులో ఆయన ప్రసంగిస్తూ 'తెలంగాణ కాంగ్రెస్ నాయకులు నోరు విప్పి మాట్లాడకపోతే వారిని ఘెరావ్ చెయ్యండి, నియోజకవర్గాలలోకి అడుగు పెట్టనివ్వకండి' అని తెలంగాణ ఉద్యమకారులకు పిలుపునిచ్చాడు. టి.ఆర్.సి.సి. కూడా తెలంగాణ అనుకూల నిర్ణయం తీసుకునేందుకు అధిష్ఠానంపై ఒత్తిడి పెంచే ప్రయత్నాలు మొదలుపెట్టింది. కె.ఆర్. ఆమోస్, పాల్వాయి గోవర్ధనరెడ్డి, ఇంద్రకరణ్‌రెడ్డి తదితరులు టి.ఆర్.సి.సి. తీసుకోవాల్సిన వైఖరిపై ప్రైవేట్‌గానూ, పబ్లిక్‌గానూ ప్రకటనలు చేస్తున్నారు.

---

ఇతోధికంగా కృషిచేస్తోంది. తన పర్యవేక్షణలో నడుస్తున్న పాఠశాలలకు కనీసం మరుగుదొడ్లు, తాగునీటి సౌకర్యాలు, ఉపాధ్యాయుల కొరత, పాఠ్యపుస్తకాల సక్రమ పంపిణీ వంటి సమస్యలు పరిష్కరించకుండా, ప్రైవేట్ యాజమాన్యాలు నెలకొల్పే గ్రామీణ పబ్లిక్ స్కూళ్లకు యాభై ఎకరాల వరకు భూమిని ఉచితంగా ఇస్తానంటోంది. దానికితోడు పాఠశాలలు నెలకొల్పేందుకు అయ్యే వేల కోట్ల రూపాయల వ్యయంలో పాలు పంచుకుంటానంటోంది. బడుగు, బలహీనవర్గాల పిల్లలు ఎక్కువగా చదివే సర్కారు బడులను గాలికొదిలేసి, కాన్సెప్ట్ పాఠశాలల్లో వందలమంది బడుగు, బలహీనవర్గాల పిల్లలకు రిజర్వేషన్లు కల్పిస్తానంటోంది. వసతులు కల్పించకపోవడం, టీచర్లను నియమించక పోవడం వల్ల పిల్లలు తగ్గిపోతుంటే, అదే వంకతో పాఠశాలలను మూసి వేస్తోంది. 2006-07లో ప్రభుత్వం 1020 పాఠశాలలను మూసివేసింది. ఈ విద్యాసంవత్సరంలో మరో 6,115 పాఠశాలలను మూసివేసేందుకు ప్రయత్నిస్తోంది. మండల, జిల్లా పరిషత్ పాఠశాలల్లో ఎన్‌రోల్‌మెంట్ తగ్గిపోవడానికి గత ఏడాది పాఠశాలలు మూసివేతకూడా కొంతవరకు కారణం. ఇక ఎయిడెడ్ పాఠశాలల్లో టీచర్లపోస్టుల భర్తీపై నిషేధం, మునిసిపల్ స్కూళ్లలో నియామకాలే చేపట్టకపోవడం కూడా ఆ పాఠశాల ల్లో విద్యార్థులసంఖ్య తగ్గిపోవడానికి ప్రధాన కారణాలుగా కనిపిస్తున్నాయి.

ప్రాథమిక విద్యను పేద, బడుగు, బలహీన వర్గాలకు దూరం చేసే సంస్కరణలకు రాష్ట్ర ప్రభుత్వం పథక రచన చేస్తున్నది. ప్రాథమిక విద్యారంగంలో నూరుశాతం విదేశీ పెట్టుబడులను అనుమతించే అంశంలో రాష్ట్ర ప్రభుత్వ వైఖరి చివరి అంకానికి చేరుకుంది. అయితే విద్యా వ్యవస్థలో సమగ్ర సంస్కరణలకూ అభివృద్ధికీ చేపట్టే కార్యక్రమాలు సామాజిక అంతరాలు పెంచేవిగా ఉన్నాయి. ఇప్పటికే దేశంలో ప్రాథమిక విద్య, మాధ్యమిక విద్య ప్రైవేట్ మార్గం వైపు వడివడిగా నడుస్తున్నాయి. విద్యా రంగంలో తీవ్రమైన సామాజిక అసమానతలు ఏర్పడ్డాయి. ఆర్థికంగా, సామాజికంగా బలహీనమైన షెడ్యూల్డ్ కులాల, తెగల, వెనుకబడిన తరగతుల, అల్ప సంఖ్యాక విద్యార్థులు చదువు'కొన'లేక పోతున్నారు. దేశంలో 2001 జనాభా లెక్కల ప్రకారం షెడ్యూల్డ్ కులాలలో 3.1 శాతం, షెడ్యూల్డ్ తెగలలో 2.4 శాతం మంది మాత్రమే చదువుకుంటున్నారు. ఇందుకు గల కారణం భారతదేశ స్థూల దేశీయోత్పత్తిలో 0.37 శాతం నిధులను మాత్రమే విద్యకు ఖర్చు చేస్తున్నారు. విద్యారంగంలో బోధన, బోధనేతర సిబ్బందిలో చాలా భాగం ఈ ప్రైవేట్ స్కూళ్ల పర్మిషన్లు, అకడమిక్ వ్యవహారాలు, పరీక్షల నిర్వహణ మొదలగు విధులకే పరిమితం కావడం విశేషం. ఇక బోధన, పరిశోధన, పరిపాలన కొరకు అదనపు అధ్యాపకులను గాని, బోధనేతర సిబ్బందిని గాని ప్రభుత్వం ఇవ్వడం లేదు. అందుచేత ప్రతి విద్యాలయాల్లో గానీ, కళాశాలల్లో గానీ వందలాది మంది పార్ట్‌టైం అధ్యాపకులు, బోధనేతర సిబ్బంది దినసరి వేతనాలపై పని చేస్తున్నారు. దాదాపు 40-50 శాతం ఉద్యోగులు దినసరి వేతనం తీసుకొనే వారున్నారు. నిరాదరణతో, నిధులకోతతో, సిబ్బందికొరతతో కునారిల్లుతున్న విద్యాలయాలకూ, కళాశాలలకూ, విశ్వవిద్యాలయాలకూ కావాల్సిన వసతులు కల్పించడం లో పాలకవర్గాలు తీవ్రమైన నిర్లక్ష్య ధోరణితో వ్యవహరిస్తున్నాయి. రాష్ట్రంలో నూరుశాతం అక్షరాస్యత సాధిస్తామని ప్రభుత్వం ఆలోచించడం మంచిదే కానీ ఈ మూలుగుతున్న విద్యా రంగాన్ని కూడా పునరుద్ధరించి, కష్టాల నుండి గట్టెక్కించకుండా నూరుశాతం అక్షరాస్యత సాధించడం ఎవరితరం కాదు. గ్రామాల్లో వసతులు లేని ప్రభుత్వ పాఠశాలలన్నీ, డాక్టర్లు, మందులు లేని ప్రాథమిక వైద్యశాలల వలె మిగిలిపోతాయి కానీ మానవ వనరుల అభివృద్ధికి ఏమాత్రం దోహదపడవు. ◆

అయితే కేంద్రం నుండి వారు ఆశించినట్లు తెలంగాణ అనుకూల ప్రకటనలు రాకపోగా తెలంగాణ వ్యతిరేక ప్రకటనలే వస్తున్నాయి. మొదట దిగ్విజయ్‌సింగ్ ఆ తర్వాత ఆయన వారసుడు వీరప్ప మొయిలీ కాంగ్రెస్ తెలంగాణ ప్రజలకిచ్చిన వాగ్దానం రెండవ ఎస్సార్సీయే. ఈ రెండవ ఎస్సార్సీయే తెలంగాణ అంశాన్ని తేలుస్తుందని ప్రకటించారు. వీరి ప్రకటన కాంగ్రెస్‌లోని తెలంగాణ వాదులని నివ్వెరపరిచింది. కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళికలో ఎస్సార్సీని వేస్తామని ప్రకటించినప్పటికీ మొదటి ఎస్సార్సీ సిఫార్సులను గౌరవిస్తామని అన్నారని వారు గుర్తు చేస్తున్నారు. యుపిఎ ఉమ్మడి ప్రణాళికలో తెలంగాణ ఏర్పాటు అంశాన్ని చేర్చింది. రాష్ట్రపతి ద్వారా యుపిఎ ప్రభుత్వం తెలంగాణ ఏర్పాటుకు కట్టుబడి ఉందని పలికించడం, తెలంగాణపై ఏకాభిప్రాయ సాధన కోసం ప్రణబ్ కమిటీని ఏర్పాటు చేయడం జరిగిందని, దీన్ని బట్టి యుపిఎ ప్రభుత్వం తెలంగాణ ఏర్పాటుకు ప్రజలకు వాగ్దానం చేసినట్లేనని, ఇప్పుడు రెండవ ఎస్సార్సీ వేయడం అంటే ప్రభుత్వం తెలంగాణ ప్రజలను వంచించడమేనని కాంగ్రెస్‌లోని తెలంగాణ నాయకులు అంతర్గతంగా మదనపడుతున్నారు. ఈ వంచనకు కాంగ్రెస్ మూల్యం చెల్లించక తప్పదని వారు భావిస్తున్నారు. కరీంనగర్ ఎన్నికల్లో వ్యక్తమైన ప్రజాభిప్రాయం తర్వాత కూడా కాంగ్రెస్ రెండో ఎస్సార్సీకి మొగ్గుచూపడం ఆత్మహత్యాసదృశమేనని వారు భావిస్తున్నారు. ఇటీవల ఎం. సత్యనారాయణ రావు ఇదే అభిప్రాయాలను పత్రికల వారికి వెల్లడించి సంచలనానికి కారకుడయినాడు. ఆయన మరింత ముందుకు పోయి తెలంగాణ ఏర్పాటుకు ముఖ్యమంత్రి వైఎస్ అడ్డంకిగా ఉన్నాడని ప్రధానమంత్రే స్వయంగా తనతో అన్నాడని ఆయన ప్రకటించారు.

కాంగ్రెస్‌లో సంచనాల సంగతి అట్లుంచితే కాంగ్రెస్ తమ ఎన్నికల ప్రణాళికలో రాసిన వాక్యాలను విశ్లేషించాలి. మొదటి ఎస్సార్సీ సిఫారసులను గౌరవిస్తూనే దేశంలో అటువంటి డిమాండ్స్‌ని పరిశీలించేందుకు రెండవ ఎస్సార్సీ వేస్తామని పేర్కొన్నారు. మొదటి ఎస్సార్సీ చాలా స్పష్టంగానే తెలంగాణ, ఆంధ్ర ప్రాంతాలు ప్రత్యేక రాష్ట్రాలుగా కొనసాగాలని సిఫారసు చేసింది. మొదట ఎస్సార్సీ సిఫారసులను గౌరవించడం అంటే ఏమిటి? తెలంగాణ రాష్ట్రాన్ని ఏర్పర్చడం కాదా? తమ వైఖరి రెండో ఎస్సార్సీనే అయితే మరి యుపిఎ ఎజెండాలో రెండో ఎస్సార్సీ ప్రస్తావన ఎందుకు రాలేదు? రెండో ఎస్సార్సీని వేసే బదులు ప్రణబ్ కమిటీని ఎందుకు వేసినట్లు? ఏకాభిప్రాయ సాధన అన్నది కాలాయపన కోసం ఉద్దేశించిన నాటకమేనా? మొదటి ఎస్సార్సీ తర్వాత ఏర్పాటైన పదిహేను రాష్ట్రాలకు లేని ఎస్సార్సీ సిఫారసులు ఒక్క తెలంగాణకే ఎందుకు? బిజెపి తెలంగాణకు మద్దతు పలికిన తర్వాత కూడా తెలంగాణకు ఏకాభిప్రాయం ఏర్పడలేదన్న మాట వంచనకాక మరేమిటి? ఈ ప్రశ్నలు తెలంగాణ ప్రజలు సూటిగానే అడుగుతున్నారు. కాంగ్రెస్ నాయకులేమో తెలంగాణ అంశాన్ని సోనియాకు వదిలేశాం. ఆమెపై మాకు పూర్తి విశ్వాసం ఉన్నది. ఆమెకు తెలంగాణ ప్రజల ఆకాంక్షలు తెల్సు. సరైన సమయంలో ఆమె తెలంగాణ అనుకూల నిర్ణయం తీసుకుంటుందన్న అభిప్రాయాలను వెల్లడిస్తున్నారు. వారికి సోనియాపై విశ్వాసం ఉన్నదేమో కాని తెలంగాణ ప్రజలకు మాత్రం విశ్వాసం కలగటం లేదు. ఎందుకంటే ఈ మూడున్నర ేండ్లలో ఒక్కసారికూడా ఆమె తన మనోభావాలను వెల్లడి చేయలేదు.

ఈ రకంగా చెబుతూ వస్తున్న నాయకులకు ఏమైనా చెప్పిందా? సోనియాకు తెలంగాణ ప్రజల ఆకాంక్షలు తెలిస్తే మరి దిగ్విజయ్‌సింగ్, వీరప్ప మొయిలీలు రెండో ఎస్సార్సీ ప్రకటనలు ఎందుకు చేస్తున్నట్లు? రెండో ఎస్సార్సీ ఏర్పాటు చెయ్యడం దిగ్విజయ్‌సింగ్, వీరప్ప మొయిలీల వ్యక్తిగత అభిప్రాయాలా? లేక కాంగ్రెస్ అధిష్ఠానం అభిప్రాయమా? ఎవరి అభిప్రాయం ఎట్లున్నా రెండో ఎస్సార్సీ వేయడం వెనుక కోస్తా భూస్వామ్య, పెట్టుబడీదారుల కుట్ర ఉన్నదన్న విషయం తెలంగాణ ప్రజలకు అర్థం అయ్యింది. రెండో ఎస్సార్సీ చేత తెలంగాణ వ్యతిరేక సిఫారసులు చేయించి తెలంగాణ రాష్ట్ర ఆకాంక్షను శాశ్వతంగా భూస్థాపితం చేయడం – తెలంగాణకు అనుకూలంగా సిఫారసు చేయడం అనివార్యమైతే హైదరాబాదును కేంద్రపాలిత ప్రాంతంగా ప్రకటింపచేసి హైదరాబాద్‌ను తెలంగాణకు దక్కకుండా చెయ్యడం. ఇవి రెండో ఎస్సార్సీ వెనుక కోస్తా భూస్వాములు, పెట్టుబడిదారుల కుట్ర. ఈ కుట్రను తెలంగాణ ప్రజలు అర్థంచేసుకున్నారు కనుకనే 'హైదరాబాదును కాపాడు కుందాం – తెలంగాణను సాధించుకుందాం' అన్న నినాదాన్ని ఇస్తున్నారు.

. ప్రజల ఆకాంక్షలు ఎన్నిసార్లు ఎంత స్పష్టంగా వ్యక్తమైనా కేంద్రంలోని పాలకవర్గాలు (యుపిఎ అయినా ఎన్‌డిఎ అయినా) ఎప్పుడూ కోస్తా సంపన్నవర్గాల ప్రయోజనాలకే కొమ్ముకాస్తున్నాయి. ఈ వంచనాపూరిత వైఖరిని కేంద్ర ప్రభుత్వం 1948లో హైదరాబాద్ రాజ్యం భారత యూనియన్‌లో విలీనం అయిన కాడ్నించీ ప్రదర్శిస్తున్నాయి. కేంద్రంలో అత్యధిక కాలం కాంగ్రెస్ అధికారం చెలాయించింది గనుక ఈ వంచనలో కాంగ్రెస్‌దే సింహభాగం. ప్రజల ఆకాంక్షలను నిర్లక్ష్యం చెయ్యడంలో, ఉద్యమాలని, విద్రోహాలకు గురి చెయ్యడంలో కాంగ్రెస్‌కు మించింది లేదు. తెలంగాణ విషయంలో కాంగ్రెస్ చరిత్ర అంతా విద్రోహాల చరిత్రే. ఈ విద్రోహాల చరిత్ర సంక్షిప్తంగా పునశ్చరణ చేసుకుంటే –

1. 1948లో హైదరాబాద్ రాజ్యాన్ని భారత యూనియన్‌లో విలీనం చేసిన తర్వాత హైదరాబాద్‌లో నాలుగేండ్లపాటు మిలిటరీ ప్రభుత్వాన్ని నడిపింది. ప్రజా ప్రభుత్వం ఏర్పాటుకు అవకాశమున్నా ఆపని చెయ్యలేదు. ఈ నాలుగేండ్ల మిలిటరీ పాలనలో హైదరాబాద్ రాష్ట్రంలో పౌర హక్కులు మృగ్యమైనాయి. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటంలో రైతు కూలీలు స్వాధీనం చేసుకున్న పది లక్షల ఎకరాల భూమిని తిరిగి భూస్వాముల పరం చేసింది. వేలాది మంది పోరాట యోధులను హతమార్చింది. హైదరాబాద్ రాష్ట్రం లోని ప్రభుత్వ ఉద్యోగాలలో ముల్కీ రూల్సుకి విరుద్ధంగా వేలాదిగా ఆంధ్రులను, తమిళులను దిగబెట్టింది. విలీనం అనంతరం వెంటనే ప్రజా ప్రభుత్వం ఏర్పాటై ఉంటే ఈ పరిస్థితి ఏర్పడి ఉండేది కాదు.
2. 1952 ఎన్నికల్లో కాంగ్రెస్ గెల్చి బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రిగా ప్రజా ప్రభుత్వం ఏర్పాటైంది. మిలిటరీ ప్రభుత్వం కాలంలో ప్రభుత్వ ఉద్యోగాలలో దిగబడిన గైర్ ముల్కీలకు వ్యతిరేకంగా 'గైర్ ముల్కీ గోబ్యాక్' ఉద్యమం తెలంగాణ అంతటా పెల్లుబికింది. గైర్ ముల్కీలను వెనక్కి పంపి ఆ ఖాళీలలో ముల్కీలను భర్తీ చెయ్యవల్సిన బూర్గుల కాంగ్రెస్ ప్రభుత్వం ముల్కీ ఉద్యమకారులను అరెస్ట్ చేసి జైళ్లకి పంపింది. లాఠీ ఛార్జీలు చేసి కాళ్లు చేతులు విరగ్గొట్టింది. కాల్పులు జరిపి 13 మందిని బలి తీసుకున్నది. ఇంత జరిగినా గైర్ ముల్కీలు వెనక్కి పోనేలేదు.
3. 1953లో ఫజల్ అలీ అధ్యక్షతన రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం

ఏర్పాటైంది. సంఘం హైదరాబాద్ సందర్శించినప్పుడు ఈ ప్రాంత ప్రజలు విశాలాంధ్రని వ్యతిరేకిస్తూ విజ్ఞాపనలు సమర్పించారు. విశాలాంధ్ర ఏర్పడితే తాము అన్యాయమైపోతామని, దోపిడీకి గురి అవుతామని, వివక్షకు బలి అవుతామని భయాందోళనలు వెలిబుచ్చారు. సంఘం ఈ భయాందోళనలను పరిగణనలోకి తీసుకొని ఆంధ్ర, హైదరాబాద్ రాష్ట్రంలోని తెలంగాణ ప్రాంతం ప్రత్యేక రాష్ట్రాలుగా కొనసాగాలని సిఫారసు చేసింది. విలీనమే అనివార్యమైతే 1962లో కొత్తగా ఏర్పాటయ్యే తెలంగాణ అసెంబ్లీలో మూడింట రెండువంతుల సభ్యులు విలీనానికి అనుకూలంగా ఉంటే అప్పుడు ఉమ్మడి రాష్ట్రాన్ని ఏర్పాటు చెయ్యవచ్చునని సూచించారు. హైదరాబాద్ రాష్ట్ర ముఖ్యమంత్రి బూర్గులను లొంగదీసుకొని, సంఘం సిఫారసులను బుట్టదాఖలు చేసి 1956లోనే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని ఏర్పాటు చేసి తెలంగాణ ప్రజలను వంచించింది ఆనాటి నెహ్రూ నాయకత్వంలోని కాంగ్రెస్ ప్రభుత్వం.

4. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం బేషరతుగా ఏర్పడింది కాదు. పెద్ద మనుషుల ఒప్పందం ద్వారా తెలంగాణకు అనేక రక్షణలు కల్పించారు. 1956 నవంబర్ 1న ఆంధ్రప్రదేశ్ ఏర్పాటైన మరుక్షణం నుంచే పెద్ద మనుషుల ఒప్పందం ఉల్లంఘన మొదలయ్యింది. ముఖ్యమంత్రిగా పదవి స్వీకరించిన నీలం సంజీవరెడ్డి పెద్ద మనుషుల ఒప్పందం ప్రకారం తెలంగాణ వ్యక్తిని ఉప ముఖ్యమంత్రిగా నియమించాలి. ఆనాటి వరకు ఆంధ్ర రాష్ట్రానికి ఉప ముఖ్యమంత్రిగా వ్యవహరించిన సంజీవరెడ్డికి తాను ముఖ్యమంత్రి కాగానే ఉప ముఖ్యమంత్రి పదవి ఆరోవేలుగా మారింది. సంజీవరెడ్డి ఉప ముఖ్యమంత్రిని నియమించకుండా ఉల్లంఘనకు పాల్పడ్డాడు. అటు కేంద్ర నాయకులు, ఇటు తెలంగాణ కాంగ్రెస్ నాయకులు ఈ వంచనను ప్రశ్నించకుండా మిన్నకుండిపోయి ఆ వంచనలో భాగస్వాములయ్యారు.

5. పెద్ద మనుషుల ఒప్పందం ఇచ్చిన మరో హామీ ముల్కీ రూల్సు కొనసాగింపు. 1969 వరకు అంటే పదమూడేండ్లలో ముల్కీ రూల్సుకు విరుద్ధంగా ఇరవై రెండు వేల మంది స్థానికేతరులు తెలంగాణ ఉద్యోగాలలో దిగబడినారు. నిధులు, నీళ్లు మళ్లించబడినాయి. ఈ దోపిడీకి వ్యతిరేకంగా తెలంగాణ ప్రజలు తిరగబడితే బ్రహ్మానందరెడ్డి నాయకత్వంలోని కాంగ్రెస్ ప్రభుత్వం 370 మంది ప్రాణాలను బలిదీసుకున్నది. ఈ ఉద్యమాన్ని మన్నించి ప్రత్యేక తెలంగాణ రాష్ట్రాన్ని ప్రకటించవలసిన కేంద్రంలోని కాంగ్రెస్ ప్రభుత్వం ఉద్యమ నాయకత్వాన్ని ప్రలోభపెట్టి లోబర్చుకొని ద్రోహానికి ఒడిగట్టింది. 1971లో జరిగిన పార్లమెంట్ ఎన్నికల్లో 14 సీట్లలో పదింటిలో తెలంగాణ ప్రజా సమితి అభ్యర్థులను గెలిపిస్తే వారందర్నీ కాంగ్రెస్‌లోకి విలీనం చేసుకొని మరో మహా ద్రోహానికి పాల్పడింది కాంగ్రెస్. సుప్రీంకోర్టు 1972లో ముల్కీ రూల్సు రాజ్యాంగ బద్ధమేనని ప్రకటిస్తే ఆ తీర్పును కాలరాస్తూ ఆరు సూత్రాల పథకాన్ని ప్రవేశపెట్టింది. పార్లమెంట్ చట్టం ద్వారా 1975లో రాష్ట్రపతి ఉత్తర్వులు జారీ చేసింది. రాష్ట్రపతి ఉత్తర్వులు నిరాఘాటంగా ఉల్లంఘనకు గురవుతున్నా కేంద్రం పట్టించుకోలేదు. తెలంగాణ కాంగ్రెస్ నాయకులు పట్టించుకోలేదు. 1985లో ఎన్.టి. రామారావు రాష్ట్రపతి ఉత్తర్వుల ఉల్లంఘనల్ని సవరించడానికి, స్థానికేతరులను వెనక్కి పంపడానికి వీలు కల్పిస్తూ 610 జి.ఓ. జారీచేస్తే ఇరవై రెండు సంవత్సరాల తర్వాత కూడా జి.ఓ. అమలు కాలేదు. రాష్ట్రపతి ఉత్తర్వుల ఉల్లంఘనలు మాత్రం కొనసాగినాయి. ఈ మోసంలో, ఈ వంచనలో కాంగ్రెస్, తెలుగుదేశం రెండూ భాగస్వాములే.

6. పైన వివరించినవి ద్రోహాల గత చరిత్ర. ఇక వర్తమానంలోకి వస్తే 2004లో గులాబి కండువాలు కప్పుకొని, తెలంగాణ నినాదాలు ఇచ్చి, తెలంగాణ రాష్ట్రాన్ని వాగ్దానం చేసి గద్దెనెక్కిన కాంగ్రెస్ మూడేండ్ల తర్వాత రెండో ఎస్సార్సీ అంటూ మరో ద్రోహానికి తెరలేపుతున్నది. రాష్ట్ర ఆకాంక్షకు అభివృద్ధిని ఎరగా వేస్తున్నది. ఈ అభివృద్ధిని తెలంగాణ ప్రజలు తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు ప్రత్యామ్నాయమని భావించడం లేదు. 'అభివృద్ధి మా ప్రజాస్వామిక హక్కు, తెలంగాణ మా జన్మ హక్కు' అని నినదిస్తున్నారు.

ఇక రాష్ట్ర రాజకీయాలవైపు వస్తే, ఎన్నికల వాతావరణం టి.ఆర్.ఎస్.ను కూడా కదిలించినట్లు కనిపిస్తోంది. టి.ఆర్.ఎస్. మళ్లీ ప్రజల్లోకి వెళ్లవలసిన అగత్యం ఏర్పడింది. పార్టీ నిర్మాణం మీద దృష్టి సారిస్తున్నది. అన్ని తెలంగాణ జిల్లాలలో ప్రజా సదస్సులు నిర్వహించింది. భోనగిరి (నల్లగొండ), జమ్మికుంట (కరీంనగర్), వనపర్తి (మహబూబ్‌నగర్), నిర్మల్ (ఆదిలాబాద్), వికారాబాద్ (రంగారెడ్డి), కామారెడ్డి (నిజామాబాద్), జనగామ (వరంగల్) మొదలైన పట్టణాలలో వరుసగా జరిగిన ప్రజా సదస్సులు విజయవంతమైనాయి. హైదరాబాద్‌లో పార్టీ కేంద్ర కార్యాలయంలో తెలంగాణ తల్లి విగ్రహ ప్రతిష్ఠాపన తెలంగాణ ప్రజల్లో మంచి స్పందనను ఇవ్వగలిగింది. అయితే టి.ఆర్.ఎస్. రాజకీయ పోరాటాలకు సమాయత్తం కాకపోవడం పట్ల ప్రజల్లో అసంతృప్తి వ్యక్తమవుతోంది.

అపూర్వంగా విజయవంతమైన ప్రజా సదస్సులను చూసి కాంగ్రెస్ నాయకులు నిజంగానే భయాందోళనకు లోనయినట్లు కనిపిస్తోంది. జానారెడ్డి లాంటి గుంభనంగా ఉండే మంత్రులు సైతం తెలంగాణం ఎత్తుకోక తప్పటం లేదు. తెలంగాణ కాంగ్రెస్ నాయకుల్లో ఎంత అంతర్మథనం జరుగుతున్నా, వారి ఆంతరంగంలో తెలంగాణ పట్ల ఎంత మమేకత ఉన్నా వారు ఆచరణరీత్యా ఇంకా కోస్తా పాలకవర్గాలకు దళారులుగానే వ్యవహరిస్తున్నారని చెప్పక తప్పదు. కాంగ్రెస్‌లోని తెలంగాణ వాదులు మేల్కొన్నట్లు కనిపిస్తున్నా వారు మరింత మిలిటెంట్‌గా ఉద్యమించాలి. వారు తమ రాజకీయ భవిష్యత్తు కోసమైనా తెలంగాణ రాష్ట్ర ఆకాంక్షను మరింత బలంగా, నీళ్లు నమలకుండా వ్యక్తీకరించాలి. లేనట్లయితే ప్రజల ఆగ్రహానికి బలికాక తప్పదు. ప్రొఫెసర్ జయశంకర్ 'తెలంగాణ కాంగ్రెస్ నాయకులు కోస్తా పాలకవర్గాల కింద రెండో శ్రేణి నాయకులుగా కొనసాగదలిస్తే అది వారిష్టం. కాని తెలంగాణ ప్రజలు ఉమ్మడి రాష్ట్రంలో రెండో శ్రేణి పౌరులుగా కొనసాగేందుకు సిద్ధంగా లేరు' అని అనేక సభల్లో చెబుతుంటారు. తెలంగాణ ప్రజలు ఇక ఎంత మాత్రమూ కాంగ్రెస్ వంచనను సహించే స్థితిలోలేరు. వారు మానసికంగా ఈ వంచనను ఎదుర్కొనేందుకు సంసిద్ధంగా ఉన్నారు.

బ్రిటిష్ వారినుంచి స్వతంత్రం వచ్చిన తరువాత కూడా బానిస భావాలను వదులుకోని భారతజాతి ఇంకా అధికార రహస్యాల చట్టం, కోర్టు ధిక్కార నేరం వంటి శాసనాలను పెంచి పోషిస్తోందంటున్నారు **మాడభూషి శ్రీధర్**

# 'కోర్టు ధిక్కారం' విమర్శకుల నోళ్లు మూయడానికా ?

విమర్శించే నోళ్లు మూసి, కలాల్ని కెమెరాల్ని జైల్లోతోసి, జనచైతన్యాన్ని అణచివేసే రాచరికపు అవశేషం, ప్రజాస్వామ్యానికి శాపం - కోర్టు ధిక్కారం. ఇదొక విపరీత అధికారం. మిడ్ డే పత్రికలో మాజీ ప్రధాన న్యాయమూర్తి వై.కె. సభర్‌వాల్ గురించి చేసిన ఆరోపణలు సమంజసమయినవి కాకపోవచ్చు, పరువు తీసేవి కావచ్చు. ఒక న్యాయమూర్తి గురించి ఆ విధంగా అనడం న్యాయం కాకపోవచ్చు. ఆ విషయమై ఢిల్లీ హైకోర్టు అసహనం కూడా సరయినదే కావచ్చు. కాని ఒక విమర్శ చేసినందుకు, లేదా ఒక ఆరోపణ చేసినందుకు దాన్ని కోర్టు ధిక్కారం అని నిందించి ఆ మాటలు అన్న వారిని జైలుకు పంపించడం ఏ మాత్రం న్యాయం కాదు. వారి ఆరోపణల్లో నిజం ఉండే అవకాశం ఉంటే విచారించాలి. ఆ తప్పులు ప్రధాన న్యాయమూర్తి స్థాయిలో జరగవని, ఒకవేళ జరిగితే నిజానిజాలు పరిశీలించే అవకాశం మన న్యాయవ్యవస్థలో ఉందని ధైర్యం చెప్పి జనంలో న్యాయవ్యవస్థకు ఉన్న అపారమయిన విశ్వాసాన్ని రక్షించుకోవలసింది పోయి, మమ్మల్ని తిడతావా నిన్ను జైల్లోతోస్తాం అనే వైఖరి అవలంబించడం అంత మంచి పనికాదు.

## జన విశ్వాసం అపారం

కోర్టును ఎవరు ధిక్కరిస్తున్నారు? న్యాయవితరణలో ఎంత జాప్యం జరిగినా ఈ దేశ ప్రజ తన నమ్మకాన్ని ఇసుమంతైనా సడలించలేదు. ఇప్పటికీ ప్రభుత్వాలు, పోలీసులు, పార్లమెంట్, భయానకమయిన కార్యవర్గం, అవినీతితో కుతుకుతలాడిపోతున్న అధికార యంత్రాంగం పెట్టే కష్టాల్ని భరిస్తూ, ఈ దేశం ప్రశాంతంగా కోర్టు ఫీజుకట్టి వకీళ్లకు ఫీజులిచ్చి న్యాయం కోసం ఓపిగ్గా ఎదురుచూస్తున్న జనం కోర్టు ధిక్కారం చేయలేదు. చేయరు కూడా. జనం నమ్మకమే న్యాయవ్యవస్థకు ఒక వరం. ప్రభువులు చేసే నేరాలకు, శాసనసభలు చేసే అతిక్రమణలకు న్యాయం వెతుక్కునే స్థానం న్యాయస్థానం ఒక్కటే. టీచర్లకు, పోలీసులకు, ఎంఎల్.ఏ.లకు, ముఖ్యమంత్రులకు ప్రధానికి లేని ప్రత్యేక గౌరవం న్యాయమూర్తులకు ఇచ్చి మర్యాదగా వ్యవహరిస్తున్నది ఈ దేశం. మనం చేయవలసిందల్లా న్యాయవ్యవస్థను రక్షించుకోవడమే. అప్పుడు అది మన న్యాయాన్ని రక్షిస్తుంది. న్యాయస్థానాన్ని రక్షించుకోవలసిన బాధ్యత అందరిపైనా ఉంది. న్యాయమూర్తులపైనా ఉంది.

## ఎక్కడుంది శిక్షించే అధికారం?

ఆర్టికల్ 215, 129 ప్రకారం హైకోర్టులు, సుప్రీంకోర్టులను కోర్ట్ ఆఫ్ రికార్డ్ అంటారు. వీటి స్వచ్ఛమైన చరిత్రను కాపాడుకునేందుకు వీరికి అపారమయిన అధికారాలను రాజ్యాంగం ఇచ్చింది. తన ధిక్కారాన్ని శిక్షించే అధికారంతో సహా కోర్టుకు ఉండే అన్ని అధికారాలు ఉంటాయని చెప్పింది. ఈ అధికారం మొత్తం రాజ్యాంగ స్ఫూర్తి ఆధారంగా వాడుకోవాలి. కోర్టు ధిక్కార చట్టం 1971లో ఉన్న మార్గదర్శకాలను, పలు సందర్భాలలో సుప్రీంకోర్టు, హైకోర్టులు చేసిన సూచనలను అనుసరించాల్సి ఉంటుంది. బ్రిటిష్ సంప్రదాయాన్ని పాటించి, అక్కడ రాజుగారి లేదా రాణిగారి ప్రతినిధులుగా ఉన్న న్యాయమూర్తులకు తమను నిందించే వారిని శిక్షించాలని, తమ ఆదేశాల ను ధిక్కరించే వారిని శిక్షించాలని, శాసించే అధికారాలు ఇవ్వాలని ఆకాంక్షించారు. బ్రిటన్‌లో హెన్రీ 4 గారి కుమార రత్నం ఒక జడ్జిగారి పట్ల అనుచితంగా ప్రవర్తించారు. ఆ జడ్జిగారు ఈయన్ని కోర్టు ధిక్కారం కింద జైలుకు పంపారు. తరువాత ఆ రాకుమారుడికి హెన్రీ 5గా పట్టాభిషేకం జరిగింది. కొత్త ప్రభువు చేత మళ్లీ నియమింపబడడానికి ఆ జడ్జిగారు వచ్చినపుడు, 'నన్ను శిక్షించిన న్యాయమూర్తిని నేను ఇష్టపడతానని ఎలా అనుకున్నారు' అన్నాడట. దానికి ఆయన 'మిమ్మల్ని శిక్షించింది నేను కాదు. నా ద్వారా మీ తండ్రిగారు మాత్రమే మీకు శిక్ష వేసారు. న్యాయమూర్తులు ప్రభువు ప్రతినిధులుగా మాత్రమే వ్యవహరిస్తారు' అని చెప్పారట. దానికి ఆయన సంతోషించి మళ్లీ ఆయననే న్యాయమూర్తిగా నియమించారట. రాజధిక్కారాన్ని నివారించడానికి కోర్టు ధిక్కారాన్ని నేరంగా నిర్ణయించే సంప్రదాయం ఆ రకంగా వచ్చింది. బ్రిటిష్ కోర్టులు ఈ విధంగా విమర్శకులను జైలుకు పంపించే దుస్సంప్రదాయాన్ని మరిచిపోయి కొన్ని దశాబ్దాలు గడిచిపోయాయి. కాని వారి నుంచి స్వతంత్రం వచ్చిన తరువాత కూడా బానిస భావాలను వదులుకోని భారతజాతి ఇంకా అధికార రహస్యాల చట్టం, కోర్టు ధిక్కారం నేరం వంటి శాసనాలను పెంచి పోషిస్తున్నది. రాజులే పోయినా రాజ్యాలు పోయినా ఇటువంటి బూజుపట్టిన సామ్రాజ్య భావాలు, న్యాయనిర్ణేతలమన్న గౌరవానికి బదులు తామే ప్రభువులమన్న ఆలోచనల మధ్య కోర్టు ధిక్కార అధికారాలను నోరెత్తితే చాలు జైలుకు పంపుతాం అనే దశకు చేరుకున్నాయి.

## బ్రిటిష్ రాచరికాలు, బానిస భాష

కోర్టులు ఆదేశాలను పాటింపచేయడానికి, కోర్టుల పనితీరులో ఎవరూ అనవసర జోక్యం చేసుకోకుండా ఆపడానికి గాను కోర్టు ధిక్కార చట్టం 1971లో రూపొందించారు. ఈ చట్టం ప్రకారం కోర్టు ఆదేశాన్ని ఉల్లంఘించినా, కోర్టుకు ఇచ్చిన మాట తప్పినా సివిల్ నేరం. కాని కోర్టు పనిని ఆపినా, కోర్టును నిందించి పరువు తీసినా నేరం. కోర్టును కించపరిచినా, కించపరిచే ధోరణి ఉన్నా, కోర్టు పని ఆపినా, ఆపే ధోరణి ఉన్నా అది కోర్టు ధిక్కారమే అన్నారు. ఒక వ్యక్తి అన్న మాటలలో కించపరిచే

ధోరణి ఉందని ఎవరు చెప్పాలి? ఆ ధోరణికి ప్రమాణాలేమిటి? ఏది అవును? ఏది కాదు? ఇది ఎవరూ చెప్పలేరు. ఈ అయోమయ నిర్వచనం వల్ల ఏదయినా కోర్టు ధిక్కారంగా పరిగణించే ప్రమాదం ఉంది. ఆ ప్రమాదం ఆనాడు ఇ.ఎం.ఎస్. నంబూద్రిపాద్‌కు, ఇటీవల అరుంధతీ రాయ్‌కు, అమాయకురాలయిన బాధితురాలు సాక్షి జహీరా షేక్‌కు, ఇటీవల మిడ్ డే జర్నలిస్టులకు ఎదురయింది. వారి పొరబాటు ఏమంటే వారు వాడిన భాష. నీ బాంచెను కాల్మొక్త అంటే ఎంత బానిస భాషో మైలార్డ్ అనడం కూడా అంతే బానిస భాష. ఆ భాష వాడి న్యాయమూర్తులను గౌరవించడం మనం బ్రిటిష్ సంప్రదాయంగా తెచ్చుకున్నాం. మిస్టర్ జస్టిస్ అంటే చాలునని, మైలార్డ్ అనే సంబోధన అవసరం లేదని బార్ తీర్మానాలు చేసినా ఆమాట అనకపోతే అనలేదని గుర్తుంచుకునే వారు, అనకపోవడం వల్లనే నష్టపోయామని అనుకునే వారు ఉన్నారు. వంది మాగధ ప్రభు భాష అలవాటయిన పెద్దలకు విమర్శ సహించదు. కనుక ఈ అసహనానికి తోడు కోర్టు ధిక్కారాన్ని శిక్షించే అధికారం కూడా చేరువ కావడం సహజమయిన, రాజ్యాంగం ఇచ్చిన భావప్రకటన స్వేచ్ఛకు వ్యతిరేకం. లోపాలు ఎత్తిచూపడం, చర్చ, విమర్శ, ఆత్మ పరిశీలన ద్వారా ప్రజాస్వామ్యంలో ప్రభుత్వాలు బాగుపడతాయి. నిలదీస్తే తప్ప తప్పు తెలిసిరాదు. విమర్శించే ఆత్మవిశ్వాసాన్ని భగ్నం చేసి జైలుకు పంపడం ద్వారా, ప్రశ్నించని జాతిని తయారు చేయడం ప్రజాస్వామ్యానికి మంచిది కాదు.

## ఏది ధిక్కారం?

విమర్శ ఎప్పుడూ ధిక్కారం కాదు. అవాస్తవపు నింద ఉంటే దాన్ని పరువు తీసే వ్యాఖ్యగా మాత్రమే పరిగణించాలి. కోర్టు ఆదేశాలను ఉల్లంఘించడం కోర్టు ధిక్కారం అవుతుంది. కోర్టులో అవినీతి పనులు చేసే కోర్టు వారే కోర్టు ధిక్కారానికి పాల్పడతారు. రికార్డులు మార్చి నిందితులను నిర్దోషులుగా మార్చడం, లంచాలు తీసుకుని బెయిల్ ఇవ్వతగని నేరాలను ఇవ్వ తగిన నేరాలుగా మార్చడం వంటివి నిజమైన కోర్టు ధిక్కారాలు. వాటిని మాత్రం కొన్ని మినహాయింపులు మాత్రమే అని కొట్టివేస్తూ, వ్యక్తులను విమర్శిస్తే మాత్రం విరుచుకుపడడం ఎంత వరకు న్యాయం? న్యాయస్థానాల్లో కూడా అవినీతి చొరబడిందని కొందరు ప్రధాన న్యాయమూర్తులే అన్నారు. అది కూడా కోర్టు ధిక్కారమేనా? మిడ్ డె రాసిన రాతల్లో ఆరోపణ గురించి శాంతి భూషణ్ వంటి సీనియర్ న్యాయవాదులు, న్యాయమూర్తులు ప్రస్తావించి విమర్శలు చేసారు. అవి కూడా కోర్టు ధిక్కారాలేనా? వారిని వదిలేసి కేవలం పత్రికల్లో రాసిన విమర్శకులను మాత్రం బెదిరించడం ఏం న్యాయం?

## మిడ్డే మతిమీరిందా?

మిడ్ డే మితి మీరి ఉండవచ్చు. నిజానికి పాత్రికేయులు తాము వాడే భాషను సరిచూసుకోవలసి ఉంది. తీవ్రంగా దెబ్బతీసే పదజాలాన్ని చాలా సులువుగా విరివిగా వాడడం వల్ల ప్రతిస్పందన తీవ్రంగా ఉంటుంది. మిడ్ డే పదవీ విరమణ చేసిన ప్రధాన న్యాయమూర్తి సభర్‌వాల్ పనితీరు మీద కొన్ని వ్యాఖ్యలు చేసింది. సభర్‌వాల్ స్వయంగా ఒక వ్యాసం రాస్తూ తనపై వచ్చిన ఆరోపణలకు ఒక్కొక్క దానికి జవాబు ఇచ్చారు. అది ఒక ప్రజా సమస్యగా మారింది. ఢిల్లీలో అక్రమ నిర్మాణాలు, పార్కింగ్ వంటి సౌకర్యాలు లేని దుకాణాలు అంటూ వాటిని మూయించే కార్యక్రమాన్ని కఠినంగా చేపట్టిన దశలో సుప్రీంకోర్టు బెంచికి సభర్‌వాల్ అధ్యక్షత వహించారు. రిటైల్ వ్యాపారాలు మూయించి, భారీ వ్యాపారాలకు వీలు కల్పించే ఈ కార్యక్రమం భారీ వ్యాపార మాల్స్ నిర్మించే వృత్తిలో ఉన్న తన తనయుడికి లాభం కలిగించే రీతిలో జరిగిందంటూ విమర్శలు వచ్చాయి. ఆ విమర్శల ఆధారంగా ఘాటయిన పదజాలంతో మిడ్ డే ఆరోపణలను చేసింది. దాంతో పాటు ఇదంతా అవినీతి అని ఆరోపిస్తూ ఒక కార్టూన్ కూడా గీసింది. అప్పటికి సభర్‌వాల్ రిటైర్ అయినరు. ఆయన దీనిపై ఫిర్యాదు చేయలేదు. ఢిల్లీ హైకోర్టు స్వయంగా సువో మోటోగా ఈ రాతలను గీతలను కోర్టు ధిక్కారంగా ఆరోపించి సత్వర కేసు విచారణను చేపట్టింది. ఇది నిందాత్మకమయిన ధిక్కారమని, సుప్రీం కోర్టు వ్యవస్థ ప్రతిష్ఠను దెబ్బతీసే ప్రయత్నం చేసారని ఆరోపణ. నాలుగు నెలల జైలు శిక్ష విధిస్తూ తీర్పు కూడా చెప్పారు. మే 19న వారు ఈ వ్యాస రచన, కార్టూన్ రచన చేస్తే నాలుగు నెలల్లో విచారణ పూర్తయి శిక్ష దాకా వచ్చింది. మధ్యలో ఒకసారి కేసు సుప్రీం కోర్టు దాకా పోయింది కూడా. ఈ విమర్శల వల్ల సుప్రీంకోర్టు లేదా భారత న్యాయవ్యవస్థ పరువు పోయిందా లేక కొందరి వ్యక్తుల మీద అనుమానాలు వచ్చాయా అని కోర్టు పరిశీలిస్తే బాగుండేది. సమున్నతమయిన సుప్రీంకోర్టును కానీ, న్యాయవ్యవస్థను కానీ ఈ విమర్శలు అంటవు. నిజంగా వాటి ఔన్నత్యాన్ని కాపాడదలచుకుంటే అందులో లోపాలను ఏరిపారేయాలి. ఆ లోపాలు ఏమిటో చర్చకు రావాలి. మిడ్ డే కేసులో ఒక ప్రధాన న్యాయమూర్తి వ్యవహారం తీరుపై విమర్శలు వచ్చాయె కాని న్యాయవ్యవస్థపై అపనమ్మకం కలిగించే రీతిలో రాలేదు. సభర్‌వాల్ గారిపైన వచ్చిన విమర్శలు మిడ్ డేలో వచ్చినప్పుడు మొత్తం భారతదేశానికి తెలియదు. ఢిల్లీ హైకోర్టు కేసు పుణ్యమా అని ఇప్పుడు అన్ని మీడియాల్లో అంతటా ఆ విషయాలు చర్చకు వచ్చాయి. అవి పరువు తీసే వ్యాఖ్యలు అనుకున్నా వాటికి మరింత ప్రాచుర్యం కలిగించింది ఈ కేసు విచారణే. మిడ్ డే ఢిల్లీలో మాత్రమే పరువు తీస్తే ఈ కేసు యావత్ ప్రపంచంలోనే పరువు తీసిందని ఎందుకు అనుకోకూడదు? జడ్జిపైన అనుమానాలను అవిశ్వాసాలను వ్యాపింప చేసిందెవరు? వ్యక్తులపైన విమర్శలను వ్యవస్థపైన ధిక్కారంగా పరిగణించడం ఎంతవరకు సమంజసం?

సెక్షన్ 13 కోర్టు ధిక్కార చట్టంలో ముఖ్యమయినది. దురదృష్టవశాత్తూ ఈ సెక్షన్‌ను ఎవరూ పట్టించుకోవడం లేదు. మిగిలిన నిర్వచనాల కింద అది కోర్టు ధిక్కారం అనిపించినా ఇంకా ఏ ఇతర చట్టాల్లో ఏమి రాసినా, గణనీయంగా కోర్టు విధి విధానాల్లో జోక్యం చేసుకోకపోతే లేదా గణనీయంగా జోక్యం చేసుకునే ధోరణి లేకపోతే శిక్ష వేయడానికి వీల్లేదని ఈ సెక్షన్ చెప్పింది. ఒక వ్యక్తి ప్రతిష్ఠను కాపాడడానికి ఈ అధికారాన్ని దుర్వినియోగం చేయరాదని ఎన్నో సందర్భాల్లో ఉన్నత న్యాయ స్థానాలు చెప్పాయి. టెక్నికల్‌గా నిర్వచనం కిందకు వచ్చినంత మాత్రాన శిక్ష వేయకూడదు. న్యాయవిధానంలో జోక్యం తప్పని సరిగా ఉందా లేదా అని చూడాలి. మిడ్ డే రాసిన రాతల వల్ల, కార్టూన్ వల్ల ఎంత వరకు న్యాయస్థానాల పని భంగపడింది? అసలు ఏ విధంగా కోర్టు విధివిధానాలు దెబ్బ తినకపోతే శిక్ష ఎందుకు వేసినట్టు? కోర్టు ముందు ధిక్కారం జరిగితే వెనువెంటనే చర్య తీసుకోవడానికి అధికారాలను సెక్షన్ 14 ఇస్తుంది.

## ఫిర్యాది, న్యాయవాది, న్యాయమూర్తి ఒకరేనా

న్యాయస్థానమే స్వయంగా కేసు చేపడితే జడ్జీలే ఫిర్యాదు దారులని వేరే చెప్పనవసరం లేదు. అటువైపు కోర్టు ధిక్కార నిందితులు, ఇటు తాము చేసిన తమ సహచరులకు సంబంధించిన ఫిర్యాదును తామే విచారించే జడ్జీలు వారి తరపున వాదించే న్యాయవాదులు కూడా తామే అయిపోయి విచారణ సాగిస్తారు. నీవు కోర్టును ధిక్కరించావు, క్షమాపణ చెప్తావా లేక జైలుకు వెళ్తావా అని నిలదీసిన రీతిలో విచారణ శరవేగంగా సాగుతూ

భౌతికంగా సామాజికోద్యమాలు కనుమరుగయ్యాయే కానీ అవి సృష్టించిన బౌద్ధిక, ఉదార వాతావరణం నివురు గప్పిన నిప్పులా ఉండిపోయిందంటున్నారు **వకుళాభరణం రామకృష్ణ**

# ఆంధ్రదేశంలో సామాజికోద్యమాలు

ఈ వ్యాస పరిధి కాలరీత్యా 19వ శతాబ్దానికి, ప్రాంతం రీత్యా ఆంధ్రప్రదేశ్‌లో సర్కారు జిల్లాలకు పరిమితమైంది. 19వ శతాబ్దంలో ఆంధ్రదేశంలో సామాజికోద్యమాలంటే, చరిత్రకారుల అవగాహనలో, కోస్తా ఆంధ్ర మాత్రమే. కాలక్రమానుసారంగా గమనిస్తే 19వ శతాబ్దంలో అప్పటి నిజాం పాలిత హైదరాబాద్ రాష్ట్రంలోని తెలంగాణ ప్రాంతంలో సామాజిక ఉద్యమాలంటూ లేవు. ఆది ఆంధ్ర, జోగినీ వ్యవస్థ రద్దు ఉద్యమాలు 20వ శతాబ్దంలోనే తెలంగాణలో మొదలయ్యాయి. ఆర్య సమాజ భావాలూ, వారు చేపట్టిన సంస్కరణలు కూడ అంతే. భాగ్యరెడ్డి వర్మ సాగించిన సామాజికోద్యమాలు 20వ శతాబ్దం మొదటి దశకాంతానికి రూపుదిద్దుకొంటున్నాయి. 1922లో ఆంధ్ర జన సంఘ కార్యకలాపాలు మొదలయ్యాకే సంఘ సంస్కరణోద్యమాలు అందులో భాగమయ్యాయి. హైదరాబాద్ రాష్ట్ర ప్రజల్లో చైతన్యం ఆలస్యంగా రావడానికి విద్యలేమితోపాటు, సభలు, చర్చలు జరుపుకొనే స్వాతంత్ర్యం లేకపోవడమే. 1901లో శ్రీకృష్ణరాయాంధ్ర భాషా నిలయస్థాపనతో, గ్రంధాలయోద్యమం ప్రారంభమైంది. దీని స్థాపకులే (కొమర్రాజు లక్ష్మణరావు, రావిచెట్టు రంగారావు, ఆదిపూడి సోమనాధరావు ప్రభృతులు) 1904లో వరంగల్‌లో రాజరాజనరేంద్ర గ్రంధాలయాన్ని స్థాపించారు. గ్రంధాలయోద్యమం విద్యా, విజ్ఞానోద్యమంగా పరిగణింపబడ్డా, అది ప్రజల్లో చైతన్య స్థాయిని పెంచి తెలుగు భాషా, సారస్వతాలపై మక్కువను పెంచి, నిజాం నిరంకుశ పాలనను ప్రశ్నించే స్థాయికి ఎదిగింది. ఈ ఉద్యమమే ఆ తర్వాత (1905లో) విజ్ఞానచంద్రికా గ్రంథ మండలి స్థాపనకు దారితీసింది. సమకాలీన సామాజిక, రాజకీయ పరిస్థితులపై దృష్టి మరల్చింది. దీని స్థాపనలో, నాయని వేంకట రంగారావు, కొమర్రాజు లక్ష్మణరావు, రావిచెట్టు రంగారావు ప్రభృతులు ముఖ్యపాత్ర వహించారు. 1905 నుండి (బెంగాల్ విభజన తర్వాత) దేశంలో జరుగుతున్న రాజకీయ పరిణామాలను, తెలంగాణలోని చైతన్యవంతమైన యువకులు పరికిస్తూనే ఉన్నారు.

ఇక, రాయలసీమ ప్రాంతంలో, 19వ శతాబ్దంలో, మనకింత వరకు లభ్యమవుతున్న సమాచారం బట్టి, సామాజికోద్యమాలంటూ ప్రత్యేకించి కానరావు. ఆర్యసమాజ ప్రభావం ఉన్నట్టు కొన్ని

---

ఉంటుంది. ఏ కేసులోనయినా నిందితుడు అమాయకుడనే ప్రాథమిక భావనతో నిష్పాక్షిక విచారణ సాగించాలనేది సహజ న్యాయం. కాని ఈకేసులో వారు కోర్టును ధిక్కరించారని ముందే ఒక కచ్చితమయిన అభిప్రాయానికి వచ్చిన కోర్టు విచారిస్తూ ఉంటుంది. మామూలుగా ఫిర్యాది వేరు, విచారణాధికారి అంటే ప్రాసిక్యూటర్ వేరు, న్యాయమూర్తి వేరుగా ఉండాలి. కాని ఈ కేసుల్లో అన్ని బాధ్యతలను ఒకరే నిర్వహిస్తూ తమ కేసును తామే పరిష్కరించుకుంటారు. తమకు ఆసక్తి, ప్రయోజనం ఉన్న అంశాలలో న్యాయమూర్తులు న్యాయం చేయడానికి సిద్ధం కాకూడదన్నది మరో సహజ న్యాయసూత్రం. కాని ఇక్కడ ఆ సూత్రానికి కూడా తిలోదకాలే. ఇది మిడ్ డే కేసులో మాత్రమే జరిగిందని కాదు. అన్ని కోర్టు ధిక్కారం కేసుల్లో ఇదే జరుగుతోందన్నది నిజం. నిష్పాక్షికంగా వ్యవహరించవలసిన చోట, కోర్టు ధిక్కారం జరిగిందనే ఒక పాక్షిక ధోరణి ఆధారంగా విచారణ జరిగితే న్యాయం ఫలించదు.

## నిజం నిజంగా రక్షిస్తుందా?

'సత్యమేవ జయతే' అన్న మన జాతీయ నినాదం ఎంతవరకు నిజం? 2006 దాకా నిజం చెప్పడం ద్వారా కోర్టును నిందించినా ధిక్కారమే అని శిక్షించేవారు. కాని 2006లో ఒక సవరణ తెచ్చారు. ప్రజా ప్రయోజనం కోసం నిజం చెప్తే దాని వల్ల కోర్టుల ధిక్కారం జరిగిందనుకున్నా అది నేరం కాదనే ఒక వెసులుబాటును కల్పించారు. ఇది చాలా గొప్ప సంస్కరణ అని అనుకున్నారు. కాని ఈ కేసులో ఈ రక్షణ ఎంత డొల్ల రక్షణో తేలిపోయింది. అది నిజం అని రుజువు చేసే అవకాశమే న్యాయస్థానం ఇవ్వలేదు. ఒకవేళ నిజం అని రుజువు చేసినా అది చెప్పడం కన్న దాచడంలోనే ప్రజా ప్రయోజనం ఉందని కోర్టు అభిప్రాయపడితే ఆ రక్షణ కూడా దక్కదు. మిడ్ డే కేసులో ఆ పత్రిక వారికి అది నిజం అని రుజువు చేసే అవకాశం కూడా ఇవ్వలేదు. ఏడాది లంకలో ఉన్న సీతను తెచ్చి ఏలుకున్న రాముడికి ప్రజలను ఏలే అధికారం లేదని ఒక చాకలి విమర్శించాడు. రాముడు కోర్టు ధిక్కారం నేరం కింద చాకలికి ఉరిశిక్ష వేయలేదు. అతను అనుమానించడం సహజమేనని ఆ విమర్శలకు ప్రభువు ప్రతిస్పందించాలని భావించి, తనకు అత్యంత ప్రియమైన భార్యనే వదులుకుంటాడు. చివరకు ఈ యుగంలో కూడా సీతను వదిలేసినందుకు రాముడిని నిందిస్తూనే ఉన్నారు. తనపై యుగయుగాల పాటు నిందలు వచ్చే ప్రమాదం ఉందని తెలిసి కూడా తన పాలనపై విమర్శలకు సానుకూలంగా ప్రతిస్పందించిన ఆదర్శ పాలకుడు. ఈ యుగంలో తమ అక్రమార్జనలను వదులు కోకపోయినా కనీసం ఆ విమర్శ చేసిన వారిని జైలుకు పంపకపోతే చాలు. ◆

దాఖలాలున్నాయి. 1918లో మద్రాసులో ప్రచురింపబడ్డ 'సత్పథం' అనే గ్రంథం చింతా రఘునాథ వర్మ జీవిత చరిత్రకు సంబంధించింది. 1878లో చిత్తూరు జిల్లా వాయల్పాడులో రెడ్డి కులంలో ఈయన జన్మించాడు. ఆర్య సమాజపు ప్రభావంలో వైదిక కర్మల ప్రకారం జందెం వేసుకొని, రెడ్డికి బదులు వర్మగా మారాడు. ఆయన బలిజ, బోయ లాంటి ఇతర కులాల వాళ్లకు కూడా జందేలు వేయించి, 'అస్పృశ్యుల'కు తన ఇంట్లో బడి పెట్టి చదువు చెప్పాడు. ఇది 'బ్రాహ్మణీకరణ'లో భాగంగా భావించినా, ఆర్య సమాజ ఆశయాల్లో ఒకటైన కుల నిరసన, మానవుల మధ్య సమానత్వ భావన మున్నగువాటిని తెలియజేస్తుంది. రాయలసీమ జిల్లాలు మద్రాసు నగరానికి దగ్గరగా ఉండడంతో, 19వ శతాబ్దంలో తలెత్తుతున్న అక్కడి సంస్కరణ భావాల ప్రభావం ఉండి ఉంటుందని భావించవచ్చు. 19వ శతాబ్దంలో కోస్తాంధ్రలో మొదలైన సాంఘిక స్వచ్ఛతా ఉద్యమం (సోషల్ ప్యూరిటి మూవ్‌మెంట్) లో భాగంగా మద్యంపై నిషేధాన్ని విధించాలని ప్రభుత్వం పై ఒత్తిడి తెచ్చేందుకు, బళ్లారి జిల్లాలో కొందరు సంస్కర్తలు కృషి చేశారన్న ఆధారాలున్నాయి. అంతేకాక, మిషనరీల కార్యకలాపాలు - విద్యా వ్యాప్తి ముఖ్యంగా రాయలసీమలోని కొన్ని ప్రాంతాల్లో ప్రాజ్ఞ వాతావరణం నెలకొల్పడానికి దోహదం చేసి ఉండవచ్చు.

ఆంధ్రప్రాంతంలో ఉద్యమాలు 1870 దాకా లేవు. కానీ, 19వ శతాబ్దంలో మొదటి భాగంలో సంస్కరణ భావాలున్నట్టు ఆధారాలు లభించాయి. ఆంధ్ర ప్రాంతంలోని సామాజికోద్యమాల గూర్చి చర్చించే ముందు, ఈ ఉద్యమాల గూర్చిన కొన్ని సైద్ధాంతిక అంశాలను ప్రస్తావించుకోవాలి. ఆంగ్ల ప్రభుత్వం 1813 (మొదటి చార్టిస్ట్ చట్టం) లగాయతు ప్రవేశపెట్టిన ఆంగ్ల విద్య, ఆంగ్ల భాష ద్వారా వ్యాప్తిలోకి వచ్చిన పాశ్చాత్య ఉదారవాద భావజాలం, సామాజిక ఉద్యమాలకు దోహదం చేసిందన్న వాదన, కొందరు భారతీయ చరిత్రకారులు గూడా అభిప్రాయపడ్డారు. అంతే కాకుండా, మిషనరీలు భారతీయ సమాజ స్థితి గతులపై మూఢనమ్మకాలను, సాంఘిక దురాచారాలను తీవ్రంగా విమర్శించారు. వీరి విమర్శలకు ప్రతిస్పందనగా సామాజికోద్యమాలు తలెత్తాయన్న సిద్ధాంతాలు చలామణిలోకి వచ్చాయి. ఈ సిద్ధాంతాలను ఛాలెంజ్ వర్సెస్ రెస్పాన్స్‌గా, ఆంగ్ల విద్య ప్రభావంతో వచ్చిన సిద్ధాంతాలుగా చెప్పుకొంటూ ప్రతి సమాజం సంప్రదాయం నుండి ఆధునికత వైపు పరిణామం చెందుతుందనీ ప్రతిపాదించారు. ఈ వాదనలు సరైనవి కావు. వలస పాలన వల్లే భారతీయ సమాజం మార్పు చెందిందని చెప్పడం, వలసపాలనను సమర్థించుకోడాన్కి, వలస పాలన ఇక్కడి ప్రజలకు వరం లాంటిదని చెప్పడాన్కి లేవనెత్తిన సిద్ధాంతాలుగానే పరిగణించాల్సి ఉంటుంది. వలసపాలన బొత్తిగా లేని జపాన్, ఈజిప్టు లాంటి దేశాలు, 19వ శతాబ్దానికి ఆధునికతను సంతరించుకొన్నాయి. అంతేకాదు, భారతదేశంలోని 19వ శతాబ్దపు సామాజికోద్యమా లన్నింటికీ, ఒక చారిత్రక నేపథ్యం ఉంది. ఆంధ్రదేశంలోని ఉద్యమాలు ఈ ఉద్యమాల్లో భాగాలు మాత్రమే. ప్రాచీన కాలంలో వైదిక మతానికి నిరసనగా వచ్చిన జైన, బౌద్ధమతాలనటుంచి, మధ్య యుగాల కాలం భక్తి, సూఫీ ఉద్యమాలు గూడా అప్పుడున్న మత, సామాజిక వ్యవస్థలను వ్యతిరేకించినవే. ఇంతెందుకు 18వ శతాబ్దంలో, దేశంలో పలు ప్రాంతాల్లో అనేక అసాంప్రదాయిక (హెటెరోడాక్స్) మత శాఖలు పుట్టాయి. ఆంధ్రదేశంలోనూ పుట్టాయి. బెంగాల్‌లో కార్తభాజులు, స్పష్టదాయగులు, బలరామీలు, రామవల్లభులు మొదలగు వారుండేవారు. ఉత్తరప్రదేశ్‌లో కూడా శాఖలు ప్రముఖంగా ఉండేవి. 1) సత్యభామ; 2) శివనారాయ్; 3) అపపంథి. రాజస్థాన్‌లో చరణ్‌దాసులు, దాదూపంతులు. ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే. ఆంధ్రదేశంలో కూడ వీరశైవం, శ్రీవైష్ణవ శాఖలు కుల వ్యవస్థనూ, జంతుబలులతో కూడిన వైదిక కర్మలను, స్త్రీల దైన్యస్థితిని ఖండించాయి. బాల్య వివాహాలను ఖండించి, వితంతు వివాహాలను ప్రోత్సహించడమే గాక, పల్నాటి బ్రహ్మనాయుడు సహపంక్తి భోజనాలను ('చాపకూడు') ప్రవేశపెట్టాడు. వేమన, వీరబ్రహ్మం, యడ్లరామదాసు, యాగంటివారు గుంటూరు జిల్లాలోని వినుకొండ, నర్సరావుపేట ప్రాంతాల్లో ఉండిన నాసరయ్య ఈ కోవకు చెందిన వారే. ఈ కొత్త మత శాఖల్లో అత్యధిక భాగం కింది కులాల వాళ్లుగా చెప్పబడేవాళ్ల నాయకత్వం కూడా వారి నుండే వచ్చింది. ప్రజలకు అందుబాటులో ఉన్న ఈ శాఖలు ప్రజల భాషను వాడుకున్నాయి. వీరి వల్ల దేశభాషల్లో గణనీయమైన విలువగల సాహిత్యం పెరిగిందని సామాజిక శాస్త్రవేత్తలు అభిప్రాయపడ్డారు.

భారతీయ సమాజంలో మత, కుల, సంప్రదాయ నిరసనలు, తిరుగుబాట్లు అనూచానంగా వస్తున్నాయి. అందువల్ల కేవలం ఆంగ్ల పాలన ప్రభావం వల్లే సామాజికోద్యమాలు వచ్చాయని చెప్పడం అచారిత్రకమవుతుంది. 19వ శతాబ్దపు సాంఘిక సంస్కర్తలో ప్రథముడు గా చెప్పుకొనే రాజా రామ్మోహన్‌రాయ్‌కు ముందు, బెంగాల్లో అనేక అసాంప్రదాయిక శాఖలుండేవని, వాటిప్రభావం ఆయనపై ఉండేదని చరిత్రకారుల అభిప్రాయం. పైగా, రామ్మోహన్‌రాసిన మొదటి మోనోగ్రాఫ్ పర్షియన్ భాషలో రాశాడు. దీనిపేరు 'తుఫాతుల్ మువాహిద్దీన్'. ఇందులోనే, ఆయన వేదాలకు ఆపాదించబడ్డ దైవత్వాన్ని తిరస్కరించాడు. వేదాలు అపౌరుషేయాలు కాదన్నాడు. భారతీయ సామాజిక ఉద్యమకారులు, ఆంధ్రదేశంతో సహా, సమాజంలో చాపకింద నీరులా వ్యాపిస్తున్న వలససంస్కృతిని అడ్డుకట్ట వేయాలని సంకల్పించారు. వలస సంస్కృతి తన ఆధిపత్యాన్ని ఏర్పర్చుకోకుండా అడ్డుకోవాలనుకొన్నారు. అదే సమయంలో భారతీయ సమాజంలో చోటు చేసుకొన్న మాలిన్యాలను, లొసుగులను తొలగించి, ఆధునికత వైపు మరల్చాలను కొన్నారు. దీనికి హేతువాద మానవతావాదులను ఆలంబనంగా చేసుకొన్నారు. అప్పట్లో సామాజికోద్యమాలకున్న ప్రేరకాలు ఇవే.

పై నేపథ్యంలో ఆంధ్ర దేశాన్ని పరిశీలిస్తే, యుగ పురుషుడుగా కీర్తించబడుతున్న కందుకూరి వీరేశలింగం, ఉద్యమకర్తగా ముందుకొస్తాడు. కానీ, వీరేశలింగమే ప్రథముడనీ, అంతకుముందు మరెవ్వరూ లేరనీ, ఆయన తర్వాత అంతటివాడు లేడనడం సరికాదు. అలాంటి భావాలు ఆరాధనా భావంతో కూడుకున్నవీ, విమర్శనాత్మక దృష్టి లేనివీను. ఒక వ్యక్తి సమాజానికి కొత్త జీవితాన్ని సృష్టించలేడు. వీరేశలింగానికి పూర్వం బలమైన సంఘ సంస్కరణ భావాలూ, ధోరణులూ ఉన్నాయి. తెలుగు సాహిత్యంలో కొత్త ప్రక్రియలను చేపట్టిన వాళ్లూ ఆయనకు ముందున్నారు. అయినా, వీరేశలింగం ఘనత ఏమిటంటే, ఆయన ఆ ధోరణులను కూడగట్టి, ఉద్యమాలుగా అభివృద్ధి చేశాడు.

సామాజిక ఉద్యమాల గూర్చి చర్చించే ముందు, వీటిని నిర్వహించిన ఉద్యమకారుల సామాజిక నేపథ్యాన్ని గూర్చి రెండు మాటలు చెప్పుకోవాలి. 19వ శతాబ్ది ప్రారంభానికి వలసవాదం రెండవ దశలోకి ప్రవేశించింది. ఇంగ్లండ్‌లో పారిశ్రామిక ఉత్పత్తులు అభివృద్ధి చెందాయి.

వీటిని తమ అధీనంలోని వలస దేశాల్లో అమ్ముకోవాలి. దీనికి తోడు ఇంగ్లండ్‌లో తలెత్తిన ఉదారవాద సిద్ధాంతాలు – ముఖ్యంగా ప్రయోజన వాదం (యుటిలిటేరియనిజం), క్రైస్తవ మత ప్రచారం. ఈ రెండు భావజాలాలు వ్యక్తిస్వేచ్ఛ కోసం ఉద్దేశించబడేవి. మూఢవిశ్వాసాల నుండి, అధికార దర్పం నుండి వ్యక్తిని విముక్తి చేయాలని సంకల్పించాయి. ప్రయోజనవాదులు చట్టాల ద్వారా భారతీయ సమాజాన్ని సంస్కరించి, ఆధునికత వైపు కొనిపోవాలనుకొన్నారు. దీనికోసం విద్యారంగంలో సంస్కరణలు ప్రవేశపెట్టారు. ఆర్థిక, రెవెన్యూ, న్యాయ శాఖల్లోనూ సంస్కరణలు చేశారు. బానిసత్వాన్ని, సహగమనాన్ని, స్త్రీ శిశూ హత్యలను నిషేధించారు. వితంతు వివాహాలను చట్ట బద్ధం చేశారు. వీటన్నిటి వల్ల తమ వలసవాద ప్రయోజనాలను సిద్ధింప చేయ పూనుకున్నారు. 'వెనుకబడిన జాతిని యేలడం కంటె నాగరిక జాతితో వ్యాపారం చేయడం లాభదాయకం' అని మెకాలే అన్నాడంటే, వలస పాలకుల ప్రయోజనాలేమిటో అర్థమవుతాయి. అదే క్రమంలో, క్రైస్తవ మత ప్రచారానికి అగ్రనాయకుడు ఛార్లెస్ గ్రాంట్ ఇలా అన్నాడు 'మనం భారతదేశానికి పోవడంలో మొదటి ఉద్దేశమూ, ఈ దేశానికి ఎంతో ముఖ్యమైనదీ అయిన వాణిజ్య విస్తరణకు తోడ్పడతాయి'. ఆంగ్ల పాలకులు ప్రవేశపెట్టిన సంస్కరణల ఫలితంగా సమాజంలో మార్పు లొచ్చాయి. వాటిలో ముఖ్యమైనది మధ్యతరగతి ఆవిర్భావం. ఇందులో విద్యాధికులు, ఉద్యోగులు, అధ్యాపకులు, న్యాయవాదులు, జర్నలిస్టులు, మధ్యతరగతి వ్యాపారస్తులు మున్నగువారున్నారు. వీరందరూ స్థూలంగా ఆర్థికంగా మధ్య, కింది మధ్యతరగతులకు చెందిన వారు. నూతన భావాలను ఆహ్వానించారు. ఉదారవాద, ప్రజాతంత్ర విలువల కొరకు పోరాడారు. మతాధికారాన్ని ప్రశ్నించారు. వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ఆకాంక్షించారు. సామాజికోద్యమాలకు అవసరమైన భావజాల వాతావరణాన్ని, సామాజిక పునాదిని వీరు సమకూర్చారు.

ఆంధ్ర దేశంలోని సామాజికోద్యమాల వివరాలకు, లోతులకు ఈ వ్యాసంలో మేము పోవడంలేదు. ఇదొక సర్వేక్షణావ్యాసం. ఉద్యమాలు చేపట్టిన సమస్యలను పేర్కొని, ఉద్యమాల కృషి ఫలితాలను, ఉద్యమ స్వభావాన్ని చర్చిస్తాం.

వీరేశలింగానికి ముందు ఆంధ్రదేశంలో సంస్కరణ భావాలు వ్యక్తీకరించిన వారిలో ముఖ్యంగా పేర్కొనదగినవారు, ఏనుగుల వీరాస్వామయ్య (1780–1836), 'కాశీయాత్ర చరిత్ర' గ్రంథ రచయిత, వెన్నెలకంటి సుధారావు (1784–1839) ఆంగ్లంలో తన జీవిత చరిత్రను రాసుకొన్నారు. (యావత్ దక్షిణ భారతదేశంలో ఆంగ్లంలో మొదటి జీవిత చరిత్ర ఇదే). సామినేని ముద్దు నరిసింహనాయుడు 'హితసూచని' అనే గ్రంథం రాశాడు. జియ్యర్ సూరి (1850–95) 'స్త్రీ కళా కల్లోలిని' గ్రంథకర్త. వీరుగాక, జి. వేదాంతాచారి 1870లో మద్రాసు ప్రభుత్వానికి ఒక వినతి పత్రాన్ని సమర్పించారు. వీరందరూ హేతుబద్ధంగా మతకర్మ కాండలను నిరసించారు. మూఢనమ్మకాలనూ, దురాచారాలనూ ఎత్తిచూపి ఖండించారు. స్త్రీలకు పురుషులతో సమానంగా విద్య గరపడమే గాక, సాంఘిక హోదా కల్పించాలని అభిలషించారు. కులాన్ని నిరసించారు. వివాహ వ్యవస్థలో సంస్కరణలను ప్రవేశపెట్టి, వధూవరుల యిష్టాయిష్టాలకు స్వేచ్ఛనివ్వాలని చెప్పారు. కన్యాశుల్కం, బాల్యవివాహాలను తీవ్రంగా ఖండించారు. దాదాపు 19వ శతాబ్ది ప్రథమార్థం పూర్తయేనాటికి పై విధమైన సంస్కరణ భావాలు ఆంధ్రదేశంలో మొలకలెత్తాయి.

కందుకూరి వీరేశలింగం వీటికొక రూపమిచ్చాడు. ఉద్యమాలుగా మలిచాడు. గ్రాంథిక భాషలో రచనలు ప్రజలకు అర్థం కావనీ, ప్రజలకు అర్థమయ్యే రీతిలో భాష ఉండాలనీ, అప్పుడే భావవ్యాప్తి జరుగుతుందనీ భావించాడు. సులభ గ్రాంథికాన్ని స్వీకరించి, తన రచనలన్నింటినీ (నాటకాలు, ప్రహసనాలు, నవల, వ్యాసాలు, పత్రికా రచనలు, శాస్త్ర గ్రంథాలు, జీవిత చరిత్రలు, స్త్రీలకు పనికొచ్చే పుస్తకాలు) సులభ శైలిలో రచించాడు. వీరేశలింగం దిద్దిన ఈ ఒరవడి అప్పటి సామాజిక ఉద్యమకారులందరూ పాటించారు.

వీరేశలింగంతోపాటు ఆయన సహచరులు బసవరాజు కువ్రరాజు, దేశిరాజు పెదబాపయ్య, ఆర్మూరి లక్ష్మీనరసింహం, చిలకమర్తి లక్ష్మీనరసింహం, రాయసం వెంకటశివుడు, న్యాపతి సుధారావు ప్రభృతులు సామాజికోద్యమాలలో పనిచేశారు. స్త్రీ జనోద్ధరణలో భాగంగా స్త్రీ విద్యా వికాసాలు, పాఠశాలల, గ్రంథాలయాల స్థాపన, స్త్రీ సమాజాల ఏర్పాట్లు జరిగాయి. కన్యాశుల్కం, బాల్యవివాహాలను నిషేధించడం, వితంతు వివాహ ఉద్యమాన్ని వీరు చేపట్టారు. సామాజిక సంస్కరణోద్యమాలు బలంగా సాగుతున్నప్పుడు గురజాడ అప్పారావు కన్యాశుల్క నాటకాన్ని రచించాడు. సంస్కరణోద్యమాల ప్రభావం నుండి రూపుదిద్దుకున్నవి ఆయన రచనలు. కాకుంటే ఉద్యమాల్లోని లొసుగులను, కొందరు సంస్కర్తల పేరిట చేసే కపట ప్రవర్తనలను గురజాడ సున్నితమైన హాస్యంతో మేళవించి ఎత్తిచూపారు. సాంఘిక స్వచ్ఛతా ఉద్యమంలో దేవదాసి సమస్య, మద్య వ్యతిరేకతలను చేపట్టారు. సాని నృత్యాల నిర్మూలన, మద్య విసర్జన ఇందులోని ప్రధాన భాగాలు. ఈ ఉద్యమంలో రఘుపతి వెంకటరత్నం ప్రముఖ పాత్ర వహించారు. సంఘ సంస్కరణతో పాటు మత సంస్కరణ కూడ సామాజిక ఉద్యమాల్లో భాగమయింది. సాంఘిక దురాచారాలకు మతం అనుమతి లభిస్తున్నందున మత విశ్వాసాలను, ఆచారాలను సంస్కరింప బూనుకొన్నారు. అప్పట్లో మతం పేరుతో లెక్కలేనన్ని కర్మకాండలుండేవి. పురోహితుల పెత్తనం ఎక్కువగా ఉండింది. దీన్ని నివారించేందుకు బ్రహ్మ (ప్రార్థన) సమాజాన్ని స్థాపించారు. ఇది కేవలం మత సంస్కరణనే కొనసాగించలేదు. సామాజిక సంబంధాల్లో మార్పుకు, సామాజిక సంబంధాలను సంస్కరించడాన్కి బ్రహ్మ సమాజ ఉద్యమం కృషి చేసింది. బ్రహ్మసమాజమొనరించిన కృషిలో రఘుపతి వెంకటరత్నానికి ముందు దేశిరాజు పెదబాపయ్య సేవలు గణనీయమైనవి. ఆయనతోపాటు, వీరేశలింగం, రఘుపతి, మరెందరో అనుష్ఠానికులైనారు. వీరిలో బ్రాహ్మణులు జందేలను త్యజించి, తమ పూర్వీకుల ఆబ్దికాలను బ్రహ్మోపాసనా పద్ధతిలో నిర్వహించారు. ఇతర సామాజికోద్యమాల లాగే బ్రహ్మ సమాజం ఆంధ్రదేశంలోని పలు ప్రాంతాలకు వ్యాపించింది. ఏకేశ్వర భావాలు, విశాల దృక్పథం ఏర్పడ్డానికి ఇది దోహదం చేసింది. ప్రజల్లో ఉదారవాద దృక్పథాన్ని కలిగించింది. సామాజిక రంగంలో, మనుషులకున్న పాత సంప్రదాయాలను, మూఢనమ్మకాల పట్టును తగ్గించి, సంస్కరణోద్యమాలకు దోహదం చేసింది. సమాజంలో ప్రాజ్ఞ వాతావరణాన్నీ, సామాజిక స్పృహనూ సృష్టించి, తర్వాత రానున్న జాతీయోద్యమానికి దోహదం చేసింది. వెనుకబడిన, అణగారిన వర్గాల పరిస్థితులు మెరుగుపర్చేందుకు కొన్ని నిర్మాణాత్మక పనులు బ్రహ్మ

సమాజం నిర్వహించింది. ఆస్తిక ఉన్నత పాఠశాలలో ఈ వర్గాల బిడ్డలకు చదువుకొనే అవకాశం ఉండేది. చిలకమర్తి లక్ష్మినరసింహం దళితుల కొరకు ఒక ప్రత్యేక పాఠశాల నెలకొల్పారు. కాకినాడలోని పిఠాపురం రాజా కళాశాలలో దళితులను చేర్చుకొని ఉచిత విద్యగరపింది. పిఠాపురం, కాకినాడల్లో పిఠాపురం రాజా దళితులకు 'లాడ్జిలు' (వసతి గృహాన్ని) ఏర్పాటు చేశాడు. మహాత్మాగాంధీ, ఇతరులకంటే చాలముందే దళిత జనోద్ధరణ కృషి బ్రహ్మసమాజం కొనసాగించింది.

ఈ ఉద్యమాల కాలంలో సామాజికోద్యమాల గూర్చి సంపన్న సాహిత్యం అభివృద్ధి చెందింది. ఎన్నో పత్రికలు వెలిశాయి. స్త్రీలు స్వయంగా తమ పత్రికలు నడుపుకొన్నారు. అనేక గ్రంథాలు రచించారు. స్త్రీల సమాజాలు ఏర్పడ్డాయి. స్త్రీలు ప్రత్యేకించి సభలు జరుపుకోవడమే గాక, మండల స్థాయిలో జరిగే సంఘ సంస్కరణ సభలకు, సాధారణ మండల సభలకు హాజరయ్యారు. విద్యాలయాలు, శరణాలయాలు నెలకొల్పి సమర్థవంతంగా నిర్వహించారు. అయితే, వాస్తవంలో స్త్రీలు ఎదుర్కొనే అనేక రకాల ప్రశ్నలకు పరిష్కారాలు లభించాయా అంటే లేదనే చెప్పాలి. సామాజిక ఉద్యమాలు ఈ సమస్యలపై దృష్టి కేంద్రీకరింప చేశాయి. ఏం సాధించారన్నది ఇక్కడ ప్రశ్న కాదు. సామాజిక రుగ్మతల హానికర ఫలితాలను సమాజం గుర్తించే వాతావరణాన్ని ఇవి సృష్టించాయి. ఇదే వాటి విజయం. ఈ కృషి అప్పటి పరిస్థితుల్లో తక్కువేమీ కాదు. సంస్కర్తలు చేపట్టిన అనేక సమస్యలు ఆ తర్వాత జాతీయోద్యమ ఎజెండాలో చేర్చబడ్డాయి.

19వ శతాబ్దపు సామాజిక ఉద్యమాల పరిమిత విజయానికి కారణాలేమిటి? ఉన్నత కులాలకు చెందిన మధ్య తరగతులు ఈ ఉద్యమాలకు ప్రధాన సామాజిక పునాది. ఉద్యమాలు చేపట్టిన కార్యక్రమాలు ప్రధానంగా మధ్య తరగతులకు సంబంధించినవి. సమాజం అడుగున ఉన్న సామాజిక వర్గాలకు అవి అందలేదు. 1905 నుండి ఊపందుకున్న జాతీయోద్యమం, అది చేపట్టిన సామాజిక కృషి ఈ ఉద్యమాలకు అడ్డంకిగా నిలిచాయి. పైగా రాజకీయ సంస్కరణ ముందు జరగాలా లేదా సమాజ సంస్కరణా అనే చర్చలో, రాజకీయ సంస్కరణ వాదులదే పై చేయి అయింది. అందువల్ల ఈ ఉద్యమకారులు క్రమేపి రాజకీయ ఉద్యమంలో చేరిపోయారు. అంతేకాదు, ప్రగతి పూర్వక సామాజికోద్యమాలను తీవ్రంగా వ్యతిరేకిస్తూ, 19వ శతాబ్దాంతానికి పునరుద్ధరణ వాదాలు, ఉద్యమాలు తలెత్తాయి. ఈ సందర్భంలో ముఖ్యంగా పేర్కొనదగింది అనిబిసెంట్ థియొసాఫికల్ సొసైటీ, ఆవిడ ప్రేరణతో మద్రాసులో స్థాపించిన 'మద్రాస్ హిందూ సంఘం', 'వర్ణాశ్రమ ధర్మ సంరక్షణ మండలి' మొదలగునవి. 1910 దశకంలో ఆంధ్రదేశంలో తలెత్తిన కుల సంఘాలు కూడ ఈ ప్రక్రియలో భాగమైనాయి. వలస పాలనలో ప్రవేశపెట్టిన భూ సంబంధమైన సెటిల్మెంట్లు (జమీందారీ, రైత్వారీ, మహల్వారీ మున్నగునవి), డబ్బుతో కూడిన ఆర్థిక వ్యవస్థ (మనీ ఎకానమీ), దేశం మొత్తానికి కలిపి ఒక మార్కెట్ మున్నగునవి కొంతవరకే ఇక్కడి ఆర్థిక, సాంఘిక వ్యవస్థలను మార్చాయి. అంతకు ముందున్న భూస్వామ్య సంబంధాలు కొనసాగినా, ఈ దశను భూస్వామ్య ఆర్థిక వ్యవస్థ నుండి పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థకు మారే సంధి యుగంగా పరిగణించవచ్చు. అయితే ఇక్కడ గమనించాల్సిన ముఖ్య విషయం ఏమిటంటే, ఈ మార్పు తార్కికంగా కొసదాకా కొనసాగలేదు. పెరుగుతున్న పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థతో సమానంగా దానికి సంబంధించిన సామాజిక శక్తుల పెంపుదల లేకపోవడంతో సామాజికోద్యమాల విజయానికి కావాల్సిన మద్దతు లభించలేదు. దీనివల్ల 19వ శతాబ్దపు సామాజికోద్యమాలు సాధించాల్సినంత సామాజిక మార్పు సాధించలేక అసంపూర్ణంగా. అర్థాంతరంగా (నేటికీ) ఉండిపోయాయి. ఇక్కడ గమనించాల్సిన మరో అంశం, వలసవాద సమాజంలో ఉండే పరిమితులకు, నిర్బంధాలకు లోబడి ఉద్యమకర్తలు పని చేశారన్నది గుర్తుంచుకోవాలి. 1857 తర్వాత, వలస పాలన మూడో దశలో (ఆర్థిక పెట్టుబడిదారీ దశ) ప్రవేశించాక, వలసపాలకులు సామాజిక మార్పుల పట్ల, సంస్కరణల పట్ల శ్రద్ధ చూపలేదు. తమ సామ్రాజ్యాన్ని పరిరక్షించుకోవడం వారి ప్రధానాశయమైంది. భారతీయ సమాజాన్ని తమ అవసరాల దృష్ట్యా మార్చాలనుకొన్న వలసవాద రెండవదశ ఆశయం కనుమరుగైంది.

19వ శతాబ్దపు సామాజిక ఉద్యమాల కృషిని అంచనా వేసినపుడు మన కర్థమయ్యే విషయాల్లో మొదటిది, సమాజం కేంద్రంగా మానవుడి గూర్చి ప్రాజ్ఞ భావాలను (ఎన్‌లైటెండ్ వ్యూస్) ప్రోదిచేసి, ప్రచారం చేయడం. కులం పోలేదు కానీ కుల భావనలు, కులం విధించిన కట్టుబాట్లు తగ్గాయి. మధ్యయుగాల సామాజిక వ్యవస్థను మార్చాలన్న స్పృహ కలిగింది. ఈ ఆకాంక్షను కుల సంఘాలు నిర్వహించిన పాత్ర తెలియచేస్తుంది. బ్రాహ్మణేతర కులాల్లో (శూద్రులు అని పిలవబడే వాళ్లు) సామాజిక న్యాయం కోసం, సంస్కరణల కోసం తహతహలాడ్డం కన్పించింది. కట్నాలు ఇచ్చే పద్ధతినీ, బాల్యవివాహాలను ఆపు చేయడంలో కుల సంఘాలు తీర్మానాలు చేశాయి. సామాజికోద్యమాలు, ముఖ్యంగా పట్టణ ప్రాంతాలకు పరిమితం కాగా, కుల సంఘాల ప్రభావం, ప్రాబల్యం గ్రామీణ ప్రాంతాల్లో ఉండింది. కొన్ని విషయాల్లో కొన్ని కులాలు 'బ్రాహ్మణీకరణ'కు పూనుకోకపోలేదు. అయినా, సామాజికోద్యమాల కంటే, వీటికే సామాజిక పునాది ఎక్కువని చెప్పాలి. జాతీయోద్యమానికి పూర్వ రంగంగా సామాజికోద్యమాలు నిలిచాయి. మొదటి తరం జాతీయ నాయకులు పలువురు – టంగుటూరి ప్రకాశం, గాడిచర్ల హరిసర్వోత్తమ రావు ప్రభృతులు – సామాజికోద్యమాల్లో క్రియాశీలంగా పని చేశారు. 19వ శతాబ్దపు ఈ ఉద్యమాలు 1907 తర్వాత తగ్గుముఖం పట్టి, 1920 దశకానికి క్షీణించాయి. వీటి క్షీణత ఒకవైపు, మరోవైపు ఆది-ఆంధ్ర ఉద్యమం (దళితులు), బ్రాహ్మణేతరోద్యమం, వామపక్ష భావాల పుట్టుక, పెరుగుదల, రైతు-కూలీ సంఘాలు, అప్పటికే బలం పుంజుకొన్న జాతీయోద్యమం ఆంధ్రదేశంలో చురుగ్గా కృషిచేస్తున్నాయి. భౌతికంగా సామాజికోద్యమాలు కనుమరుగయ్యాయే కానీ అవి సృష్టించిన బౌద్ధిక, ఉదార వాతావరణం నివురు గప్పిన నిప్పులా ఉండిపోయింది. వీటి ప్రభావం ఏదో ఒక రూపంలో పైన పేర్కొన్న ఉద్యమాలపై కచ్చితంగా ఉండింది. ఆంధ్రదేశంలో కమ్యూనిస్టు ఉద్యమం తొలి దశలో (1930-40లలో), 19వ శతాబ్దపు సాంఘిక, సాంస్కృతిక పునరుజ్జీవనాన్ని పునర్మూల్యాంకనం చేసి, ఉద్యమ నాయకులకు నివాళులర్పించింది. వీరేశలింగం, గురజాడ, గిడుగు, చిలకమర్తి, రఘుపతి మొదలగు సంస్కర్తల రచనలు పునర్ముద్రించి వారి భావాల ప్రసరణకు పూనుకొంది. సామాజిక ఉద్యమాలు మిగిల్చిన ప్రభావం ఇది. ఆధునిక ఆంధ్రదేశపు మేధోపర, సాంఘిక వ్యక్తిత్వం చాలవరకు ఈ ఉద్యమాలందించిన స్ఫూర్తి నుండే రూపొందింది. అవి మనకిచ్చి పోయిన వారసత్వం అదే. ◆

చార్వాకం, బౌద్ధం, జైనం, సాంఖ్యం, నిరీశ్వరవాదం, భౌతికవాదం, గతి తార్కిక భౌతికవాదాల ప్రభావాలు తెలుగు నేలను ప్రభావితం చేస్తూనే వచ్చాయంటున్నారు **కత్తి పద్మారావు**

# సామాజిక తాత్విక సాంస్కృతిక ఉద్యమాలు

తెలుగుజాతి ఒక సామాజిక సాంస్కృతిక శక్తి. ప్రపంచ పరిణామంలో కీలకమైన పాత్ర నిర్వహించినవారు తెలుగువారు. చరిత్ర, సంస్కృతి, అర్థశాస్త్రం, రాజకీయ శాస్త్రం అన్నీ నూతన సమాజిక చారిత్రక కోణం నుండి పరికించుకోవలసిన ఈనాడు తెలుగుజాతి చరిత్ర మనం చూస్తే అది ఒక యుద్ధ జాతిలా జీవించిందని చెప్పాల్సి ఉంది. భాష, సంస్కృతి, సాహిత్యం, కళ, చిత్రం అన్నీ జాతి కదలికలను నిర్దేశిస్తాయి. కొన్నిసార్లు స్తబ్దంగా, కొన్నిసార్లు అతి వేగంగా కొన్నిసార్లు ఘర్షణతో జాతి కదులుతుంది. ప్రతి దానికి గతి తార్కిక చలనసూత్రాలు ముఖ్యం. తెలుగుజాతి సామాజిక ఎక్కడ కదిలింది, ఎక్కడ స్తబ్దమయ్యింది అన్నపుడు సామాజిక చరిత్రలో కులం చాలా బలీయమైన పాత్రను నిర్వహించింది. అస్పృశ్యత తెలుగుజాతి నాధులను కుంగదీసింది. బ్రాహ్మణవాదం విజృంభించినపుడల్లా తెలుగు జాతి స్తబ్దీకృతం అవుతూ వచ్చింది. మళ్లీ దానిమీద తిరుగుబాట్లు వచ్చాయి. అవి కొన్నిసార్లు భాషపరంగా, మతపరంగా, తాత్వికపరంగా, సాంస్కృతిపరంగా వచ్చాయి. ఆ క్రమాన్ని మనం అధ్యయనం చేయాల్సిన చారిత్రక బాధ్యత మనపై ఉంది. తాత్వికంగా మనం చూసినపుడు చార్వాకం, బౌద్ధం, జైనం, సాంఖ్యం, నిరీశ్వరవాదం, భౌతికవాదం, గతి తార్కిక భౌతికవాదాల ప్రభావాలు తెలుగునేలను ప్రభావితం చేస్తూనే వచ్చాయి.

రాజ్య, వాణిజ్య వలసలే కాదు తాత్విక వలసల ప్రభావాలు కూడా తెలుగువారిని మేల్కొలిపాయి.

ప్రపంచంలో నాగరికత మొదటగా వెల్లివిరిసిన ప్రాంతాల్లో తెలుగు ప్రాంతం ఒకటి. సుదీర్ఘమైన సముద్రతీరమున్న ప్రాంతం. వివిధ దేశాల ప్రజలు తమ వ్యాపారాల కోసం రావడానికి ఈ తీరప్రాంతం కేంద్రంగా ఉండేది. క్రీస్తు పూర్వం 800 నుంచి 600 వరకు ఈ ప్రాంతంలో తెలుగుజాతులు తమ సంస్కృతిని నిర్మించుకున్నాయని చరిత్ర చెబుతోంది. జాతివాచకంగా ఆంధ్రపదం ఐతరేయ బ్రాహ్మణంలో సునస్సేప వృత్తాంతంలో ఉంది.

## ఆర్యీకరణపై తెలుగు జాతి యుద్ధం

"తస్యహ విశ్వామిత్రస్యైక శతం పుత్రా ఆసుః / ఏ ఇఛశద్దేవ జ్యాయాంసో మధు చ్ఛందసః / ఏఇఛశత్కనీయాం నీస్తజ్యాయాంసోద్ నతే కుశలం మేనిరే / తానను వ్యాజహారాం తాన్వః ప్రజాభక్తి శ్చేతి / తేఏతే న్ద్రాః పుణ్డ్రాః శబరాః ప్రుళిన్దామూతిబా / ఇత్యుదన్యాబహవోభవన్తి / వైశ్వామిత్రా దస్యూనాం భామిష్ఠాః" (ఐతరేయ బ్రాహ్మణము, సంచిక-7, అధ్యాయ-13, ఖండిక-18)

ఈ శ్లోకం వల్ల మనకు ఏం తెలుస్తుందంటే విశ్వామిత్రునిచేత శపించబడడమంటే ఆర్యులు ఆర్యత్వం మీద తిరుగుబాటు చేశారు అనేది అర్థం. చరిత్ర ప్రారంభ దశ నుంచి కూడా వీరు తిరుగుబాటు దారులుగానే ఉన్నారు. ముఖ్యంగా తీరప్రాంతం కాబట్టి ప్రతి జాతి వీరి మీద పెత్తనం చేయాలనే చూసింది. ప్రతి సందర్భంలో వీరు తమ సంస్కృతిని, భాషని నిలబెట్టుకోవడం కోసం ఒక పోరాట జాతిగా బతకాల్సి వచ్చింది. తెలుగువారు తెనుగు వారిగా కూడా పిలవబడ్డారు. తెలి + అగు = తెలుగు అని ఒక ఉత్పత్తి.

ఇంకా కొన్ని ఉత్పత్తులు : తిలల వలె గోవులు కల దేశం; తెలే > అగు = తెలుగు; తలైంగ్ > తెలుగు; తెల్ల + అగు = తెలుగు; తెన్ + ఉన్ + ఐగ్ > తెనుంగు = తెలుగు; తేనె + అగు > తెలుగు = తెలుగు; త్రినగ > తెనుగు = తెలుగు; తెఱుక్కు > తెలుగు; తెళ్ + గు = తెలుగు

దీన్ని బట్టి సంస్కృతేతర శబ్దం అని అర్థమైంది. సంస్కృత భాషకు భిన్నంగా జీవించిన వారు తెలుగువారు. దక్షిణంలో తెలుగువారి ఉద్యమం ఒక జాతిగా సాగింది, తాత్వికంగా సాగింది. సాంస్కృతికంగానూ సాగింది. ద్రవిడ భాషా కుటుంబంలో మధ్య ద్రవిడ భాషకు సంబంధించిన తెలుగు పన్నెండు భాషలకు తల్లిగా ఉంది. తెలుగు, గోండి, కొండ, పెంగో, మండ, కుయి, కువి, కొలామి, నాయకీ, పర్జీ, గదబ, ఒల్లారి ఇవన్నీ సంస్కృతానికి వ్యతిరేకంగా నిలబడి పోరాడిన భాషలు. ప్రతి జాతికి సంస్కృతిని, భాషను నిలబెట్టుకోవడం ఒక యుద్ధమే అవుతుంది. తెలుగు దేశీయతను అనుసరించి ఈ పన్నెండు భాషల ప్రజలందరి సంస్కృతి ఒకే రకంగా ఉంటుంది.

'సాంస్కృతిక నిర్మాణం విషయంలో ఉత్తరాది పరిస్థితి కూడా సక్రమంగా లేదు. అందువల్ల సాంప్రదాయిక భారత చరిత్రకారులు బ్రిటిష్ భాషా శాస్త్రవేత్త రాబర్ట్ కాల్డ్‌వెల్ (1814-91)ను అనుసరిస్తూ భాషా శాస్త్ర దృక్పథాన్ని చేపట్టారు. ఆ రకమైన అన్వేషణ వల్ల వాళ్లు వచ్చిన నిర్ధారణ ఏమంటే భారత దేశంలో ఉత్తరాదిలోనూ, దక్షిణాదిలోనూ ద్రవిడ భాషీయులైన స్థానికులలోకి సంస్కృత భాషీయులైన ఆర్యులు చొరబడటంతో చరిత్ర ప్రారంభమైందని. భారతదేశంలో ప్రాచీన కాలపు చరిత్ర ఆర్యీకరణ క్రమం తప్ప మరొకటి

కాదని వారు భావించారు. భారతచరిత్రలో ఆ కాలంలో సాంఘిక, మత, రాజకీయ వ్యవహారాలలో జరిగిన ప్రతి ఒక్క ఘటనను వాళ్లు ఆ సిద్ధాంత ప్రాతిపదిక మీదనే లెక్కించారు.'

దక్షిణ భారత ఆర్యీకరణ చెందేవరకు తెలుగుజాతి ఒక యుద్ధం గానే కొనసాగింది.

## బ్రాహ్మణవాదం పై పోరాటం

తెలుగు జాతి చేసిన మరొక సామాజిక, తాత్విక ఉద్యమం బౌద్ధం. ఇది బ్రాహ్మణవాదానికి వ్యతిరేకంగా సాగింది. వర్ణ వ్యవస్థను నిరాకరించింది. కులాన్నీ, స్త్రీ అణచివేతను ఎదిరించింది. మానవాభ్యుదయాన్ని ప్రభోదించింది. మనిషిని మనిషిగా చూసే తత్వాన్ని బోధించింది. బౌద్ధం దక్షిణ భారతదేశంలో తెలుగునేలలోనే ప్రశస్తంగా ప్రజ్వలించింది. బౌద్ధంలోని తాత్విక భావన అణగారిన వర్గాలకు ఊరటనిచ్చింది. మనిషిని మనిషిగా చూసే తత్వం పెరిగింది. దుఃఖ నివారణకు, దోపిడీ నిర్మూలనకు ప్రతిపాదించింది. ఇటువంటి బౌద్ధం చారిత్రకంగా, కళాత్మకంగా కూడా ఎలా ప్రసిద్ధి చెందిందో ఎ.ఎల్. భాషం తన 'ఏ కల్చరల్ హిస్టరీ ఆఫ్ ఇండియా'లో ఇలా చెప్పారు :

'ప్రతిమలను శక్తివంతమైన, సున్నితమైన ప్రశాంతతతో చెక్కగల సంక్లిష్ట కథన చిత్రాలను ఒకదాని వెంట ఒకటిగా చిత్రించగల శిల్పుల నైపుణ్యం అతి వేగంగా విస్తరించింది. ప్రత్యేకించి ఆగ్నేయ భారతదేశంలో అమరావతి చుట్టుపట్ల ఉన్న బౌద్ధ స్థలాలలో (ఉదాహరణకు జగ్గయపేట, నాగార్జునకొండ) స్థూపాలు వాటి చుట్టూ ఉన్న నడవాలతో, ద్వారాలతో, తెల్ల సున్నపురాతి పలకలతో పూర్తిగా కప్పబడి ఉంటాయి. ఆ పలకల మీద సంపన్నమైన ఆలంకారిక నమూనాలు హృద్యమయిన ప్రతిమలు చిత్రించి ఉంటాయి. ఈ శిల్పాల శైలి ఉపఖండంలో మరొకవైపున ఉన్న అజంతా గుహలలోని చిత్రాల శకలాలతో సరిపోతుంది. ఈ అన్ని స్థలాలలోకి అతి ముఖ్యమైనదైన పశ్చిమ మధ్య భారతదేశంలోని మధుర దగ్గరి శిథిలమైపోయిన స్థూపాలలో భారతదేశంలోని మొట్టమొదటి ప్రామాణిక శైలి క్రమంగా రూపొందింది.'

నిజానికి బౌద్ధం తరువాతే హిందూ శిల్పం ప్రారంభమయింది. అంతకు ముందు వారికి శిల్పంలేదు. బౌద్ధానికి పూర్వం తెలుగు సీమలో గ్రామ దేవతలుండేవారు. ఈ గ్రామ దేవతలకు బ్రాహ్మణులు దేవాలయాలు కట్టడానికి నిరాకరించారు. వాటిని నీచంగా చూశారు. యజ్ఞయాగాదులు రాజుల చేత చేయించి, వారిచేత అగ్రహారాలు పొందారు. ఎక్కువ ఆంధ్రదేశంలో భూములు బ్రాహ్మణులకు దానమిచ్చినవే. పేద ప్రజలు వ్యవసాయం చేసే భూముల్ని బ్రాహ్మణుల నుతులకు, సుతులకు లొంగి రాజులు వారికి దానాలు విరివిగా చేశారు. విష్ణుకుండిన రాజులు మొదట నల్లగొండలోని ఇంద్రపాల నగరాన్ని పిమ్మట విజయవాడను పాలించి నరమేధాలు కూడా చేశారు. రాజసూయ యాగాలతో సహా అన్ని యాగాలు వీరు చేశారు. గుప్త రాజులు చేసిన బౌద్ధమత విధ్వంసన ఆంధ్రలో విష్ణుకుండిన రాజులు చేశారు. వీటన్నింటి మీద బౌద్ధం పెద్ద ఎత్తున తిరగబడింది. సామాన్య కులాలు, రైతులు బౌద్ధంలోకి వచ్చారు.

క్రీ.శ. 600 నుండి 1100 వరకు ఆంధ్రుల చరిత్రలో తూర్పు చాళుక్యుల యుగం ప్రారంభమైంది. ఉత్తరాంధ్రాన్ని కళింగులు, దక్షిణాంధ్రాన్ని చోళులు, తెలంగాణ, రాయలసీమలను పశ్చిమ చాళుక్యులు పాలించారు. ఈ కాలంలో రైతులు క్షత్రియుల మీద పోరాడారు. శుద్రరాజులు ఏర్పడ్డారు. సంస్కృతాన్ని నిరాదరించి తెలుగు భాషను అందించారు. మొట్టమొదటి తెలుగు శాసనం, క్రీ.శ. 600లో రేనాడులో కడప జిల్లా ఉత్తర ప్రాంతంలో లభించింది. మొదటి తెలుగు సీస పద్యాన్ని అద్దంకిలో చాళుక్య సేనాని అయిన పండరంగడు క్రీ.శ. 850 ప్రాంతంలో చెక్కించాడు. రాజరాజ నరేంద్రుని ప్రోత్సాహంతో క్రీ.శ. 1025 ప్రాంతంలో నన్నయ సాగించిన తెలుగు కావ్య రచనకు ఇది నాంది. (ఆంధ్రప్రదేశ్ దర్శిని పేజీ నెం. 47)

బౌద్ధంలో ముఖ్య సూత్రాలు 'సత్కరణ' చేయడం, 'సత్ ప్రయత్నం' చేయడం. ఈ రెండు సూత్రాలు పునర్ నిర్మాణానికి ఉపకరించాయి.

సత్కర్మ అనగా ఏమిటో బుద్ధ భగవానుడు మహాసతి పట్టాన సూత్రంలో ఇలా వివరించాడు –

"కతమా చ, భిక్ఖవే, సమ్మాకమ్మంతో? / పాణాతిపాతా వేరమణి, అదిన్నాదానా వేరమణి / కామేసు మిచ్చాచార వేరమణి, అయం వుచ్చతి భిక్ఖవే సమ్మా కమ్మంతో"

అనగా జీవహింస చేయకపోవడం, నీకివ్వబడనిది ఏదీ నీవు స్వీకరించకపోవడం, లైంగిక వ్యామోహాలకు పాల్పడకపోవడం ఓ భిక్షువులారా అదే సత్కర్మ.

"కతమా చ, భిక్ఖవే, సమ్మావాయామో? / ఇధ, భిక్ఖవే, బిక్ఖు అనుప్పన్నానం పాపకానం / అనుకుసలానం ధమ్మానం అనుప్పాదాయ ఛందం జనేతి / వాయమతి విరియం ఆరభతి చిత్తం పగ్గన్హాతి / పదహతి, అనుప్పన్నానం కుసలానం ధమ్మానం / ఉప్పాదాయ ఛందం జనేతి వాయమతి విరియం / ఆరభతి చిత్తం పగ్గన్హతి పదహతి ఉప్పన్నానం / కుసలం ధమ్మా తితియా ధితియ అసమ్మోసాయ / భియ్యోభావా వేపుల్లాయ భావనాయ పారిపూరియా / ఛందం జనేతి వాయమతి విరియం ఆరభతి / చిత్తం పగ్గన్హాతి పదహతి"

సముచితమైన సంపాదన అనగానేమిటో ఎరుగుదురా? ఓ భిక్షువులారా! భిక్షువైనవాడు ఉత్పన్నమౌతున్న చెడు ఆలోచనలు ఉత్పన్నంగాకుండా ఆపగలగాలి. నిగూఢంగా దాగియున్న శక్తిని ఉత్తేజపరిచి ఇది పని జేసేలా జేయాలి. మనసులో దాగియున్న అనుచితమైన మానసిక స్థితులను సరిజేసి సముచితమైన చర్యలవైపు మరల్చాలి.

సముచితమైన మానసిక స్థితిని గలిగించి అది శక్తివంతమైన సత్కార్య నిర్వహణవైపు నడిచేలా ప్రయత్నించాలి. సముచితమైన మానసిక స్థితి కొనసాగేలా సాధన జేస్తూ ఆ స్థితి ఆ తరువాత తరిగిపోనీకుండా చేయడమేగాక అది మరింతగా పెరిగి పరిపూర్ణ స్థాయికి చేరుకొనేలా చేయాలి. ఆ విధంగా తనలో నిద్రాణంగా దాగియున్న శక్తియుక్తులు పూర్తిగా వినియోగపరచుకొనేందుకు ప్రయత్నం చేయాలి. ఓ భిక్షువులారా! అదే సరియైన ప్రయత్నం. (భోధి సత్వ అంబేద్కర్ బౌద్ధ ధర్మ ఉద్యమం)

బౌద్ధం ఆంధ్రదేశంలో విస్తారంగా పరివ్యాప్తి చెందింది. ముఖ్యంగా

నాగార్జునుని బౌద్ధం ఆంధ్రదేశంలో పుట్టి ప్రపంచ వ్యాప్తంగా విస్తరించింది. ఆంధ్రదేశంలో బౌద్ధ విస్తరణ గురించి ఎక్కువగా కృషి చేసినవారు ఆచార్య బి.ఎస్.ఎల్. హనుమంతరావుగారు. ఆయన మహాయాన బౌద్ధ విస్తరణ గురించి ఇలా అన్నారు :

"మహాయాన బౌద్ధానికీ ఆంధ్రదేశం జన్మస్థలం. థేరవాద బౌద్ధానికి ఆంధ్రుల సేవ అపారం. ధాన్యకటకం మహాయానానికి ఆయువుపట్టు. నాగార్జునకొండ ప్రాంతంలోని పల్లవబొగ్గ థేరవాద బౌద్ధానికి మూల కేంద్రమైన శ్రీలంకతో సంబంధాలు కలిగియుండేవి. శిహల విహారము, మహిళా వన విహారం. 'వన విహారాలు' థేరవాద విహారాలుగా ప్రసిద్ధి చెందాయి. క్రీ.శ. 3వ శతాబ్ది మధ్యకాలంలో శ్రీలంకకు వెళ్లిన వైతుల్యకుల (చైత్య కులలో ఒక తెగ) పై శ్రీలంక బౌద్ధులలో తీవ్ర వ్యతిరేకత వ్యక్తం అయింది. పాళీ సంస్కృతిని రక్షించే ఉద్దేశ్యంతో శ్రీలంకలోని మహావిహార వాసినులు థేరవాద పునరుజ్జీవనానికి ఉద్యమించారు. స్మృతి పథం నుండి దూరమైన పాళీ సంస్కృతి తిరిగి పొందేందుకు ఆంధ్ర మహావిహార వాసినులు బుద్ధఘోషుని శ్రీలంకకు పంపారు. డి.డి. కోశాంబి, సుకుమారదత్తు మున్నగు చరిత్రకారులు పల్నాడులో కోట నెమలిపురిగోడలూరు (మొరందకేతిక) బుద్ధఘోషుని నివాస స్థలంగా గుర్తించారు. శ్రీలంక నుండి తిరిగివచ్చి బుద్ధఘోషుడు నాగార్జునకొండలోని కులధమ్మగిరి, శిహల విహారములోని బోధి వృక్షఛాయలలో 'విశుద్ధమగ్గ' ను రాశాడు. అది థేరవాద బౌద్ధంపై ప్రామాణిక నిఘంటువు" (పేజీ నెం. 113, 'బౌద్ధ దర్శనం', కత్తి పద్మారావు)

బౌద్ధం ప్రేరణతో ఎంతో సాహిత్యం తెలుగులో వచ్చింది. పద్యకావ్యాలు, గేయ కావ్యాలు, యక్షగానాలు, నాటకాలు, ఖండకావ్యాలు, విస్తృతంగా వచ్చాయి. బుద్ధ సంస్కృతి అనే గేయ ఖండికలో సత్య ప్రియగారు బుద్ధుని రూపాన్ని, తత్వాన్ని ఇలా బొమ్మ గట్టించారు.

"ఓహో! మహోన్నత మూర్తి! / జోహారు! మహోజ్వల కీర్తీ! / ఏనాటిదో నీ రూపు / ఏనాటిదో నీ మూర్తి / ఏనాటిదో నీ బౌద్ధం / గడిచినవట కాలగతిలో / రెండువేల అయిదు నూర్ల / నిండు వత్సరాల్ నేటికి / తరగలేదు ఈనాటికి / వానిలోని తీయదనం, / చెరగలేదు ఈనాటికి / వానిలోని తొలి అందం, / మాయలేదు ఈనాటికి / ఆ నిరీహ మతతత్వం / భారతీయ కళా జగతిలో / నీ రూపం నిస్తుల శిల్పం, / భారతీయ సంస్కృతిలో / నీ బౌద్ధం దివ్యముద్ర / అజ్ఞానాపు టంధ తమస్సులు / కులకక్షలు, మతభేదాలు, / కౌటిల్యం, హింసా స్పర్ధలు, / విలయములై విజృంభిస్తే / దౌర్జన్యపు ఘోర జగత్తున / సౌజన్యం, సమతను చాటుచు / మహాబోధివై మానవాళిని / ఉద్ధరించిన బుద్ధదేవా! / మరువలేము నీ త్యాగం!" (ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక -సంపుటము 4, బుద్ధపరి నిర్వాహక జయంతి సంచిక 41, పుట 42)

బౌద్ధ ఉద్యమం హిందు, ఇస్లామీల హింస వల్ల భారతదేశం దాటి వెళ్లిపోయింది. నాగార్జునుడు బ్రహ్మణీకరించినందువల్ల కూడ తెలుగునేలలో కొంత దెబ్బతిన్నది. వ్యవసాయ, కార్మిక కులాల్లో బౌద్ధ భావాలు మిగిలిపోయాయి. బౌద్ధం తరువాత కొంత సంస్కరణ తీసుకొచ్చిన ఉద్యమం వీరశైవం. పాల్కూరికి సోమనాథుని రచనల వల్ల వీరశైవం వ్యాప్తి చెందింది. అది కులాన్ని ప్రశ్నించింది. కర్ణాటక ప్రాంతం నుండి ఓరుగల్లు వరకు విస్తరించింది. బౌద్ధం మీద అది హింసాత్మకంగా ప్రవర్తించింది.

## కులంపై పోరాడిన సామాజిక ఉద్యమకర్త – వేమన

తెలుగు నేలలో వచ్చిన సామాజిక ఉద్యమకర్త వేమన. వేమన సామాజిక విప్లవానికి తెలుగు సాహిత్యంలో మూలమయ్యాడు.

'మూల మాంస ముదిన మహిమీద జనులెల్ల / కొవ్వుతావలేదో కోర్కెదీర / కులములన్ని ఒక కులముగా దెలియుడి / హింస జేయకుంట యేముఖ్యధర్మంబు / అనక హింసజేతు రవనిసురులు / చావు పశువుదినెడి చండాలుడేమేలు'

'వానితల మీద పులిమిన పంకిలమును కడిగి కురుణింపలేదయ్యో గగన గంగ' భారతదేశంలోని ఏ పుణ్య నదీ జలాలకు కూడ అంటరానివాని కులం బురదను కడిగివేసే శక్తిలేదు. పవిత్ర గంగానది కూడ వాడు మునగడం వలన అపవిత్రం అవుతుందే కాని వాణ్ని పవిత్రం చేయలేదు. ఇంత దౌర్భాగ్యాన్ని వాడి మెడకు చుట్టిన 'నరపశువులు' వాణ్ని అంటుకున్న పాపానికి నీళ్లలో మునుగుతున్నారు. అందుకే వేమన –

'మాలవాని వంటి మరినీళ మునిగేరు / మాలకర్మచేత మాలడయ్యే / ఏల తెలియలేదా ఈ నరపశువులు' అని హెచ్చరించాడు.

(సాంఘిక విప్లవ రచయితలు – కత్తి పద్మారావు)

వేమన మీద లోతుగ కృషి చేసిన ఎన్. గోపి ఆయన సిద్ధాంత గ్రంథాల్లో కబీరుతో పోల్చి వేమనను ఇలా విశ్లేషించారు.

'వేమన భావావేశపరుడు, స్వతంత్ర మార్గ సంచారి. యధేచ్ఛగా దేశమంతా తిరిగి, దురాచారాలను చూచి ఒళ్లు మండి వేడిగా, వాడిగా కవిత్వం చెప్పినవాడు. దానికాయన జీవించిన కాల పరిస్థితులు కూడ కొంత కారణం. కాని స్వభావతః వేమన ఉద్రేకి. వళ్లువరు రుషి వంటివాడు. సాత్విక భావ సంపన్నుడు. తననాటి సంఘ వ్యవస్థలతో ఎక్కువ పేచీ పడకుండా, భావ సంయమనంతో నీతి ప్రభోదం చేశాడు. సంప్రదాయకమైన ధర్మశాస్త్ర వాసనలు తిరువళ్లువరులో మెండు. ధార్మిక బోధనల కాయన పద్యాలు నికపోసలాలు. వేమన దృష్టివేరు. యావత్ సంఘానికి శ్రేయోదాయకమైన వాటిని ఉత్తమధర్మాలుగా ఆయన గుర్తించాడు. ఎంతటి నిగూఢమార్గాలయినా అవి మానవత్వ వ్యతిరేకమైతే వాటితో రాజిలేని యుద్ధం చేశాడు. వేమన సాంఘిక పరిణామానికి కృషి చేశాడు. వళ్లువరు హేతువును ఉపేక్షించలేదు కాని వేమన చేతిలో అదే ప్రధాన ఆయుధంగా మారింది.' (ప్రజాకవి వేమన; వి.ఎన్. గోపాల్, 1979)

వేమనలోని గొప్ప విషయం అస్పృశ్యుల గురించి ఎలుగెత్తి చాటడం. సంఘ బహిష్కరణలకు సంబంధించిన విషయంలో హృదయం కదిలేటట్టు మాట్లాడిన కవి వేమన. ఇది ఒక తాత్విక ఉద్యమంగానూ, సాంస్కృతిక ఉద్యమంగానూ ఆయన చేయగలిగాడు. ఈ విషయంగా వేమన రాసిన పద్యాలు చరిత్రలో చెరపలేనివి.

మాల మాల గాదు మహిమీదనే ప్రొద్దు / మాట తిరుగువాడు మాలగాక / వాని మాలయన్న వాడిపో పెనమాల / మనసు నిల్పకున్న మహిమీద మాలాడు / హక్కు శుద్ధిలేని వాదు చండాలుడు / కసువు

సేరి తిన్న పసరవు మైదిన / మాలదంద్రు వాని మహిని జనులు / పంది కోడి దిన్న ప్రాజ్ఞఁదందురు జనుల్ / మాల మాంసము దిన మహిమీద జనులెల్ల / క్రొవ్వు ద్రావలేదో కోర్కె దీర / కులములన్ని వొక్క కులముగా దెలియుడి

– ప్రజాకవి వేమన

వేమన సామాజిక విప్లవకవి. ఆయన మతం మానవతావాదం. ఎక్కడో కొండల్లో లోయల్లో ఉండి మాట్లాడి మొత్తం దేశానికే మేల్కొలుపు పాడినవాడు. అస్పృశ్యులకు మూలమైన కులాన్ని గురించి కూడ వేమన వ్యతిరేకించాడు. కులం తప్పని మానవులు మానవులకే జన్మిస్తారని ఆయన తత్వశాస్త్రాన్ని బోధించాడు. నిజానికి ఆయన మనస్మృతి చదివే ఉంటాడు. మనస్మృతిలో అస్పృశ్యుల గురించి నీచంగా చెప్పబడింది.

మనస్మృతి అధ్యాయం 3, 234, 235, 236.. శ్లోకాల్లో ఇలా చెప్పబడింది –

చాండాలలశ్చ వరాహశ్చ కుక్కుటశ్వా తథైవచ, / రజస్వలా చ షండశ్చ నేక్షేరన్నశ్నతో ద్విజ్

చండాలుడు, పంది, కోడి, కుక్క, రజస్వల, నపుంసకుడు – వీరును శ్రాద్ధభోక్తలగు బ్రాహ్మణులను జూడరాదు, కావున అవి వారిని చూడకుండా చేయవలయును.

హోమే ప్రధానే భోజ్యే చ య దేభిరబివీక్ష్యతే, /ధైవే కర్మణి పిత్ర్యే వా తద్గచ్ఛత్యయధాతథమ్

హోమము, దానము, బ్రహ్మణ భోజనము, మున్నగు సమయములందు అమవాస్య, పౌర్ణమి మున్నగు దేవకార్యములందు, శ్రాద్ధము మున్నగు పితృ కార్యములందును పై చండాలురు మొదలగువారు కంటంబడిరేని, యట్టికార్య మే యుద్దేశముతో జేయఁ బడునో యాఫలంబు నియ్యదు. ఈ భావజాలాన్ని తిప్పికొడుతూ వేమన చాలా పద్యాలు రాశాడు. అస్పృశ్యులనే కాకుండా కులాన్ని కూడ అహేతుకం అన్నాడు. సూటిగా తెలుగు నుడికారంతో మెదడులో నాటుకునేటట్లు చెప్పగలిగాడు.

కులము హెచ్చు తగ్గు కొదవలు పని లేదు / నాను జాతమయ్యె సకల కులము / హెచ్చు తగ్గు మాట లెట్లెరుంగగవచ్చు

మానవున్ని ఒక కులం చట్రంలో బిగించి ఉంచడం వేమనకు నచ్చలేదు. మానవుడు తన సాంఘిక వర్ణం ఏదో ఒక దానిలోని సభ్యుడై ఉంటున్నాడు. కాని ప్రాధమికంగా మానవుడనే గుర్తింపును కోల్పోయాడని వేమన వాపోయాడు. నైతిక ప్రమాణాల దృష్ట్యా వర్ణ వ్యవస్థ సమర్ధనీయం కాదని తేల్చి చెప్పాడు. ఇది జాతి ఐక్యతను భంగపరుస్తుందని హెచ్చరించాడు. వేమన గ్రంథాలమీద చారిత్రకమైన అవగాహన కలిగిన కట్టమంచి రామలింగారెడ్డి ఇలా అన్నారు :

'స్థూలంగా చెప్పాలంటే సామాజిక అసమానతలు, అంతరాలు, అణచివేతలు వంటి పుట్టుకమీద ఆధారపడిన దురాచారాలను రెండు ప్రాతిపదికలమీద విమర్శించాడు. మొదటిది అవి తప్పులు అనే నైతిక కారణాలమీద. రెండవది అవి సమాజాన్ని బలహీనపరిచి అంతిమంగా సమాజం విచ్చినం కావడానికి మరొక బలమైన శక్తికి అధీనం కావడానికి దారితీసాయనే ఉపయోగితావాద పునాదిమీద.'

సి.ఆర్. రెడ్డి కూడ ఒక సామాజిక ఉద్యమానికి దోహదం చేసిన వ్యక్తి. ఆయన వేమనను బయటికి తీసుకురావడం వల్ల తెలుగు సమాజం కొత్త పుంతలు తొక్కింది. వేమన సామాజిక విప్లవం గురించి ప్రసిద్ధ పాత్రికేయులు నార్ల వెంకటేశ్వరరావు గారు సామాజిక తాత్విక విశ్లేషణ చేశారు.

'ఒక సామాజిక తాత్వికుడిగా వేమన మానవ సమానత్వ ప్రబోధకుడు. ఎన్నో అంతరాలతో, అణచివేతలతో, చిహ్నాలతో, నిషేధాలతో ఉన్న కుల వ్యవస్థ ఉన్నంత వరకు సమానత్వం సాధ్యం కాదని, దాన్ని తొలగించవలసిందేనని ఆయన దృఢంగా నమ్మాడు.'

త్రిపురనేని వెంకటేశ్వరరావు వేమన మీద పరిశోధన చేసిన తాత్వికుడు. ఆయన కూడ వేమనను విజ్ఞాన సర్వస్వం అన్నాడు.

"వేమనను చూచిన కొలదీ పెరిగిపోతున్నాడు. అతడు తెలుసుకోని తత్వం లేదు. అతడు ప్రయోగం చెయ్యని సాధనలేదు. అతడొక పెద్ద ప్రయోగశాల. ఇదే గొప్పది, ఇదే సత్యం అనుకొంటూ ప్రతిదాన్నీ అనుష్ఠానంలోకి దీసుకోని, శోధించి, తర్కించి ఆలోచనచేతా, అనుభవంచేతా మళ్లీ తిరస్కరిస్తూ తర్కిస్తూ వచ్చాడు. అందుకే అతనిలో చాలా చాలా తత్వాలను గూర్చి సాధనాలను గూర్చి మండన ఖండనలు రెండూ ఉంటై, పరస్పర విరోధులుగా కనిపించుతై. అదంతా అతని పరిశోధన, అన్వేషణ, పరిణామక్రమం. అతని ప్రయోగశాలలోకి మధ్య యుగ భారతంలో తలెత్తిన తత్వశాఖలు (ఉపశాఖలు) అన్నీ విషయమై కూర్చుండినై. వేమన మధ్య యుగ భారతీయ మత-తత్వశాస్త్ర విషయం ఎన్‌సైక్లోపెడియా అనిపిస్తాడు." (సాంఘిక విప్లవ రచయతలు – కత్తి పద్మారావు)

కులాన్ని ప్రశ్నించిన వాడు ప్రతి ఒక్కడు ఒక సామాజిక విప్లవకారుడు. సాహిత్యపరంగా వేమన కుదిపినంత తెలుగు సమాజాన్ని మరొకరు కుదుపలేదు. కారణం అతనిలోని నిజాయితి. తెలుగు భాషపైన ఆయనకున్న పట్టు. తెలుగు సమాజాన్ని మూలాలనుంచి అధ్యయనం చేశాడు. భారత దేశానికి ఎన్ని సిద్ధాంతాలొచ్చిన అవి కులంలో కలిసిపోతున్నాయి. కులాన్ని ఎదిరించి నిలబడే సాహసం చేసిన వాన్ని ముందు సమాజం బహిష్కరిస్తుంది, దూషిస్తుంది, అపహాస్యం చేస్తుంది. దాన్ని తట్టుకోవడం సాహసచర్య. అందుకనే వేమనను దిగంబరుడన్నారు. అచలవాది అన్నాడు వీరశైవుడన్నారు. చివరకు ఆయన స్మృష్ట లేకుండా మరణించాడు.

సి.పి.బ్రౌన్ ఆయన పద్యాలను నాలుకల మీద నుంచి ఏరించాడు. అందులో కూడ ఎన్నో పాట భేదాలు సృష్టించారు. ఆయన్ని కవే కాదన్నారు. ఆటవెలది, తేటగీతులు రాసిన వారు కవి ఎలా అవుతారు అన్నారు. ఆయన్ని ప్రజాకవిగా ప్రజలు స్వీకరించారు. అనేక సాహిత్య, చారిత్రక గ్రంథాల్లో ఆయన పేరులేదు. కందుకూరి వీరేశలింగం గారు ఆయన పేరును కవుల చరిత్రలో రాయడానికి నిరాకరించారు. బ్రౌను ఆయన్ని వెలుగులోకి తీసుకురాకపోతే ఆయన మనకు దక్కి ఉండేవారు కాదు. ఇలాగే సామాజిక విప్లవ రచయితలెందరో లిఖించబడకుండా ధ్వంసమయ్యారు. అందుకే తెలుగు, సాహితి సామాజిక చరిత్రలను మళ్లీ పునర్ మూల్యాంకనం చేయవలసిన చారిత్రక సందర్భం ముందుకు వచ్చింది. ఆ పనిలో ముందుకు సాగుదాం.

*(ఇంకా ఉంది)*

సామూహిక జీవనం మొదలైనప్పటినుంచి ఉత్పత్తిలో, విశ్వాసాలలో, మొత్తంగా సామాజిక మార్పులో జరిగిన పెనుగులాటలు అన్నీ కూడ సామాజిక ఉద్యమాల అధ్యయనంలో భాగం కావలసినవే అంటున్నారు **ఎన్. వేణుగోపాల్**

# తెలుగుసీమలో సామాజిక ఉద్యమాలు కొన్ని ఆలోచనలు

మన చుట్టూ గతంలోనూ వర్తమానంలోనూ అనేక సామాజిక ఉద్యమాలు కనబడుతున్నప్పటికీ సామాజిక ఉద్యమమంటే ఏమిటి, దాన్ని ఎట్లా అర్థం చేసుకోవాలి, దాని స్వరూప స్వభావాలేమిటి, దాని పరిధీ పరిమితీ ఏమిటి అనే ప్రశ్నలకు అందరూ అంగీకరించే నిస్సందేహమయిన సమాధానాలు లేవు. చరిత్ర, సామాజికశాస్త్రం, రాజనీతిశాస్త్ర అధ్యయనాలలో ఈ విషయమై చాల చర్చ జరిగింది గాని సర్వాంగీకారమైన నిర్వచనం మాత్రం తయారుకాలేదు. అసలు మనుషుల సామూహిక జీవనం మొదలయినప్పటి నుంచీ సామూహికంగా చేసిన ప్రయత్నాలు; కార్యాచరణలు; చిన్నదో పెద్దదో ఒక లక్ష్యం పెట్టుకుని అది సాధించడంకోసం జరిపిన ఆందోళనలు; ఉన్న సామాజిక స్థితిపట్ల అసంతృప్తిని వ్యక్తీకరించిన తిరుగుబాట్లు; జీవనంలో, ఉత్పత్తిలో, మత విశ్వాసాలలో, ఆచార వ్యవహారాలలో పరివర్తనలు; తెలిసిగాని తెలియకగాని సామాజిక మార్పు కోసం జరిగిన పెనుగులాటలు అన్నీ కూడ సామాజిక ఉద్యమాల అధ్యయనంలో భాగం కావలసినవే.

కాని ఇప్పటివరకు సాగిన అధ్యయనాలలో ఈ విశాల అవగాహన లోపించిందనిపిస్తుంది. ఒక కొసన అన్ని సామాజిక సంచలనాలనూ ఉద్యమాలుగా చూసే, చూపే అవగాహన, మరొక కొసన ఎంత విస్తృత సామాజిక ఆందోళననయినా ఉద్యమంగా గుర్తించని అవగాహన ఉన్నాయి. సామాజిక ఉద్యమమంటే సామాజిక భాగస్వామ్యం, సామాజిక లక్ష్యం ఉండాలనే అభిప్రాయం బలంగా ఉండడంతో కుల, మత ఉద్యమాలను మాత్రమే సామాజిక ఉద్యమాలుగా చూసే ధోరణి ఉంది. ఒక ఉద్యమానికి రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక లక్ష్యాలు స్పష్టంగా ఉన్నట్టయితే ఆ ఉద్యమాన్ని సామాజిక ఉద్యమంగా గుర్తించని అవగాహన ఒకపక్కన ఉండగానే ఆ లక్ష్యాలకూ సామాజిక లక్ష్యాలకూ తేడా ఏమిటో తేల్చి చెప్పలేని స్థితి కూడ మరోపక్కన ఉంది. ఒక ఉద్యమం ఏకకాలంలో రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక ప్రయోజనాల కొరకు సాగుతూ ఒక సామాజిక శకలపు భాగస్వామ్యంతో, ఒక సామాజిక శకలంపై ప్రభావం వేస్తూ సాగుతుంది గనుక అసలు సామాజిక ఉద్యమం అనే నిర్వచనం కిందికి అన్ని సామాజిక సంచలనాలనూ తీసుకు రావలసిన అవసరం ఉంది.

ఈ విషయమైన అంతర్జాతీయంగా చాల చర్చ జరిగింది గాని అక్కడ చాల ఎక్కువగా యూరప్-కేంద్ర, అమెరికా – కేంద్ర, పాశ్చాత్య – కేంద్ర దృక్పథం ఉండడం వల్ల, పద్దెనిమిదో శతాబ్దానికి ముందు సామాజిక ఉద్యమాలనబడేవే లేవని, పద్దెనిమిదో శతాబ్దం చివర ఫ్రాన్స్‌లో, బ్రిటన్‌లో జరిగిన ఉద్యమాలే తొలి సామాజిక ఉద్యమాలని నిర్ధారించడం జరిగింది.

మొత్తం మీద ఇప్పటివరకూ ఉన్న నిర్వచనాలలోని, అవగాహనల లోని పరిమితుల వల్ల, తెలుగుజాతి చరిత్రలో భాగమైన అనేక ప్రఖ్యాత, బలవత్తరమైన సామాజిక సంచలనాలను ఉద్యమాలుగా గుర్తించడం లేదు. అందువల్ల ఇప్పటికి ఉన్న నిర్వచనాలను పక్కనపెట్టి తెలుగుజాతి సామాజిక చరిత్రలోని బలమైన సామాజిక సంచలనాల అధ్యయనం ద్వారా కొత్త ప్రాతిపదికలను అన్వేషించవలసి ఉంది.

అసలు ఏ సమాజానికయినా దాని పరిణామక్రమంలో చోదకశక్తిగా నిలిచేవి ఆ సమాజంలో కలిగే ప్రజా సంచలనాలే. ఆ సంచలనాలు సాధారణంగా ఆ సమాజ గర్భం నుంచే పుట్టి పెరుగుతాయి. అసలు ఒక సమాజంలో సంచలనాలకు మూలాలు ఆ సమాజపు ఉత్పత్తి విధానంలోనూ ఉత్పత్తి సంబంధాలలోనూ ఉంటాయి. అంటే తప్పనిసరిగా మనుషుల ఆలోచన, ఆచరణల ద్వారానే సామాజిక సంచలనాలు వ్యక్తీకరణ పొందుతాయి. ప్రత్యేకించి ఉత్పత్తి విధానంలోనూ, ఉత్పత్తి సంబంధాలలోనూ, స్థూలంగా సామాజిక సంబంధాలలోనూ వచ్చే ఘర్షణల పరిష్కార అన్వేషణలోనే సామాజిక సంచలనాలు తలెత్తుతాయి. 'ప్రకృతిలోనూ సమాజంలోనూ మానవమేధలోనూ విరుద్ధాంశాల ఐక్యత – ఘర్షణల నుంచే, అంతర్గత కారణాల వల్లనే అభివృద్ధి జరుగుతుంది' అనే సాధారణ తత్వశాస్త్ర సూత్రాన్ని నిర్దిష్టంగా సమాజానికి అనువర్తింపజేసినప్పుడు ఆ విరుద్ధాంశాల ఐక్యత – ఘర్షణలు సామాజిక సంచలనాల రూపం ధరించి సామాజిక పరిణామక్రమాన్ని నిర్ణయిస్తాయని అర్థమవుతుంది.

ఆ సంచలనాలు విభిన్న స్థాయిలలో, విభిన్న రూపాలలో, విభిన్న ప్రయోజనాలకోసం జరగవచ్చును. అందువల్లనే సమాజంలో ఒక ఒంటరి వ్యక్తి స్థాయి నుంచి, సమాజంలోని ఒక గణనీయమైన

సమూహం స్థాయి నుంచి మొత్తంగా సమాజమంతా పాల్గొనేదాకా ఈ సంచలనాలు, కదలికలు ఉంటాయి. అవి ఒక వ్యక్తికి కలిగిన అసంతృప్తి వల్లనో, ఆగ్రహానికి ఫలితంగానో కావచ్చు, ఆలోచన ఫలితంగా కావచ్చు లేదా ఒక సమూహం తనను తాను ఒక ముద్దగా భావించుకుని, తన ప్రయోజనాల సాధన కొరకు చేసే ప్రయత్నం కావచ్చు. ఒక సమాజంలోని రెండు సమూహాల మధ్య పొడసూపిన ప్రయోజనాల ఘర్షణ వల్ల అవి పీడక–పీడిత, అధికార–అధీన వర్గాలుగా మారిన ఫలితంగా కావచ్చు. లేదా ఒక సమూహం అనుభవిస్తున్న అసంతృప్తులను అవగాహన చేసుకుని, ఆ అసంతృప్తులు తీరే మార్గాన్ని అన్వేషించి, ఒక కర్తవ్యం ప్రకటించి, దిశానిర్దేశనం చేసే ఒక నాయకుడికి / నాయకురాలికి అనుచరులుగా, సహచరులుగా మారిన సమూహం సాగించే సంచలనం కావచ్చు.

ఆ విడివిడి వ్యక్తిగత, కౌటుంబిక, చిన్న సమూహాల సంచలనాలను ఉద్యమాలుగా గుర్తించే ఆనవాయితీ ఇంతవరకూ లేదు. స్థలంలోనూ కాలంలోనూ భాగస్వామ్యంలోనూ లక్ష్యంలోనూ ఫలితంలోనూ చెప్పుకోదగిన విస్తరణ ఉన్న సంచలనాలనే ఉద్యమాలుగా గుర్తిస్తున్నాము. ఒక విశాల ప్రాంతంలో జరిగిన, కనీసం కొన్ని నెలలపాటో సంవత్సరాల పాటో జరిగిన, కనీసం కొన్ని వందలమంది పాల్గొన్న, ఒక స్పష్టమైన మార్పు కొరకు జరిగిన సంచలనాలనే ఉద్యమాలుగా గుర్తిస్తున్నాము. భారతదేశంలో సామాజిక ఉద్యమ నిర్వచనం గురించి చాల చర్చ చేసిన సామాజిక శాస్త్రవేత్త ఎం.ఎస్.ఎ. రావు ఈ విభిన్న అభిప్రాయాలన్నిటినీ క్రోడీకరించి సామూహిక భాగస్వామ్యం, మార్పు కావాలనే ఆకాంక్ష అనే రెండు కారణాలను అందరూ అంగీకరించారనీ, అనుసరించే భావజాలం, నిర్మాణ పద్ధతి, పర్యవసానాల స్వభావం వంటి ఏకాభిప్రాయంలేని కారణాలు మరికొన్ని ఉండవచ్చుననీ అన్నారు. (ఎం.ఎస్.ఎ.రావు సంపాదకత్వంలో వెలువడిన సోషల్ మూవ్‌మెంట్స్ ఇన్ ఇండియా, మనోహర్ పబ్లిషర్స్, న్యూ ఢిల్లీ, 2000). నిర్మాణానికి ముందుదే ఉద్యమమని, ఒకసారి నిర్మాణం ఏర్పడితే అది ఉద్యమం కాకుండా పోతుందని కూడ ఆయన అన్నారు.

అయితే ఈ నిర్వచనాన్ని కూడ పునరాలోచించవలసి ఉంది. ఉద్యమం అనే మాటకు ఇంతకాలంగా చెప్పుకుంటున్నట్టుగా ఒక నిర్దిష్ట లక్ష్యంతో, ప్రణాళికాబద్ధమైన భాగస్వామ్యంతో, విశాల ప్రాంతంలో, ఎక్కువమంది తోడ్పాటుతో జరిగిన ఆందోళన అనే నిర్వచనం కుల, ఉపకుల, మత, స్త్రీ పురుష, ప్రాంతీయ, భాషా విభేదాలు లెక్కలేనన్ని ఉన్న మన సమాజంలో సరిపోతుందా అని పునరాలోచించవలసి ఉంది. ఇన్ని అంతరాల మధ్య సమూహం, లక్ష్యం అనే ప్రమాణాలను కూడ పునర్నిర్వచించవలసిన అవసరం రావచ్చు. బహుశా ఒక చిన్న ప్రాంతంలో, ఒకానొక ఉపకులమో, భాషా సమూహమో, మత సమూహమో, అందులోనూ ఒక చిన్న భాగమో తన అసంతృప్తుల వ్యక్తీకరణగా, తన ఆకాంక్షల కొరకు సాగించే ఆందోళనను కూడ ఉద్యమంగా గుర్తించవలసి ఉంటుందేమో ఆలోచించవలసి ఉంది. అసలు ఒక సామూహిక, లక్ష్యబద్ధ కార్యాచరణ మాత్రమే కాక, అటువంటి కార్యాచరణకు దారితీయగల ఆలోచనలు, కళారూపాలు, మాటలు, రచనలు కూడ ఉద్యమ సన్నాహకాలుగా, ఉద్యమ క్రమంలో తొలి దశలుగా గుర్తించవలసి ఉంటుందేమో, చిన్న చిన్న ప్రయత్నాలను కూడ ఉద్యమాల శకలాలుగా గుర్తించవలసి ఉంటుందేమో ఆలోచించాలి.

ఇప్పటివరకూ జరిగిన చర్చలో ప్రతి ఉద్యమానికీ గుర్తించదగిన ప్రారంభం, అభివృద్ధి, ఉధృతి, ముగింపు ఉంటాయని కూడ ఒక అభిప్రాయం ఉంది. కాని సామాజిక కదలికల ప్రారంభాలు, ముగింపులు ఒక కాలబిందువులో ఉంటాయా, ఒక క్రమంలో జరుగుతాయా, అది బిందువు కాక క్రమం అయినప్పుడు అంత స్పష్టంగా గుర్తించగలమా అనే సమస్య కూడ ఉంది. సామాజిక పరిణామాన్ని పట్టిచూపించేవి సంఘటనలే కావచ్చుగాని, ఒక వ్యక్తమైన సంఘటన జరగడానికి అవ్యక్తంగా ఎంతో ప్రయత్నం, సుదీర్ఘ క్రమం ఉంటాయి, వాటిని గుర్తించడం అంత సులభం కాదు.

అట్లాగే ప్రతి ఉద్యమమూ తాను ఏ లక్ష్యాలతో, ఏ మార్పు కొరకు ప్రారంభమయిందో ఆ లక్ష్యాలను, మార్పును సాధించకుండానే ఆగిపోవలసి రావచ్చు. ఒక్కోసారి ఒక ఉద్యమం ఏ లక్ష్యాలతో మొదలయిందో అందుకు వేరయిన, వ్యతిరేకమయిన లక్ష్యాలను కూడ కాలక్రమంలో తనలో కలుపుకోవచ్చు, సాధించవచ్చు. ఏ ప్రత్యర్థికి వ్యతిరేకంగా ఆ ఉద్యమం సాగుతుందో ఆ ప్రత్యర్థి చర్యలకు ప్రతిస్పందనగా కొత్త లక్ష్యాలను, మార్గాలను అలవరచుకోవలసిరావచ్చు. అనుకున్న లక్ష్యాలను సాధించినా సాధించలేకపోయినా, భిన్నమైన లక్ష్యాలను సాధించినా, మొత్తంగా సమాజ ఆలోచనాధారలో అది గణనీయమైన మార్పులు తేవచ్చు. ఆ సమాజం ఆ ఉద్యమానికి ముందు ఉన్నట్టుగా తర్వాత ఉండలేని స్థితి ఏర్పడవచ్చు. అటువంటప్పుడు ఒక ఉద్యమ ఫలితం కన్న ప్రయాణమే ఎక్కువ విలువయినది కావచ్చు.

కనుక ఒక ఉద్యమాన్ని భాగస్వామ్యం, లక్ష్యం, ఫలితం అనే ప్రమాణాలతో పాటు ఇతర ప్రమాణాలతో కూడ గుర్తించవలసి ఉంటుందేమో ఆలోచించాలి.

అటువంటి సృజనాత్మకమైన, విశాలమైన నిర్వచనం ఇవ్వకపోతే తెలుగుజాతి చరిత్రలో ఒంటరిగానో, చిన్న సమూహాలలోనో అసాధారణమైన కృషి చేసిన చాలమందిని ఉద్యమకారులుగా గుర్తించడం కష్టమవుతుంది. తెలుగుజాతి చరిత్రలో ఉజ్వలమైన ఘట్టాలుగా నిలిచిన సందర్భాలెన్నిటినో ఉద్యమాలుగా గుర్తించకుండా ఉండవలసి వస్తుంది.

తెలుగుసీమ చరిత్రలో సామాజిక సంచలనాల సంప్రదాయం సుదీర్ఘమైనది. రెండువేల ఏళ్లపై బడిన తెలుగుజాతి చరిత్రలో జరిగిన సామాజిక సంచలనాలన్నీ ఇవాళ మనం గుర్తిస్తున్న స్థాయిలో ఉద్యమ రూపం ధరించి ఉండకపోవచ్చు. ఉద్యమ రూపం ధరించినవి కూడ అన్నీ చరిత్రలో నమోదు అయి ఉండకపోవచ్చు. చరిత్రలో నమోదు అయినవన్నీ కూడ విజేతల దృక్పథం నుంచి మాత్రమే చిత్రణ పొంది ఉండవచ్చు. ఆయా ఉద్యమాల భాగస్వాముల ఆలోచనలూ ఆచరణలూ ఉద్వేగాలూ మనకు పూర్తిగా తెలియకపోవచ్చు.

తెలుగు ప్రజల సాంఘిక చరిత్రను సమగ్రంగా, సవిస్తరంగా అన్వేషించే నమోదు చేసే కృషి ఇంకా జరగడం లేదు గనుక, సురవరం ప్రతాపరెడ్డి ప్రారంభించిన ఆ కృషి (ఆంధ్రుల సాంఘిక చరిత్ర, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు, 1949) ఆరు దశాబ్దాల తర్వాత కూడ తగిన వారసత్వాన్ని, కొనసాగింపును పొందలేదు గనుక,

తెలుగుసీమలో సామాజిక ఉద్యమాల చరిత్ర రచన కూడ సక్రమంగా జరగలేదు. విడివిడిగా కొన్ని సమూహాల, సామాజిక వర్గాల ఉద్యమాల చరిత్ర, అది కూడా ప్రధానంగా పందొమ్మిదో శతాబ్దం తర్వాత నుంచి జరిగిన ఉద్యమాల చరిత్ర అక్షరబద్ధం అయింది గాని, రాసిన దానికన్న రాయవలసింది చాల ఎక్కువ అనిపిస్తుంది. చాలమంది సామాజిక ఉద్యమాల కార్యకర్తలు, నాయకులు రాసుకున్న ఆత్మకథలున్నాయి. ఇతరులు రాసిన జీవితచరిత్రలున్నాయి. వాటినుంచి విశేషాలను సేకరించి, సమీకరించి, సామాజిక ఉద్యమాల చరిత్రను పరిపుష్టం చేయవలసిన కర్తవ్యం అసంపూర్తిగానే ఉంది.

తెలుగుజాతి తెగ స్థాయి నుంచి గణం స్థాయి ఎదిగి, వర్ణ విభజన జరిగి, మతాచారాలు వ్యవస్థీకృతమైన స్థితి క్రీస్తు పూర్వం ఐదవ శతాబ్దం నాటికే ఏర్పడిందని అనిపిస్తుంది. ఈ పరిణామాలు ఎలా జరిగాయో ఊహలే తప్ప కచ్చితంగా తేల్చి చెప్పగల అవకాశం లేదు. ఆహార సేకరణ, పశుపోషణ దశలు దాటి స్థిర వ్యవసాయాన్ని అలవాటు చేసుకుని, వ్యవసాయోత్పత్తిలో మిగులును సాధించి, ఆ మిగులు మీద పరాన్న భుక్కులుగా శ్రమచేయకుండా జీవించగల అధికార, పురోహిత పాలకవర్గాలు ఏర్పడడానికి, ఆ పాలకవర్గాల ఆధిపత్యాన్ని ప్రజలు అంగీకరించడానికి సమాజంలో ఎన్నో సంచలనాలు జరిగే ఉంటాయి. పెనుగులాటల చరిత్ర ఉండి ఉంటుంది. కాని ఆ సంచలనాల గురించి స్థూల సమాచారమైనా తెలియదు.

బహుశా మనకు తెలిసిన తెలుగు జాతి చరిత్రలో బౌద్ధ, జైన మతాల వ్యాప్తి ప్రజలు పెద్ద ఎత్తున పాల్గొన్న తొలి విశాల ఉద్యమాలు కావచ్చు. కుల విభజనను, విగ్రహారాధనను వ్యతిరేకించిన మతాలుగా ఈ రెండు మతాలూ కులాల దొంతరలో అట్టడుగున ఉన్న కులాలను విపరీతంగా ఆకర్షించాయి. అయితే అప్పటికే కుల విభజన, మతాచారాలు సమాజంలోని గణనీయమైన భాగానికి దుస్సహంగా మారాయంటే అసలు అవి సమాజంలో ఆ స్థానానికి ఎట్లా వచ్చాయో పరిశీలించవలసే ఉంది.

గోదావరీ తీరం నుంచి బావరి అనే బ్రాహ్మణుడు గౌతమ బుద్ధుడి బోధనలకు ఆకర్షితుడై తొలిసారిగా బౌద్ధాన్ని ఈ ప్రాంతానికి తీసుకువచ్చాడని బౌద్ధ సాహిత్యం చెపుతున్నది. మతాంతరీకరణ అనే ఆధునికమైన మాట అప్పటికి వాడడం సరికాదేమోగాని, ప్రజలు, ముఖ్యంగా కింది కులాల వారు పెద్ద ఎత్తున తొలిరోజుల్లో బౌద్ధంలోకీ, ఆ తర్వాత జైనంలోకీ ప్రవేశించారు. వారు అప్పటికి ఉండిన మతాన్ని హైందవం అని గాని వైదికం అనిగాని అనడానికి కూడ వీలులేదు. అప్పటికి అమలులో ఉన్న మత శాఖలను బ్రాహ్మణ (ఆచారాలు, కర్మకాండ), భాగవత (భక్తి) మతాలుగా చరిత్రకారులు భావిస్తున్నారు. కచ్చితంగా ఆ మతాల నుంచి, బ్రాహ్మణేతర, కులభేదాతీత మతాలలోకి చలనం ఉద్యమ స్థాయిలో జరిగి ఉంటుంది. ఈ రెండు మతాలనూ అప్పటి ప్రభువులు కూడ సమర్థించడం వల్ల బహుశా ఆ మత సంప్రదాయాలకు పాలకుల నుంచీ, ప్రజల నుంచీ కూడ సహకారం దొరికింది. తెలుగు భాషా ప్రజల ప్రాంతంలో అన్ని చోట్లా, వందల స్థలాలలో విరివిగా బౌద్ధ, జైన అవశేషాలు దొరుకుతున్నాయంటే ఆ ఉద్యమాలు ఎంత విస్తృతంగా సాగాయో అర్థమవుతుంది.

బౌద్ధ, జైన మతాలను వృత్తి కులాలవారు, వ్యాపార కులాల వారు, స్త్రీలు ఎక్కువగా ఆదరించినట్టు కనబడుతున్నది. ఈ చలనాలలో బౌద్ధం క్రీస్తు పూర్వం మూడో శతాబ్ది నుంచి క్రీస్తు తర్వాత మూడో శతాబ్ది వరకు, జైనం క్రీస్తు పూర్వం మూడో శతాబ్దంలో ప్రవేశించినప్పటికీ క్రీస్తు తర్వాత ఏడో శతాబ్దం నుండి పన్నెండో శతాబ్ది వరకు ఒకప్పుడు మందకొడిగా, ఒకప్పుడు ఉధృతంగా సాగాయని బి.ఎస్.ఎల్. హనుమంతరావు రాస్తున్నారు (ఆంధ్రదేశంలో జైన, బౌద్ధ మతాలు, తెలుగు అకాడమి, హైదరాబాద్, 1994; ఆంధ్రుల చరిత్ర, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్, 1994; ఆంధ్రలో సామాజిక చలనం, అను : ఏటుకూరు బలరామమూర్తి, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్, 1993).

కాని కాలక్రమంలో బౌద్ధం క్షీణించింది. గౌతమ బుద్ధుడు దశావతారాలలో ఒక అవతారంగా మారిపోయి వైదిక సంస్కృతిలో భాగమయ్యాడు. (అప్పటికి ఇంకా హిందూ అనే మాటే పుట్టలేదు గనుక దాన్ని హైందవమతం అనడానికి కూడ వీలులేదు). అప్పటికి చాల ప్రగతిశీలమైన బౌద్ధం ఎంతో మంది ప్రజలను ఆకర్షించి కూడ ఏ కారణాల వల్ల బలహీనపడిందో, అందుకు దారితీసిన సామాజిక చలనాలేమిటో పరిశీలించవలసి ఉంది. ఆచార్య నాగార్జునుడి నాయకత్వంలో బౌద్ధ ధర్మానికి కొత్త నిర్వచనాలు ఇచ్చి మహాయానంగా మార్చి బ్రాహ్మణ మతాచారాలను, విగ్రహారాధనను అనుసరించడం మొదలయింది. బౌద్ధ ఆరామాలకు, చైత్యాలకు, విహారాలకు సంపద పెరిగిపోయింది. కోరికలు లేని నిరాడంబర జీవితం గడపవలసిన బౌద్ధ సన్యాసులు, సన్యాసినులు భోగ జీవితానికి అలవాటుపడ్డారు. సమకాలీన దుర్భర సామాజిక స్థితి నుంచి ఒక ఉపశమనంగా, విముక్తి మార్గంగా ఉంటుందని ప్రజలు ఆశించిన బౌద్ధం ఘనీభవించడం మొదలయింది. ఈ క్రమంలో బౌద్ధం క్రమంగా ఎలా ప్రజలకు దూరమయిందో, దానిలోని కులవ్యతిరేక, సమానత్వ భావనలు ఎలా కొడిగట్టిపోయాయో, అందుకు వ్యతిరేకమైన సామాజిక సంచలనాలు ఏమయినా ఉన్నాయేమో అన్వేషించవలసే ఉంది.

బౌద్ధుల అనంతరం, మరొక రకంగా చెప్పాలంటే శాతవాహనుల అనంతరం కాకతీయుల దాకా తెలుగు సీమ అంతా ఒకే పాలనలో లేదు. భిన్న పాలకులు భిన్న మతాలను ఆదరించారు. ఆ కాలంలో కులభేద నిర్మూలనం సామాన్య ధర్మంగా జైన, శైవ, వైష్ణవ మతాలు ప్రజల్లో పాదుకొనడానికి ప్రయత్నించాయని, ఆ మూడిటిని ఓడించి బ్రాహ్మణాచార ప్రాముఖ్యాన్ని, వర్ణాశ్రమ స్థిరతను నిలబెట్టడానికే కవిత్రయ భారత రచన జరిగిందని సురవరం ప్రతాపరెడ్డి రాశారు. జైన, వీరశైవ, వీరవైష్ణవ మతాలు పరస్పరం తీవ్రంగా కలహించు కున్నాయి. అది హింసకూ రక్తపాతానికీ కూడ దారితీసింది. మూడు మతాలూ అటు రాజులను ఆకర్షించడానికీ, ఇటు ప్రజలను ఆకర్షించడానికీ కూడ ప్రయత్నించాయి. ఈ చరిత్ర ప్రధానంగా ఏడో శతాబ్దం నుంచి పదమూడో శతాబ్దం దాకా సాగిందనవచ్చు.

జైనమతంలో సృష్టికర్త లేదు. అందువల్ల పూజా పునస్కారాలు గాని, కర్మకాండకాని లేదు. మానవుని సుఖదుఃఖాలకు పూర్వజన్మ సంచితమే కారణం. తపస్సుద్వారా ఆ సంచితాన్ని నిర్మూలించి నీతి

నియమాలతో ప్రస్తుత కర్మను నిరోధించడం వల్ల వేదన, దుఖం నశించి మనిషి జన్మరాహిత్యం సాధిస్తాడు అని జైనుల సిద్ధాంతం ఏమి చెప్పినప్పటికీ కర్మకాండల నిరసన, కుల భేదం లేకపోవడం, చాతుర్వర్ణ వ్యవస్థలోని కింది కులాలను ఆకర్షించాయి. ప్రధానంగా వైశ్యులు, శూద్రులలో ఊర్ధ్వముఖ చలనం సాధించినవారు జైనం వైపు ఆకర్షితులయ్యారు. కాని కొన్ని వందల సంవత్సరాలలోనే బౌద్ధం వైపునుంచీ, వీరశైవ, వీరవైష్ణవ సంప్రదాయాల నుంచీ జరిగిన దాడులతో కొంత, అంతర్గతంగానే సమానత్వం సమసిపోవడం వల్ల కొంత జైనం బలహీనపడింది.

వీర వైష్ణవ ప్రతినిధిగా పన్నెండో శతాబ్దంలో బ్రహ్మనాయుడు చేసిన కృషి తెలుగునాట సామాజిక చలనాలలో చాల ముఖ్యమైనది. ఆయన చాపకూడు పేరుతో సహపంక్తి భోజనాలను ప్రోత్సహించాడు. కంచంపొత్తు మాత్రమే కాక మంచంపొత్తు కూడ కులభేదాల నిర్మూలనకు అవసరమని గుర్తించాడు. "పల్నాటి వీరచరిత్రములో బ్రహ్మనాయుడు బ్రాహ్మణాది చండాల పర్యంతము నానాకుల స్త్రీలను పెండ్లాడెననియు, తనకు ముఖ్యుడైన కన్నమనీడు బ్రహ్మనాయున్ని తండ్రిగా చెప్పుకొనుటయు, యుద్ధరంగమున మాల, మాదిగ, వెలమ, కమ్మరి, వడ్ల, కుమ్మరి మున్నగు కులాల వారందరును వైష్ణవ సాంప్రదాయము వారై ఏకపంక్తిలో 'చాపకూడు' కుడుచుటయు ముఖ్యముగా గమనింపదగినది" అని ప్రతాపరెడ్డి రాశారు.

వీరశైవ వ్యాప్తిలో భాగంగా పాల్కురికి సోమనాథుడు పదమూడో శతాబ్దంలో సాగించిన కృషిని కూడ పూర్తి స్థాయి సామాజిక ఉద్యమంగా కాకపోయినా, సామాజిక ఉద్యమ సన్నాహంగా నయినా గుర్తించక తప్పదు. వ్యక్తిగా పాల్కురికి సోమనాథుడు, మతంగా ఆయన ప్రాతినిధ్యం వహించిన వీరశైవం అప్పటి సామాజిక స్థితిని మార్చడానికి చాల ప్రయత్నించాయి. ఆయన కూడ సహపంక్తి భోజనాలను ప్రోత్సహించాడు. రచనా శైలిలో పండిత, ఆస్థాన, మార్గ కవిత్వ సంప్రదాయాన్ని ధిక్కరించి ప్రజల కొరకు ప్రజలకు అర్థమయ్యే ఛందస్సును, భాషను వాడాలని ప్రయత్నించాడు. "శైవమందు చాకలి, మంగలి, మాల, మాదిగ, మున్నగు జాతుల వారందరు కలిసిరనుటకు పాల్కురికి సోమనాథ బసవపురాణమందనేక నిదర్శనములు కలవు. ఇప్పటికాలములో సత్ర భోజములు బ్రాహ్మణులకే ప్రత్యేకింపబడినవి. కాకతీయుల కాలమున కొన్ని తావులలో అన్ని వర్ణములవారికిని భోజనములు పెట్టుచుండిరి. శైవ సాంప్రదాయానుసరణముగ చండాలురకు గూడ అన్న వస్త్రదానములను సత్రములందేర్పాటు చేసియుండిరి" అని ప్రతాపరెడ్డి రాశారు.

ఈ రకంగా కుల, మత స్థితిలో చలనం తెలుగు జాతి చరిత్రలో ఒక ప్రధాన అంశం అయినప్పటికీ, సామాజిక ఉద్యమాలుగా చూసినప్పుడు రైతాంగంలో, ఆదివాసులలో, చేతివృత్తుల వారిలో, మహిళలలో కలిగిన సంచలనాలను ప్రత్యేకంగా అన్వేషించవలసి ఉంది. విభిన్న జానపద గాథలలో మిగిలి ఉన్న అవశేషాలను తవ్వితీసి ఇటువంటి కృషి సాగించవలసి ఉన్నది గాని, ఒక ముఖ్యమైన ఆదివాసి పోరాట గాథగా సమ్మక్క సారలమ్మల యుద్ధాన్ని చెప్పుకోవచ్చు.

వరంగల్ జిల్లా అటవీ ప్రాంతంలో జంపన వాగు ఒడ్డున మేడారంలో ఇప్పటికీ సాగుతున్న సమ్మక్క సారలమ్మల జాతర గురించి ఇంకా పరిశోధించవలసింది ఉంది గాని బహుశా రాజ్యాధికారాన్ని ధిక్కరించిన తొలి సామాజిక ఉద్యమాలలో అది ఒకటి కావచ్చు. ఇప్పటివరకు దొరుకుతున్న ఆధారాలనుబట్టి సమ్మక్క తండ్రి పగిడిద్దరాజు కరువు కాలంలో పన్నులు చెల్లించలేనని కాకతీయ గణపతిదేవుడిని (పదమూడో శతాబ్దం) ఎదిరించాడట. నిజానికి అప్పటికి కోయలు స్థిర వ్యవసాయంలోకి ప్రవేశించారా, వారు పన్ను కట్టవలసి ఉండిందా, కరువువల్ల పన్ను కట్టలేని స్థితి ఉండిందా అనే ప్రశ్నలు ఉన్నాయి గాని బహుశా పగిడిద్దరాజును అటవీ ప్రాంతం మీద సామంతుడిగా ప్రకటించి కాకతీయ రాజులు కప్పం కట్టమని అడిగి ఉంటారు. కోయలు అందుకు నిరాకరించి ఉంటారు. తత్ఫలితంగా యుద్ధం జరిగి ఉంటుంది. ఇందులో నిజానిజాలను నిర్దిష్టంగా, నిర్దుష్టంగా తేల్చి చెప్పడం కష్టం. ఏది ఏమయినా రాచరికాన్ని ఒక ప్రజాసమూహం ఎదిరించి, యుద్ధం అనదగిన ఘర్షణకు సిద్ధపడడం, ఆ క్రమంలో కొందరయినా ప్రాణాలు కోల్పోవడం జరిగిందంటే ఆ క్రమాన్ని ఒక సామాజిక ఉద్యమంగా గుర్తించకతప్పదు.

శ్రీకృష్ణదేవరాయల పాలన, విజయనగర సామ్రాజ్యం గురించి మామూలు చరిత్ర పుస్తకాలు ఎన్ని గొప్పలు చెప్పినప్పటికీ అప్పుడు ప్రజల మీద పన్నులభారం ఎంత తీవ్రంగా ఉండేదో కంభంపాటి సత్యనారాయణ (ఆంధ్రుల సంస్కృతి – చరిత్ర రెండో సంపుటం, హైదరాబాద్ బుక్ ట్రస్ట్, హైదరాబాద్, 1982) సవివరంగానే రాశారు. బహుశా ఆ పన్నుల భారానికి వ్యతిరేకంగా ప్రజలలో కలిగిన సంచలనం, కనీసం నిస్సహాయ నిట్టూర్పులు సామాజిక ఉద్యమంగా ఎదగడానికి ఆటంకాలు ఉండి ఉంటాయి గాని అవి ఆలోచనలలో, రచనలలో, మౌఖిక కళారూపాలలో వ్యక్తమయ్యాయి. ధూర్జటి పద్యాలలో కనిపించే రాజ్య ధిక్కారం ఆ సామాజిక అసంతృప్తికి చిహ్నమే. రాజాస్థానంలోనే ఆ అసంతృప్తి వెలువడిందంటే, ప్రజల మధ్య ఉండే కవుల నుంచి ఆ అసంతృప్తి ఇంకా ఎక్కువగా వ్యక్తం కావడంలో ఆశ్చర్యం లేదు. తెలుగునాట సామాజిక జీవనం అనుభవిస్తుండిన ఈ పురుటి నొప్పులు చాటువుల రూపంలోనూ, శతకాల రూపంలోనూ లిఖిత సాహిత్యం లోనూ, అసంఖ్యాకమైన పాటలు, కళారూపాల రూపంలో మౌఖిక సాహిత్యంలోనూ నమోదయ్యాయి. దాదాపుగా పద్నాలుగు పదిహేనో శతాబ్దాల నుంచీ వెలువడిన శతక కర్తలెందరో ఎన్నో సామాజిక వాస్తవాలను తమ పద్యాలలో అక్షరబద్ధం చేసి, అప్పటి సామాజిక సంచలనాలకు అద్దం పట్టారు. ప్రజల నోళ్ల మీద ఆడే వివేకాన్ని పలికించారు. ఆ శతకకర్తలందరిలోకి సమర్థుడూ, అప్పటి స్థలకాల పరిమితులకు లోబడినప్పటికీ దూరదృష్టీ, సమగ్రమైన సామాజిక ఆలోచనలూ ఉన్నవాడు వేమన.

వేమన అనే వ్యక్తి ఏకాలంలో ఏ ప్రాంతంలో ఉన్నాడనే విషయమై నిస్సందేహమయిన నిర్ధారణ లేదు. ఆయన పద్యాలుగా ప్రచారమవుతున్న వేల పద్యాలలో నిజంగా ఆయన చెప్పినవెన్నో, ఇతరులు కల్పించి ఆయన పేరుమీద చలామణీ చేసినవెన్నో కచ్చితంగా చెప్పలేము. కాని మూడు నాలుగు వందల సంవత్సరాల తర్వాత కూడ ప్రజల నాలుకలమీద సజీవంగా నిలిచి ఉన్న ఆ విమర్శనాత్మక, తాత్విక దృష్టి వల్ల ఆయనది

ఒక ఉద్యమమని మాత్రం స్పష్టంగా చెప్పవచ్చును. ఆయన సాంఘిక దురాచారాలను ఖండించాడు. వర్ణ వ్యవస్థను నిరసించాడు. అస్పృశ్యులతో సహా అన్ని కులాలవారూ ఒకటే అని 'ఒడలనున్న మాంసమొకటికాదె' అని ప్రశ్నించాడు. ఏ మతం వాడు చచ్చినా బూడిదే అవుతాడన్నది నిజం అయినప్పుడు వాదాలతో, మత విభేదాలతో పని ఏముంది అని ప్రశ్నించాడు. పరలోక భావనను తిరస్కరించి భౌతిక జీవితానికి విలువ ఇచ్చాడు. ఆ భౌతిక జీవితంలో పెరుగుతున్న ఆర్థిక అసమానతలను గుర్తించాడు. 'పసిడిగలుగువాని బానిస కొడుకులు' అని ధనికులకు విద్యావంతులు ఊడిగం చేయడాన్ని నిరసించాడు. ఒక్క మాటలో చెప్పాలంటే అప్పుడు ఒక సామాజిక ఉద్యమం ఉండి ఉంటే దాని ప్రణాళిక ఎలా ఉండేదో వేమన అటువంటి రచన చేశాడు.

భక్తి ఉద్యమం, సూఫీ ఉద్యమం కూడ ఆలస్యంగానైనా తెలుగు సీమలో ప్రవేశించాయి. భగవంతుడి ఆరాధనలో స్వార్థం, మోక్షభావన వంటివి లేకుండా భగవంతుడితో ప్రేమ సంబంధాన్ని, భక్తిని ప్రబోధించే భక్తి ఉద్యమం, హైందవ, ఇస్లాం సంస్కృతుల మేలుకలయికగా, నిరాడంబరత్వం, స్వార్థ త్యాగం పునాదిగా విస్తరించిన సూఫీ ఉద్యమం తెలుగుసీమలో కూడ అనేక మందిని ఆకర్షించాయి. తెలుగుసీమలో రామానుజ మతంలోకి కింది కులాలవాళ్లు ప్రవేశించడం భక్తి ఉద్యమ విస్తృతికి చిహ్నం కాగా, తెలుగుసీమ నాలుగు చెరగులా వ్యాపించి ఉన్న దర్గాలు, ఉర్సులు సూఫీ ఉద్యమ ప్రభావ విస్తృతికి చిహ్నాలు. సమాజంలోని అసమానతలను తొలగించడం సూఫీ ఉద్యమ ఆశయం. ధనికులు – పేదలు, హిందువులు – ముస్లిములు, స్వతంత్రులు – బానిసలు అందరినీ ఒకే విధంగా చూడాలని సూఫీలు ప్రబోధించారు. దళితుల పట్ల, పీడితుల పట్ల సానుభూతి చూపించారు. అందువల్ల దళితులు ఎక్కువమంది సూఫీలవైపు ఆకర్షితులయి, ఇస్లాంలో చేరారు.

పదిహేడో శతాబ్ది చివరిలో (1693) సమాధి పొందిన పోతులూరి వీరబ్రహ్మం తెలుగుజాతి చరిత్రలో సామాజిక ఉద్యమకారులలో విశిష్టమైన వ్యక్తి. వడ్రంగి – కంసాలి కులానికి చెందిన వీరబ్రహ్మం భవిష్యవాణిని వినిపించిన తత్వాల గాయకుడిగా ప్రాచుర్యంలోకి వచ్చాడు గాని అచలతత్వాన్ని ప్రబోధిస్తూ ఆయన సాంఘిక సంస్కరణల అవసరాన్ని నొక్కిచెప్పాడు. కులమత భేదాలు కృత్రిమాలని ప్రచారం చేశాడు. బ్రాహ్మణుడు అన్నాజయ్యను, ముస్లిం సిద్ధయ్యను, మాదిగ కక్కయ్యను తన శిష్యులుగా చేసుకున్నాడు.

ఇక ఇప్పటివరకూ సాగిన చరిత్రలో దొంగలుగా, బందిపోట్లుగా చరిత్రకు ఎక్కినప్పటికీ, స్పష్టాస్పష్టంగా అధికారాన్ని, ఆస్తిని, కుల అణచివేతను ధిక్కరించి, తమ ధిక్కారాన్ని ఏ రూపంలో వ్యక్తపరచాలో తెలియక అటువంటి చర్యలకు పాల్పడినవారెందరో ఉన్నారు. వాళ్లను సామాజిక ఉద్యమకారులుగా గుర్తించడం సాహసం కావచ్చుగాని, వారిలో కొందరయినా సామాజిక ఉద్యమకారులుగా మారగలిగినవారు. అందరికందరూ సామాజిక దౌష్ట్యాన్ని నిరసించినవారు. తమ పనుల ద్వారా సమాజంలో ఏదో ఒక మార్పుకు కారణమైనవారు. కనీసం అగ్రవర్ణాలవారిలో, ఆస్తిపరులలో, భూస్వాములలో, రాజులలో భయాన్ని కలిగించిన వారు. ఆ మేరకు సామాన్య ప్రజల ప్రేమాభిమానాలను చూరగొన్నవారు. శతాబ్దాలు గడిచినప్పటికీ వారిలో చాలమందిపైన ప్రశంసాగీతాలు, సంస్మరణ గీతాలు ప్రజలలో మిగిలి ఉన్నాయంటేనే వారి చర్యలలో ప్రజానుకూల స్వభావం ఉందని అర్థం. అటువంటి వ్యక్తులందరి గురించి కొత్త అవగాహనతో పరిశోధించి వారి చరిత్రలను కూడ సామాజిక ఉద్యమాల చరిత్రలో భాగం చేయవలసి ఉంటుంది. ఇటువంటి వీరగాథా నాయకులు తెలుగు సీమలో కనీసం జిల్లాకు ఒకరైనా ఉన్నారు. వారిలో దాదాపు అందరికందరూ శూద్ర, చేతివృత్తుల కులాల నుంచో, దళితుల నుంచో రావడం ఒక గుర్తించ దగిన అంశం. అనేక జానపద గాథలలో, కళారూపాలలో, భూస్వాములనూ, రాజులనూ విమర్శిస్తూ, హేళన చేస్తూ ఇటువంటి యోధుల చర్యలను ప్రశంసించడం కనిపిస్తుంది. అలా వేరువేరు కళారూపాలలో చెల్లాచెదరైపోయి ఉన్న చిన్నచిన్న ఆధారాలను సమీకరించి వాటిని అభివృద్ధి చేసి సామాజిక చరిత్రలో భాగం చేసినప్పుడు అవన్నీ తెలుగునాట సామాజిక ఉద్యమాల పరంపర ఎంత ఉజ్వలమైనదో నిరూపిస్తాయి.

పదిహేడో శతాబ్దిలో వరంగల్ – కరీంనగర్ ప్రాంతాల్లో అణగారిన కులాల నుంచి సైన్యాన్ని తయారు చేసి తెలంగాణలో గణనీయమైన భాగం మీద తన అధికారాన్ని స్థాపించుకున్న సర్వాయి పాపన్న (1650–1709) అటువంటి అనేకమంది యోధులలో ఒకడు.

హైందవమతంలో కరడుగట్టిన కుల అణచివేతవల్ల, అసమానత వల్ల ప్రధానంగా అణగారిన కులాలు పెద్ద ఎత్తున ఇస్లాంలోకి, క్రైస్తవంలోకి మారిపోయారు. సర్వసమాన సౌభ్రాతృత్వాన్ని ప్రబోధించిన మతాలుగా అవి కులాల అంతరాల వ్యవస్థలో అట్టడుగున ఉన్నవారికి సమానత్వ అవకాశాన్ని, ఉపశమనాన్ని, ఆత్మగౌరవ వాగ్దానాన్ని చూపించాయి. అటువంటి మత మార్పిడులు కూడ తెలుగు సీమలో జరిగిన ముఖ్యమైన సామాజిక సంచలనాలలో భాగమే. దాదాపు పదకొండో శతాబ్దం నుంచి మొదలయిన ఇస్లాం వ్యాప్తి, పదిహేడో శతాబ్దం నుంచి మొదలయిన క్రైస్తవ వ్యాప్తి, వాటివల్ల తెలుగు సమాజంలో వచ్చిన కదలికలు లోతుగా అధ్యయనం చేయవలసినవే.

ఇక తెలుగుసీమలోని ఒక భాగంలోకి ఇంగ్లిషువారు ప్రవేశించిన తర్వాత, మిగిలిన భాగంలో అసఫ్‌జాహీల పాలన సాగుతున్నప్పటికీ, రెండు ప్రాంతాలలోని తెలుగు సమాజంలో పెనుమార్పులు మొదలయ్యాయి. ముఖ్యంగా బ్రిటిష్ వారి ఏలుబడిలోకి వెళ్లిన ప్రాంతంలో పందొమ్మిదో శతాబ్దంలో బ్రిటిష్ పాలకులు తమ అవసరాల కోసం ప్రవేశపెట్టిన ఆధునిక వ్యవసాయోత్పత్తి పద్ధతులు, ఆనకట్టల నిర్మాణం, ఆధునిక పరిశ్రమలు, రవాణా సౌకర్యాలు, విద్యా విధానం సమాజంలోకి అనేక కొత్త భావాల్ని తెచ్చిపెట్టాయి. ఆ భావాల వల్ల, ఉత్పత్తిలో వచ్చిన మార్పుల వల్ల సమాజం అతలాకుతలమయిపోయింది. ఆ సంచలనాలు ఇంతవరకూ మనం చూసిన సామాజిక సంచలనాల కన్న విస్తృతమైన, లోతయిన సంచలనాలకు, ఒక రకంగా ఆధునిక సామాజిక ఉద్యమాలకు భూమికను రూపొందించాయి. బ్రిటిష్ ఆంధ్ర కన్నా కొన్ని దశాబ్దాలు ఆలస్యంగానైనా హైదరాబాద్ రాజ్యంలో కూడా ఆధునిక, సామాజిక సంచలనాలు మొదలయ్యాయి. ఆ విధంగా ఇప్పటికి చరిత్రకారుల దృష్టి ఎక్కువగా ప్రసరించిన సామాజిక ఉద్యమాల సంప్రదాయం తెలుగునాట పద్దెనిమిదో శతాబ్ది చివరి నుంచి మొదలయింది. ఆ ఉద్యమాల గురించిన అధ్యయనం దానికదిగా ఒక ప్రత్యేక శాఖ. ◆

వెనుకబడిన కులాల, వర్గాల ఓట్లతోనే అధికారంలోకి వచ్చే పాలకులు అగ్రకులాల వారి ఒత్తిడితో రిజర్వేషన్‌ల అమలుకు ఆటంకాలు సృష్టిస్తున్నారని అంటున్నారు **తోట సత్యనారాయణ, వరయోగుల వెంకటేశ్వర స్వామి**

# డీ రిజర్వేషన్లతో సామాజిక న్యాయం సాధ్యమా?

స్వతంత్ర భారతదేశంలో సామాజిక వ్యవస్థకు ఒక కొత్త రూపాన్ని ఇచ్చిన పరిణామం రిజర్వేషన్లు. తన సామాజిక చరిత్రలోని ఒక గొప్ప దోషాన్ని, అసంగతాన్ని సరిదిద్దుకునే క్రమంలో దేశం ముందుకు తీసుకువచ్చిన విధానమే ఈ రిజర్వేషన్లు. వీటి అవసరం కాదనడం ఎంత అనాగరికమో, ఇందులో జరుగుతున్న దుర్వినియోగం, అశాస్త్రీయపోకడలను ఖండించ లేకపోవడమూ అంతే అజ్ఞానం అవుతుంది. రిజర్వేషన్ వ్యవస్థ మార్పులు సంతరించకోకతప్పదు. ఎందుకంటే, అది సామాజిక, సాంస్కృతిక సమస్య. అది మార్పు మీద అధారపడి ఉంది. కాలం గడిచేకొద్ది మార్పు తప్పదు. కాని, ఈ మార్పునకు కొన్ని వర్గాలు సిద్ధంగా లేవు.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చి అరవయ్యేళ్లు అయినా వెనకబడిన తరగతులు, ఎస్.సి., ఎస్.టి.లు ఇంకా వెనకబడిపోతూనే ఉన్నారు. అన్నిరకాల అణిచివేతలకు లోనవుతున్నారు. విద్యా, ఉపాధి రంగాల్లో తగిన అవకాశాలు లేక అల్లాడుతున్నారు. ప్రపంచీకరణ నేపథ్యంలో వృత్తులు కోల్పోయి దిక్కుతోచని స్థితిలో కొట్టుమిట్టాడుతున్నారు. అటు చేయడానికి వృత్తులు లేక, ఇటు పట్టణాల్లో, నగరాల్లో ఎలాంటి ఉపాధి లభించక అవస్థపడుతున్నారు. అధికభాగం దారిద్ర్యరేఖకు దిగువన మగ్గుతున్నారు. ఈ నేపథ్యంలో ఈ కులాల ఓట్లతో అధికారంలోకి వచ్చే రాజకీయ పార్టీలు రిజర్వేషన్ల అమలు విషయంలో వ్యతిరేకతను ప్రదర్శిస్తున్నాయి. మరోవైపు అగ్రకులాల వారు 'ప్రతిభ' పేరుతో ఈ రిజర్వేషన్ల అమలును వ్యతిరేకిస్తున్నారు.

ఏ ప్రజాస్వామిక దేశంలోనైనా పార్లమెంట్, సుప్రీంకోర్టు అత్యున్నతమైన సంస్థలు. వీటిలో పార్లమెంట్ శాసనాలు చేస్తుంది. రాజ్యాంగ నిబంధనలను, న్యాయాన్ని, ధర్మాన్ని దృష్టిలో ఉంచుకొని ఆ శాసనాలకు సుప్రీంకోర్టు భాష్యం చెబుతుంటుంది. ప్రజాస్వామ్య రథచక్రాలకు ఈ రెండూ ఇరుసువంటివి. ప్రజాహితాన్నీ, ప్రజాజీవితాన్నీ ప్రభావితం చేసే చట్టాలూ, తీర్పులూ వీటినుంచి వెలువడుతుంటాయి. అందువల్ల చట్టసభల్లో ప్రవేశపెట్టే ప్రతి బిల్లుకూ, జరిగే ప్రతి చట్టానికీ, అలాగే దేశ అత్యున్నత న్యాయస్థానం ఇచ్చే ప్రతి తీర్పుకూ ఎనలేని ప్రాధాన్యం ఉంటుంది. కానీ ఇటీవల వెలువడిన 'రిజర్వేషన్ల' తీర్పు అలా కనిపించడంలేదు. పాలించే ప్రభుత్వం – చట్టాలు చేసే చట్టసభలు, న్యాయాన్నందించే న్యాయవ్యవస్థ తమ తమ బాధ్యతలను రాజ్యాంగబద్ధంగా నిర్వహించడం సమాజ హితానికి అవసరం. ప్రజాస్వామ్యంలో ప్రజలుమిన్న, ప్రజల సార్వభౌమత్వం ప్రజాస్వామ్యానికి ప్రాణం. కానీ, మన దేశంలో పాలించేవాళ్లు ఆ విషయాన్ని విస్మరించడం ఆనవాయితీ అయింది. ఈ నేపథ్యంలో న్యాయవ్యవస్థ "జవాబు దారీతనం" గురించి కొన్ని ప్రశ్నలు తలెత్తుతున్నాయి.

మన న్యాయవ్యవస్థ స్వేచ్ఛ, స్వతంత్ర ప్రతిపత్తి, నిష్పాక్షికతలపైన మనందరికి విశ్వాసం ఉంది. అయితే, ఇటీవల వెలువడిన తీర్పు న్యాయవ్యవస్థ ప్రతిష్ఠ దిగజార్చేదిగా ఉంది. ఈ తీర్పు పూర్తిగా రాజ్యాంగ విరుద్ధం. కాని వీటిని కాదనే నైతిక స్థైర్యం, రాజకీయ సంకల్పం, ఎన్నికైన ప్రభుత్వాలకు, పార్టీలకు కొరవడటంతో రాజ్యాంగానికి అతీతంగా, ఈ అధికారాలను సుప్రీంకోర్టు సొంతం చేసుకుంది. నిస్సందేహంగా ఇది రాజ్యాంగ ఏర్పాట్లకు, ప్రజాస్వామ్య సంప్రదాయాలకు వ్యతిరేకం. సర్కార్ల బలహీనత, అసమర్థత, అలసత్వం, దుష్పరిపాలన వంటి వాటి వల్ల సాధారణ పాలనా వ్యవహారాల్లో కూడా న్యాయస్థానాల జోక్యం పెరిగిపోయింది. కాబట్టి, న్యాయవ్యవస్థ జోక్యం పెరిగిపోవడం వలన ఇప్పుడు 'రిజర్వేషన్ల' అంశం బహిరంగ చర్చకు దారి తీసిన నేపథ్యమే ఈ వ్యాసం చర్చించిన అంశం.

## చారిత్రక నేపథ్యం

రాజా రామ్మోహన్‌రాయ్ సంఘసంస్కరణలకు విశేషమైన కృషి చేశాడు. 'భారత దేశ రాజకీయ స్వాతంత్ర్యం కంటే సామాజిక న్యాయం – సాంఘికస్వాతంత్ర్యం' ముఖ్యం అని భావించారు నంబూద్రిపాద్, మహాత్మా జ్యోతిరావుపూలే. 1873లో జ్యోతిరావు పూలే 'సత్యశోధక సమాజం' స్థాపించి, (మహారాష్ట్ర) నిమ్నకులాల హక్కుల కొరకు, స్త్రీల సమాన హక్కుల కొరకు పోరాటం జరిపాడు (తారాచంద్). పూలే నడిపిన ఉద్యమాలు, ఆందోళనలు, విజ్ఞప్తుల పర్యవసానంగా బ్రిటిషువారు భారతదేశ చరిత్రలో మొదటిసారిగా షెడ్యూల్డ్ కులాలు, వెనుకబడిన కులాల జాబితాలను తయారుచేసి రాష్ట్రాలలో 'రిజర్వేషన్' విధానం ప్రవేశపెట్టారు. సాంఘిక విప్లవ పితామహుడైన శ్రీరామస్వామి పెరియార్, సమాజంలో బహుసంఖ్యాకులైన వెనకబడిన కులాలకు రిజర్వేషన్ ఉండాలి అని 1950లో రిజర్వేషన్ల కొరకు పెద్ద ఎత్తున (తమిళనాడు) ఉద్యమం లేవదీసారు. ప్రధానమంత్రి నెహ్రూ వెంటనే వెనకబడిన తరగతుల వారికి రిజర్వేషన్లు కల్పించి, రాజ్యాంగం 15వ అధికరణకు 4వక్లాజు చేర్చి సాంఘికంగా, విద్యాపరంగా, వెనకబడిన తరగతుల

వారికి రిజర్వేషన్ సౌకర్యం కల్పిస్తూ, 1951లో రాజ్యాంగ చట్టాన్ని సవరింపజేసారు. భారత రాజ్యాంగంలో రిజర్వేషన్ సౌకర్యం కల్పిస్తూ చేయబడిన తొలి సవరణ ఇదే.

అంబేద్కర్ పీడిత కులాల వారికి, బలహీనవర్గాల వారికి రక్షణ కల్పించాడు. రాజ్యాంగపరంగా షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డ్ తెగలకు రాష్ట్ర శాసనసభలో, పార్లమెంట్ ఉద్యోగాలలో వారి జనాభా ప్రతిపాదికపై రిజర్వేషన్లు కల్పింపబడినవి. ఇది మరో మౌలిక మార్పు. రామ మనోహర్ లోహియా (1942) కులవ్యవస్థలో అణగారిన బలహీన, దళితవర్గాల బహుజనుల విముక్తికి 60 శాతం రిజర్వేషన్ల కోసం పోరాటం (ఉత్తరప్రదేశ్) జరిపాడు. ఈ విధంగా పీడిత కులాలపై అణచివేత, అసమానతలపై అవిశ్రాంత పోరాటం జరిపారు.

1916లో మైసూర్ రాష్ట్రంలో ప్రభుత్వం రిజర్వేషన్లు వెనకబడిన వర్గాలకు కల్పిస్తూ, చర్యలు చేపట్టడంతో 25 శాతం ఉద్యోగాలను అర్హతవున్న వెనకబడిన కులాలకు రిజర్వు చేసింది. దీని ఆధారంగా ప్రభుత్వం 'కమ్యూనల్ అవార్డ్' జివోను జారీచేసింది. యాభై శాతం వెనకబడిన కులాలకు ప్రభుత్వం ఉద్యోగాల్లో రిజర్వేషన్లు కల్పించారు.

1919లో మాంటెగ్ - జెమ్స్ ఫర్డ్ సంస్కరణలు ప్రవేశపెట్టిన తర్వాత 1924లో 'ముద్దీమన్ కమిటీ'ని నియమించింది. విద్య, ఉద్యోగాలలో, చట్టసభలలో అణగారిన కులాలు అతి తక్కువ ప్రాతినిధ్యం పొందుతున్నారనీ చెప్పింది. దీంతో బ్రిటిష్ ప్రభుత్వం 1927లో సైమన్ కమిషన్‌ను నియమించింది. ఈ కమిషన్ ద్వారా క్రింది కులాలకు ఉద్యోగాలలో, కౌన్సిల్‌లలో సరైన ప్రాతినిధ్యం లేదని తెలపింది. ఆ తర్వాత (1932) రామ్‌సే-మెక్-డొనాల్డ్ 'కమ్యూనల్ అవార్డు' ప్రకటనతో హిందువులు, ముస్లింలు, భారతీయ క్రిస్టియన్లు, సిక్కులు, యురోపియన్లు, మహిళలు తదితర 17 వర్గాలకు రిజర్వేషన్లు ఉండాలని సూచించింది.

## ప్రెసిడెన్సీలు - రిజర్వేషన్లు

1849లో పరమహంసమండలి, 1867లో ప్రార్థనా సమాజ్, 1871లో సార్వజనిక సభ, 1873లో సత్యశోధ సమాజ్, 1877లో ఆర్యసమాజ్‌లు ప్రారంభమైనాయి. వీటిద్వారా ముందుగా విద్యా, ఉద్యోగాల్లో సంస్కరణలు జరిగాయి. వాటిని బొంబాయి ప్రెసిడెన్సీల రిజర్వేషన్లుగా పిలుస్తారు. మద్రాసు ప్రెసిడెన్సీ 1892, 1899, 1908, 1911 లలో 'కమ్యూనల్ పద్ధతి' ప్రకారం ఉద్యోగ, చట్టసభలలో ప్రాతినిధ్యం కల్పించాలనీ ప్రభుత్వంపై ఒత్తిడిలు వచ్చాయి. ఆ తర్వాత 1912లో ఉద్యోగాలలో, లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో 'కమ్యూనల్ రిక్రూట్‌మెంట్' పద్ధతి ద్వారా వివిధ కులాలకు ప్రాతినిధ్యం ఇవ్వాలని ప్రభుత్వం ఆర్డర్‌ను జారీ చేసింది.

ఇక కలకత్తా ప్రెసిడెన్సీలో రిజర్వేషన్లు 1930 తర్వాత నామశూద్ర ఉద్యమం విద్యా, ఉద్యోగం, చట్ట సభల్లో అధిక ప్రాతినిధ్యం కోసం దృష్టి సారించింది. బొంబాయి ప్రెసిడెన్సీలో బ్రాహ్మణేతరుల ఒత్తిడికి తలొగ్గి 1927లో బి.సి., ఎస్.సి. కులాలకు పరిపాలనలో 50 శాతం, క్లర్క్, మిగిలిన క్రింది స్థాయి ఉద్యోగాలకు రిజర్వు చేయాలనీ ఒక తీర్మానాన్ని అమోదించారు.

1932లో బ్రిటిష్ ప్రభుత్వం 'కమ్యూనల్ అవార్డ్'ను ప్రకటించింది. ఆ తర్వాత పూనా ఒడంబడిక జరిగి షెడ్యూల్డ్ కులాలకు, తెగలకు రిజర్వేషన్లు కల్పించడానికి అవకాశం వచ్చింది. 1946లో 'రాజ్యాంగపరిషత్' కింది కులాల వారు మరిన్ని హక్కులను సాధించుకొన్నారు. 1947లో మొదటి రాజ్యాంగ సవరణ ద్వారా బి.సి.లకు రిజర్వేషన్లు అమలులోకివచ్చాయి.

## రిజర్వేషన్ - రాజ్యాంగం

రాజ్యాంగంలో రిజర్వేషన్లు సమాజంలో వేలాది సంవత్సరాలుగా కులవ్యవస్థ వలన అణచివేతకు గురైన బలహీనవర్గాలకు ప్రయోజనం కల్పించాలనే ఉద్దేశ్యంతో వీటిని చేర్చడం జరిగింది. ప్రధానోద్దేశ్యాలు సమాజిక, జనజీవన స్రవంతిలో కలపాలనీ, ఆశయం నెరవేరిన వెంటనే కులవ్యవస్థను రద్దు పర్చాలనీ, పేదరికం నుండి విముక్తి గావించాలనీ, అక్షరాస్యత సాధించాలనీ, సభ్య సమాజంలో గౌరవంగా జీవించడానికి సాంస్కృతికాభివృద్ధి, నాగరిక చైతన్యం సమకూర్చుకుని సమాజంలో సమానత్వం సాధించాలనీ.

ఆర్టికల్ (335) ప్రకారం: షెడ్యూల్డ్‌కులాలు, షెడ్యూల్డ్ జాతులకు పార్లమెంట్‌లో, శాసనసభలలో జనాభా ప్రాతిపదికపై రిజర్వేషన్లు కల్పించారు. రాజ్యాంగం అమలులోనికి వచ్చిన తర్వాత యాభై సంవత్సరాల వరకు ఇవి అమలులో ఉంటాయి. అయితే, ఈ కాల పరిమితి పొడిగిస్తూ వచ్చారు. ఈ రిజర్వేషన్లు ఉద్యోగాలలో రాజ్యాంగ అధికరణలు 15 (4), 16(4) లలో కల్పించిన రిజర్వేషన్లతో సహ తాత్కాలికమైనవి. రాజ్యాంగం ఆమోదించిన రిజర్వేషన్ విధానస్ఫూర్తి దళితులకూ, ఆదివాసులకూ అయితే వారి జనాభా నిష్పత్తిని బట్టి రాజ్యాంగమే నేరుగా 15 శాతం, 7.5 శాతం రిజర్వేషన్ కల్పించింది. సామాజికంగా, ఆర్థికంగా వెనకబడిన తరగతుల గురించి మాత్రం స్థూలంగా అదేశిక సూత్రాలలోని అధికరణం 46లోనూ, నిర్దిష్టంగా అధికరణం 340లోనూ ప్రస్తావించడంజరిగింది.

దేశంలో వెనకబడిన కులాలు వారి జనాభా ఎంతో 1931 తర్వాత ప్రత్యేక జనగణన జరగలేదు. కాబట్టి తెలియదనడం నిజమే కానీ, 1931 వెనుకబడిన కులాల జనాభామొత్తం దేశ జనాభాలో 52 శాతంగా ఉంది. ఆ తర్వాత గడిచిన డెబ్బై సంవత్సరాలలో మిగిలిన వర్గాలన్నిటి జనాభా నిష్పత్తి అదే విధంగా ఉన్నందువల్ల వెనుకబడిన కులాల జనాభా ఇవాళ కూడా 52 శాతమే ఉండవచ్చు.

1953లో ఏర్పాటయిన కాక కలేల్కర్ కమిషన్ (1953-55) 2339 వెనుకబడిన కులాల జాబితా తయారు చేసి, రిజర్వేషన్ల కల్పనకు, వెనుకబాటుతనాకి ఒక సూచికగా కులాన్ని గుర్తించాలని సూచించింది. కలేల్కర్ సిఫారసులను ప్రభుత్వం చెత్తబుట్టకు దాఖలు చేసింది. ఆ తర్వాత ఏర్పాటైన బి.పి మండల్ కమిషన్ (1979-80) దేశంలో వెనకబడిన కులాల జనాభా 52 శాతం అని చెబుతూనే వారికి 27 శాతం రిజర్వేషన్లు మాత్రం కల్పించాలనీ సిఫార్సు చేసింది. ఆ నివేదికను ప్రభుత్వాలు పది సంవత్సారాలు తొక్కిపెట్టి తర్వాత, అమలు చేయడానికి వి.పి. సింగ్ ప్రభుత్వం ప్రయత్నించినపుడు అగ్రవర్ణాలవారు పెద్ద ఎత్తున స్పందించారు. దీని అర్థం ఈ దేశంలో కనీసమైన సామాజిక న్యాయ కల్పనకు మన ఆలోచనలు ఇంకా సిద్ధంగా లేవు. ఇతర వెనుకబడిన

తరగతులు (ఒబిసి) విద్యార్థులకు కేంద్ర మంత్రి వర్గం కేంద్రీయ విద్యాలయాల్లో, ఐ.ఐ.టి., ఐ.ఐ.ఎం.లలో 27 శాతం రిజర్వేషన్ కల్పిస్తానని ప్రభుత్వం ప్రకటించింది.

| | | |
|---|---|---|
| **గ్రూప్ ఎ** | | |
| షెడ్యూల్డ్ కులాలు | 15.05 | శాతం |
| షెడ్యూల్డ్ తెగలు | 7.51 | శాతం |
| **మొత్తం** | **22.56** | **శాతం** |
| **గ్రూప్ బి** | | |
| ముస్లింలు | 11.19 | శాతం |
| క్రిస్టియన్లు | 2.16 | శాతం |
| సిక్కులు | 1.67 | శాతం |
| బౌద్ధులు | 0.67 | శాతం |
| జైనులు | 0.47 | శాతం |
| **మొత్తం** | **16.16** | **శాతం** |
| **గ్రూప్ సి** | | |
| బ్రాహ్మణులు | 5.52 | శాతం |
| రాజపుత్రులు | 3.90 | శాతం |
| మరాఠా | 2.21 | శాతం |
| జాట్స్ | 1.00 | శాతం |
| వైశ్యులు | 1.88 | శాతం |
| కాయస్తులు | 1.07 | శాతం |
| ఇతర అగ్రకులాలు | 2.00 | శాతం |
| **మొత్తం** | **17.58** | **శాతం** |
| **గ్రూప్ డి** | | |
| ఒ.బి.సి. | 43.70 | శాతం |
| 'బి' గ్రూప్‌లో ఒ.బి.సి.లుగా గుర్తింపబడినవారు | 8.40 | శాతం |
| **మొత్తం** | **52.10** | **శాతం** |

(మూలం : మండల్ కమిషన్ రిపోర్ట్)

భారతదేశంలో ఒ.బి.సి.ల శాతం 52 ఉన్నట్లు కమిషన్ నిర్ణయించింది. పార్లమెంట్‌లో ఆమోదం పొందిన 104 సవరణ బిల్లు 93వ రాజ్యాంగ సవరణగా అమల్లోకి వచ్చింది. ఈ సవరణ ప్రకారం అధికరణ 15, క్లాజ్ (4) తరువాత, క్లాజ్ (5) చేర్చారు. ఈ క్లాజ్ (5) ద్వారా సామాజికంగా, విద్యాపరంగా వెనకబడిన తరగతులు, ఎస్.సి, ఎస్.టిల పురోగతి నిమిత్తం మైనారిటీ విద్యా సంస్థల్లో తప్ప, ప్రభుత్వ సహాయం పొందుతున్న / పొందని ప్రైవేట్ విద్యా సంస్థలతో బాటు విద్యాసంస్థలన్నిటిలో ప్రవేశానికి సంబంధించి చట్టం చేయడం ద్వారా ప్రత్యేక సదుపాయం కల్పించడానికి ప్రభుత్వానికి వీలవుతుంది. ప్రైవేట్ విద్యాసంస్థల్లో ప్రవేశ విషయం ప్రత్యేకంగా స్పష్టం చేసుకోవడం తప్ప కొత్త సవరణ ద్వారా ప్రభుత్వానికి అదనంగా అధికారాలేమీ సంక్రమించలేదు సరిగదా, ఉన్న అధికారాలకు కొత్త పరిమితులు, షరతులు వచ్చాయి. మైనారిటీలకు మరికొంత మేలు జరిగింది. 1951 నుంచి అమలులో ఉన్న క్లాజ్ (4) ద్వారా చట్టం అవసరం లేకుండానే, కేవలం ఉత్తర్వుల ద్వారానే మైనారిటీ విద్యా సంస్థలతోబాటు అన్ని విద్యా సంస్థలలో రిజర్వేషన్లు కల్పించడానికి అధికారాలు ఉండగా, చట్టం చేయవలసిన షరతును మైనారిటీ విద్యాసంస్థల మినహాయింపును నేటి క్లాజ్ (5) కొత్తగా తెచ్చిపెట్టింది. ఈ క్లాజ్ (4) కింద సంక్రమించని అధికారాలతోనే కేంద్ర విద్యాసంస్థల్లో ఎస్.సి, ఎస్.టి రిజర్వేషన్లను ప్రభుత్వం మూడు దశాబ్దాలుగా అమలు చేస్తోంది. ఈ అధికారాలకిందే బి.సిలకు కూడా అమలు చేయడానికి అవకాశమున్నప్పటికీ ఇంతవరకు కేంద్ర ప్రభుత్వం పట్టించుకోలేదు. ఇపుడు క్లాజ్ (5) ద్వారా ప్రైవేట్ విద్యాసంస్థలో రిజర్వేషన్ల కల్పన తప్పనిసరైన సందర్భాన, బి.సిలకు కూడా కేంద్ర విద్యా సంస్థల్లో రిజర్వేషన్లు కల్పించడం ఒక విధంగా అనివార్యం అయింది. దేశ వ్యాప్తంగా పెరుగుతున్న బి.సి.లలో చైతన్యం, ఒత్తిడి కూడా దీనికి దోహదం చేశాయి.

ఇటీవల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 348 (3) రాజ్యాంగపు అధికరణ కింద సామాజిక, విద్యాపరంగా వెనకబడిన ముస్లిం కమ్యూనిటీకి, గ్రూపులకు సీట్లు లేక రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ నియామకాల్లో రిజర్వేషన్ కల్పిస్తూ 2007 జూలై 6న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉత్తర్వును విడుదల చేసింది.

## సామాజిక న్యాయం - రిజర్వేషన్లు

స్వాతంత్ర్యానంతరం ప్రభుత్వరంగం నుంచి పోటిని తట్టుకొని ఎదగడానికి వీలుగా ప్రైవేటురంగానికి కోటాలు, పర్మిట్లు, లైసెన్సులు, రాయితీల రూపేణా ప్రభుత్వం ఎన్నో రక్షణలు కల్పించిందని ఆ రుణం ఇపుడు తీర్చుకోవాలనీ సామాజిక న్యాయశాఖ అభిప్రాయపడుతోంది. ఆర్థిక సంస్కరణలు ప్రారంభమయ్యాకే కొత్త ఊపిరి పీల్చుకొన్న ప్రైవేట్ రంగం ప్రపంచీకరణ పథంలో పయనిస్తోంది.

2005 ఆగస్టు 12న ప్రైవేటురంగంలోని వృత్తి విద్యా సంస్థల్లో రిజర్వేషన్ల అమలు, అడ్మిషన్ల ప్రక్రియ, ఫీజులు నిర్ణయం తదితర అంశాలకు సంబంధించి సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు సామాజిక వర్గాలపై విస్తారమైన ప్రభావం వేసింది. సామాజికంగా ఆధిపత్య, సంపన్నవర్గాలు సుప్రీంకోర్టు తీర్పును ఆహ్వానించాయి. బడుగు, బలహీన వర్గాలు మాత్రం తీర్పు పట్ల తమ వ్యతిరేకతను, నిరసనను వ్యక్తం చేస్తున్నాయి. వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు ప్రధానంగా దక్షిణాది రాష్ట్రాలైన ఆంధ్ర ప్రదేశ్, కర్నాటక, తమిళనాడు, కేరళలే కాక, మహారాష్ట్ర, మధ్య ప్రదేశ్ రాష్ట్రాలు సుప్రీంకోర్టు తీర్పును పున: సమీక్షించాలని రివ్యూ పిటిషన్ దాఖలు చేయడానికి రంగంలోకి దిగాయి. నాటి నుండి నేటివరకు రిజర్వేషన్లపై పలు సందర్భాలలో చర్చ జరిగింది. మండల్ కమిషన్ సందర్భంలోనూ, మురళీధర్ కమిషన్ సందర్భంలోనూ చర్చ వాడిగా, వేడిగా జరిగింది. అక్కడక్కడ భౌతిక దాడులకు కూడా దారి తీసింది. చర్చకాస్త రిజర్వేషన్లు అవసరంలేదు, అవసరమైతే ఆర్థికంగా సహకరిస్తే సరిపోతుంది అనేదాకావెళ్ళింది. అందువలన వివిధ అంశాలతో పాటు రిజర్వేషన్ల పై సుప్రీంకోర్టు ఇచ్చిన తాజా తీర్పును జాగ్రత్తగా పరిశీలించి వివిధ కోణాల నుంచి విశ్లేషించాల్సి ఉంటుంది. ప్రపంచీకరణ నేపథ్యంలో విద్యాసంస్థల స్థాపన - నిర్వహణ, ఫీజుల రూపకల్పన, అడ్మిషన్ల ప్రక్రియ తదితర అంశాలలో తమకు పూర్తి స్వేచ్ఛ ఉండాలి. అది తమకు రాజ్యాంగం కల్పించిన హక్కు. అందువల్ల తమ వ్యవహారాలలో ప్రభుత్వ జోక్యం చేసుకోరాదని ప్రైవేట్ వృత్తి విద్యా సంస్థల యాజమాన్యాలు చాలా కాలంగా వాదిస్తున్నాయి. ఈ అంశాలపై కోర్టులలో సవాల్ కూడా చేశాయి (2002, అక్టోబర్ 30న టి.ఎం.పాయ్ ఫౌండేషన్) ఈ తీర్పుపై

వ్యక్తమైన సందేహాల నివృత్తికోసం 2003 ఆగస్ట్ 14న ఇచ్చిన తీర్పులో రాజ్యాంగం అధికరణలతో ముడిపడిన అనేక అంశాలకు భాష్యం చెప్పింది. అదేవిధంగా ప్రైవేట్, మైనారిటీ, అన్‌ఎయిడెడ్ వృత్తి, విద్యా కళాశాలల్లో పై విషయాలకు సంబంధించి గత దశాబ్దన్నరకాలంగా ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కర్నాటక, కేరళరాష్ట్ర ప్రభుత్వాలకు సుప్రీంకోర్టుకు మధ్య మళ్ళీ వివాదం నలుగుతోంది. అయితే ఈ తీర్పులో ప్రైవేట్ మైనారిటీ, అన్‌ఎయిడెడ్ కళాశాలల్లో రిజర్వేషన్లు వర్తించవు. అదే విధంగా ఈ సంస్థలకు ప్రభుత్వం ఏ రకమైన నిధులూ సమకూర్చడంలేదు. కనుక, ఏ వ్యాపారంపైనైనా సహేతుక నియంత్రణలు విధించవచ్చునంటున్న రాజ్యాంగంలోని 19 (6) అధికరణలను విద్యా సంస్థలకు వర్తింపచేయలేమని సుప్రీంకోర్టు ఈ సందర్భంగా తీర్పునిచ్చింది. అదేవిధంగా, అధికరణ 30 (1) ప్రకారం అల్ప సంఖ్యాక వర్గాలు విద్యాసంస్థలను నెలకొల్పి నిర్వహించుకోవచ్చును. అందువలన ఈ విద్యా సంస్థల్లో ప్రభుత్వ జోక్యం, నియంత్రణ ఉండనవసరం లేదని రాజ్యాంగ ధర్మాసనం ప్రకటించింది. ఈ తీర్పులో 'రిజర్వేషన్లు' ప్రధాన అంశంగా చోటుచేసుకోవడం సామాజిక వర్గాల వ్యతిరేకతకు మూలకారణమైంది. రాజకీయవర్గాలలో కూడా చర్చకు దారి తీసింది.

ఒకవైపు ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్లు కల్పించి అమలుచేయాలనే డిమాండ్ సామాజిక వర్గాలనుండి బలంగా ముందుకువస్తోంది. నానాటికీ ఆవర్గాలనుండి ఒత్తిడి పెరుగుతోంది. ప్రభుత్వాలు కూడా కాదనలేని అనివార్య పరిస్థితికి వచ్చాయి. ఇప్పటికే మహారాష్ట్ర ప్రభుత్వం ప్రైవేట్‌రంగంలో రిజర్వేషన్లు కల్పిస్తూ నిర్ణయం తీసుకుంది. యు.పి.ఎ. ప్రభుత్వం ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్లు కల్పిస్తామని ఎన్నికల ప్రణాళికలో ప్రకటించింది. మరోవైపున బడాపారిశ్రామికవేత్తలు, బహుళజాతి సంస్థలు ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్లను తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాయి. ప్రైవేట్‌రంగంలో రిజర్వేషన్లను అమలుపరిస్తే ఉత్పాదక సామర్థ్యం, దేశ అభివృద్ధి దెబ్బతింటుందని వాదిస్తున్నాయి. కనుక, ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్లను వర్తింపచేయరాదనీ, ఒకవేళ వర్తింపజేస్తే పెట్టుబడులను ఉపసంహరించుకుంటామని హెచ్చరిస్తున్నాయి.

ప్రపంచీకరణలో భాగంగా 90వ దశకంలో దేశంలో అమలవుతున్న నూతన ఆర్థికవిధానాలు, వాటి తాలూకు సంస్కరణలు పటిష్టవంతంగా, స్వేచ్ఛగా అమలు జరగడానికి పాలక ప్రభుత్వాలు న్యాయపరమైన అడ్డంకులు లేకుండా జాగ్రత్త వహిస్తున్నాయి. ఇందుకు గాను న్యాయస్థానాలను తమకనుకూలంగా ఉపయోగించుకుంటున్నాయి. మరోవైపున సాంఘిక ఆధిపత్యశక్తులు రిజర్వేషన్లను వ్యతిరేకిస్తున్నాయి. వాటిని రద్దుచేయలని ప్రభుత్వాలపై ఒత్తిడి తెస్తున్నాయి. ఈ పరిస్థితుల్లో దేశపు అత్యున్నత న్యాయస్థానం ప్రైవేట్, ప్రొఫెషనల్ విద్యాసంస్థల్లో రిజర్వేషన్ల విషయానికి సంబంధించి ఇచ్చిన తీర్పు సామాజికంగా వెనుకబడిన వర్గాలకు ప్రతికూలంగా ఉంది. దళిత, గిరిజన బలహీనవర్గాల విద్యా ప్రయోజనాలకు తీవ్రనష్టం కలిగిస్తోంది.

స్థూలంగా చెప్పాలంటే సామాజిక న్యాయానికే విఘాతం కలుగుతోంది. విద్యా, ఉపాధి రంగాలలో కొద్దో గొప్పో అవకాశాలకు వెసులుబాటుగా ఉన్న రిజర్వేషన్లను అచరణలో నీరు కార్చటానికి ఉపయోగపడుతోంది. ఈ నేపథ్యంలో సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పు స్థూలంగా సంపన్నవర్గాలకు, సాంఘిక ఆధిపత్య వర్గాలకు పోటీని నివారించడానికి, తద్వారా వారికే విద్యను పరిమితం చేయడానికి ఉపయోగపడుతుంది. రిజర్వేషన్లుకాదు, ఉపాధి కల్పనే లక్ష్యమంటూ బడుగు బలహీనవర్గాల వారికి తాము ఏ విధంగా దోహదపడదలచింది, రతన్ టాటా సారథ్యంలో 22 మంది సభ్యులతో కూడిన పారిశ్రామిక వేత్తల బృందం అపుడే విపులీకరించింది. ఎస్.సి, ఎస్.టి పిల్లలకు ఉపకారవేతనాలు, అయా పారిశ్రామిక సంస్థలు నిర్వహించే ప్రైవేట్ పాఠశాలల్లో ప్రవేశాలు, ప్రభుత్వ స్కూళ్లలో భాగస్వామ్యం, సంస్థల్లో వృత్తి విద్యా శిక్షణ, ఐ.టి.ఐ.లతో భాగస్వామ్యం వంటి వాటన్నింటికీ సంసిద్ధత తెలిపిన ప్రకటనపై అజీంప్రేమ్‌జీ, నారాయణమూర్తి, రాహుల్ బజాజ్, కుమార్ మంగళం, బిర్లా ప్రభృతులు సంతకాలు చేశారు. గత పదినెలలుగా పారిశ్రామిక వేత్తల చొరవను ఎస్.సి. ఎస్.టి అభ్యర్థులకు బహుళ ప్రయోజనకరంగా మలచలేకపోయిన ప్రభుత్వం ఇపుడు మళ్లీ రిజర్వేషన్ల పాట ఎత్తుకుంటోంది. కొత్త చట్టాన్ని రాజ్యాంగంలోని 9వ షెడ్యుల్‌లో చేరిస్తే కోర్టు కేసుల జంఝూటం ఉండదని కేంద్ర న్యాయశాఖ సూచిస్తోంది. తన చేతకాని తనాన్ని కప్పిపుచ్చుకునే ఇలాంటి యోచనలతో కేంద్రం బడుగుబలహీన వర్గాలకు నికరంగా అన్యాయం చేస్తోంది. ప్రభుత్వమే ఉద్యోగాల్లో ఎస్.సి., ఎస్.టి కోటాలను భర్తీ చేయకుండా చిరకాలంగా నానుస్తూ ఉన్నపుడు, ప్రైవేట్‌రంగం ఆ బాధ్యతలను నెత్తికెత్తు కోవాలనడంలోని ఔచిత్యం ప్రశ్నార్థకమవుతోందన్న 'నారిమన్' వాదన కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలను బోనెక్కించేదే అవుతుంది. దీపం పేరు చెబితే చీకటి తొలగిపోనట్లు, కేవలం కాగితాలమీద రిజర్వేషన్ల పరికల్పనతో సమాజంలోని బలహీనవర్గాలకు అభ్యున్నతి కలగదు. వారికి అసలైన మేలు తలపెట్టడంలో అడుగడుగునా పొడగడుతున్న ఏలికల నిర్లక్ష్యం క్షమించరానిది. ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్ల కల్పన - అమలు డిమాండ్‌ను, ఒత్తిడిని నివారించి క్రమంగా రిజర్వేషన్ల విధానాన్ని నీరుగార్చడానికి ఉపయోగపడుతుంది. దేశ విద్యారంగంలో 'ప్రజా ప్రభుత్వాల' బాధ్యతను, నియంత్రణను, జోక్యాన్ని, పూర్తిగా తొలగించి, ప్రైవేట్ విద్యాసంస్థలకు పూర్తి హక్కులను దాఖలు పరచడానికి ఉపయోగపడుతుంది. కావున, సుప్రీంకోర్టు తీర్పు సామాజిక వర్గాల ప్రాథమిక హక్కులకు విరుద్ధమైనది.

*(...మిగతా వచ్చే సంచికలో)*

**వచ్చే సంచికలలో...**

- **ఫోకస్ - జనవరి 2008 : ఆంధ్రప్రదేశ్ గ్రామీణాభివృద్ధి**
- **ఫోకస్ - ఫిబ్రవరి 2008 : మతోన్మాదం**
- **వలసాంధ్రలో స్త్రీల సంఘాలు - వివాదాస్పద శ్రీ విద్యార్థినీ సమాజ కథ - మహబూబ్ బాషా**
- **సోషలిస్ట్ రిజిస్టర్ - ఒక పరిచయం - మానేపల్లి**
- **ప్రపంచీకరణలో తాగునీటి ప్రైవేటీకరణ - డా. కె. రఘురాం రెడ్డి, టి. రాజేష్**

ఆర్థిక, సామాజిక, రాజకీయ, సాంకేతిక రంగాల్లో ఏ మాత్రం తీసిపోని మహిళలకు అంతటా వివక్షే ఎదురౌతోందని, హింసను అనుభవిస్తున్నారని అంటున్నారు **తట్ల సాంబలక్ష్మి, ధర్మారపు వీరవెంకులు**

# వర్తమాన సమాజంలో స్త్రీ

భారతదేశంలో సంఖ్యాపరంగా స్త్రీలు సమాజంలో సగ భాగమైనప్పటికీ తరతరాలుగా భారత స్త్రీ సామాజికంగా, ఆర్థికంగా అణచివేతకు గురవుతోంది. నేడు అన్ని విషయాల్లో, అన్ని స్థాయిల్లో పురుషుల కింద అణిగిమణిగి ఉండాల్సిన పరిస్థితి స్త్రీలది. ఆకాశంలో, అవనిలో అన్నింటిలో సగం మహిళలు అంటూ అందలమెక్కించి ఆ మాటను నామ మాత్రంగానే చేస్తోంది ఈ సమాజం. ఆర్థిక, సామాజిక, రాజకీయ, సాంకేతిక రంగాల్లో ఏ మాత్రం తీసిపోని మహిళలను, అవకాశాల్లో సమభాగం దక్కని పరిస్థితి ఉంది. ప్రపంచం అంతా ఓ కుగ్రామంగా మారుతున్న పరిస్థితుల్లో మనిషి నైతిక విలువల్ని మరిచిపోతూ, ధనవ్యామోహం మత్తులో మనుషులనే మరబొమ్మలు చేసి అంగడిలో అమ్ముకునే విష సంస్కృతి మనుషుల్లో ఎగబాకుతున్న రోజులివి. అనైతికత, పాశ్చాత్య వ్యామోహంతో పాటు ముఖాన రంగులు పూసే ప్రపంచీకరణ, మనిషిని మనిషిగా చూడలేని లక్షణం కొరలు చాస్తున్నటువంటి ఈ పతన ప్రస్థానంలో మహిళల పరిస్థితిని మరింత దిగజార్చుతోంది. చదువు, సంపద, అధికారం ఉన్నా - హింస, దౌర్జన్యం, అత్యాచారం, లైంగిక వేధింపులు వంటి సామాజిక సమస్యలను ఒక వైపు ఎదుర్కొంటూనే మరోవైపు కుటుంబపరమైన వేధింపులు స్త్రీని కృంగదీస్తున్నాయి. దశాబ్దాలు గడిచినా అవమానం, ఆత్మహత్యలు వంటి పరిస్థితుల నుండి మహిళ తప్పించుకోలేకపోతోంది.

ప్రస్తుతం దేశంలోని మహిళల పరిస్థితిని గమనిస్తే, ప్రతి మూడు నిమిషాలకు మహిళపై ఒక నేరం జరుగుతూ, ప్రతి తొమ్మిది నిమిషాలకు ఒక అబల అత్తింటి ఆరళ్లకు బలవుతోంది. అలాగే ప్రతి గంటకు ఒక మహిళ వరకట్న చావుకు గురవుతోందని గణాంకాలు తెలుపుతున్నాయి. గృహహింస, ఆత్మహత్యలు తదితర అంశాల్లో గత రెండు, మూడేళ్లలో మన రాష్ట్రం ద్వితీయ స్థానం చేరింది. 2003, 2004లో కంటే 2005లో మహిళలపై నేరాలు, వరకట్నపు చావుల గ్రాఫ్ పైపైకి ఎగబాకింది.

ఇక ప్రస్తుత సంవత్సరం విషయానికి వస్తే పది శాతం పెరుగుదల నమోదైంది. ఈ పరిస్థితుల్లో స్త్రీ విముక్తికై కొంత స్వాంతన చేకూర్చడానికి ప్రభుత్వం అనేక చట్టాలను అమలు చేస్తోంది. అయినప్పటికీ చెప్పుకోదగ్గ మార్పు కనిపించటం లేదు. ఇలాంటి చట్టాల్లో భాగమే ఇటీవలి కాలంలో 2006 అక్టోబర్ 26న వచ్చిన 'గృహ హింస నిరోధక చట్టం'; సెక్షన్ 2(ఎన్) సెక్షన్ -8, 2005 ప్రకారం మహిళా రక్షణ చట్టం; 1984 తర్వాత వివాహమైన వారికి 'తాతల ఆస్తిలో మనవరాలికి వాటా ఉండాలి' అంటూ 498 సెక్షన్ భారతీయ శిక్షాస్మృతి చట్టం ప్రకారం 'వరకట్న నిరోధక చట్టం', ఇవే కాకుండా మహిళలకు వర్తించే ప్రత్యేక ఆర్టికల్స్ వంటివి ముందుకు వచ్చాయి. వీటివల్ల అటు సమాజం నుండి ఇటు కుటుంబం నుండి ఎదుర్కొనే దౌర్జన్యం, హింసల నుండి తనను తాను కాపాడుకునేందుకు ఈ చట్టాలు ఉపయోగంగా ఉన్నా, చెప్పుకోదగ్గ మార్పు రాలేదనే చెప్పాలి.

మారుతున్న ప్రపంచ పరిస్థితుల్లో భాగంగా సాంకేతిక పరిజ్ఞానం కూడా పెరిగిపోతోంది. ప్రపంచీకరణ, సరళీకరణ, ప్రైవేటీకరణలతో కట్టుబాట్లు ఆచార వ్యవహారాలు, సంస్కృతి, నైతికతల దాస్య శృంఖలాలు ఛేదించుకొని విశృంఖలత్వం వైపుకు పయనిస్తూ మనిషి స్వార్థపరుడుగా మారే ఆస్కారం ఏర్పడింది. ఈ సమాజంలో స్త్రీ పురుషుల మధ్య సమానత్వం అనే భావన వెనక్కు పోయి అసమానత్వం, అణచివేత అనే భావన విజృంభిస్తోంది. స్త్రీని పురుషుడికి ఒక బానిసను చేసింది. ఆనాటి పరిస్థితి కంటే నేటి పరిస్థితి మరింత దిగజారి స్త్రీ అంటే పురుషుడికి ఓ ఆటవస్తువుగా మార్చింది. అందమే స్త్రీత్వ ప్రధాన అంశం అని ప్రచారం జరుగుతోంది. దేశ విదేశీ ఛానళ్ల జోరు, టివి సీరియళ్ల హోరు విపరీతంగా పెరిగింది. అశ్లీల నగ్ననృత్యాలు లోగడ విదేశీ ఛానల్‌లలోనే కనబడేవి. ఇప్పుడు దేశీయ ఛానల్‌లు వాటిని మించిపోయాయి. ఇక టివి సీరియళ్ల అంతరార్థాలు వందల నుండి వేల భాగాలుగా సాగదీస్తున్నారు. సంవత్సరాల పాటు పూర్తికాని కథలు ఇటు సినిమా తెర, అటు బుల్లితెర స్త్రీ నటుల యావత్ శరీరాన్ని ఎండేసి సొమ్ము చేసుకోవటంతో ఆగటం లేదు. ప్రత్యేకించి బుల్లితెర సీరియళ్లలో మోసం, కౄరత్వం, కుతంత్ర నైపుణ్యం, విద్వేష స్వభావ నాయకుల్ని సృష్టించి చూపిస్తున్నాయి.

స్త్రీల మధ్య సదావగాహన, సామరస్యాన్ని దెబ్బతీసే లక్షణమున్న అసూయలు, ద్వేషాలు టివి సీరియళ్ల నిర్మాతలకు అందివచ్చిన కథావస్తువులు అవుతున్నాయి. అత్తా-కోడళ్లు, వదిన-మరదళ్లు, తోటి కోడళ్లలో అంతర్లీనంగా ఉండే చిన్నరాగ ద్వేషాల్ని మితిమీరిన పగలుగా, ద్వేషాలుగా భూతద్దాల్లో చూపటం వల్ల అవి చూసే గృహిణులకు ఈ దుష్ట లక్షణాలన్నీ అప్రయత్నంగానే బుర్రకెక్కుతున్నాయి. ఫలితంగా కుటుంబ సహజ అప్యాయతలు నశించి, చిచ్చురగులుతోంది. ఇలాంటి సీరియళ్లని, సినిమాలని ఎంతో మంది మంచి మేధాసంపత్తి కల్గిన వ్యక్తులు, ఉద్యోగినులు కూడా చూస్తూ తమ సమయాన్ని వృథా చేసుకుంటున్నారు. ఇదొక వ్యసనంగా మారి సమాజాన్ని తలక్రిందులు చేస్తున్న సమస్య.

ఇక యువకులు ముఖ్యంగా విద్యార్థులు సినిమా, టివిలలో ప్రేమలు నిజమని నమ్మి, ప్రేమపిచ్చి తలకెక్కించుకొని హత్యలకూ, ఆత్మహత్యలకూ దిగుతుండడం సాధారణ విషయం అయిపోతోంది. పచ్చి స్వార్థంతో కేవలం లాభాలు పోగేసుకునే ఉద్దేశ్యంతో అవాస్తవిక సీరియళ్లను అనేక సంచలన కార్యక్రమాల చెత్తను సమాజం మీద గుమ్మరిస్తుంటే అత్యంత విలువైన

కాలాన్ని వెచ్చించి ఇవన్నీ కాలక్షేపం అనుకుంటూ చూడటం ఎంత అర్థరహితం. దీనికి బదులు సంగీతం, చిత్రలేఖనం వంటి లలిత కళల్ని, ఇతర హస్తకళల్ని నేర్చుకుంటే మహిళలకు ఆర్థిక స్వాతంత్ర్యంతోపాటు కొంత ఆత్మస్థైర్యం కూడా ఉంటుంది. ముఖాన రంగులద్దుకొని అందం వెంట పరుగులు తీసే సంస్కృతిలో, కట్టుబొట్టు సాంప్రదాయంగా సిగ్గుపడే వారికీ, వయసు మళ్లి ముడుతలు పడ్డ ముఖాలతో ఉండే నాయనమ్మలకు, అమ్మమ్మలకు చోటులేదు. వారు ఇప్పుడు కనుమరుగయ్యారు. మిలమిలలాడుతూ ఉండే యువతులే తల్లులకు ప్రతిరూపాలుగా చూస్తుంటే ప్రపంచమంతా అందాల పోటీల వైపు పరుగులు తీయక ఏం చేస్తుంది?అశ్లీల చిత్రాలతో అంగుళానికి ఒక్కొక్క మెట్టు ఎక్కుపెడుతూ, అంగాంగ ప్రదర్శనలే ప్రధానంగా చూపిస్తున్న ఫ్యాషన్ షోలు, వాణిజ్య ప్రకటనలు స్త్రీ చుట్టూ పరిభ్రమిస్తున్నాయి. ఇక విదేశీ సంస్కృతి పడక గదిలోకి నేరుగా దిగుమతి చేసే టివి ఛానల్‌లు రోజురోజుకూ పెరిగిపోతున్నాయి. మహిళలపై ఈ ప్రభావం తీవ్రంగా కనిపిస్తోందని నిర్మోహమాటంగా చెప్పవచ్చు. పదేళ్ల బాలుని నుంచి సహస్ర చంద్రదర్శనాలు పూర్తి చేసుకున్న పండు ముదుసలి వరకు మనుషులు వక్రమార్గాన్ని అనుసరిస్తున్న క్రమంలో, మహిళే ఆ హింసను భరించాల్సి వస్తోంది. చదువు, సాంప్రదాయం ఉన్నప్పటికీ స్వాతంత్ర్యంగా స్వేచ్ఛా వాయువులు పీల్చుకునే స్థితికి ఇంకా మహిళ ఎదగలేదు. పాశ్చాత్య పద్ధతులను అనుసరించటం వల్ల కూడా భారతీయ మహిళపై ఎంతటి ప్రభావాన్ని చూపుతుందో అర్థం చేసుకోవచ్చు.

స్త్రీ విద్యా, వ్యాపార, శాస్త్ర, సాంకేతిక రంగాల్లో, ఉద్యోగ రంగాల్లో గణనీయమైన స్థానాన్ని ఆక్రమిస్తోంది. అయినప్పటికీ సంప్రదాయికంగా తరతరాలుగా ఆచారాలనే బానిస సంకెళ్లను ఎదిరించి ఆత్మగౌరవంతో ముందంజలో ఉంటూ విద్యాపరంగా, సామాజికంగా, రాజకీయ రంగాల్లో కూడా తన శైలిలో మహిళ ప్రతిభను నిరూపించు కుంటోంది. అలాంటి వారిలో సునీతా విలియమ్స్ ఒకరు. ఆమె అంతరిక్షయానంలో సాధించిన విజయం కొనియాడ దగినది. అంతేకాకుండా భారతదేశంలో మొట్టమొదటిసారిగా 13వ రాష్ట్రపతిగా అత్యున్నతమైన సింహాసనాన్ని ఒక మహిళ అధిష్ఠించటం యావత్ భారతదేశంలోనే స్త్రీ జాతి గర్వించదగిన అంశం.

రాజకీయ రంగంలో కూడా పురుషుడి ఎత్తులను కొంత వరకు చిత్తు చేస్తూ స్త్రీ ముందుకు వెళ్తోంది. ఈ పోటీ ప్రపంచంలో అన్ని రంగాల్లో మహిళలు తమ నైపుణ్యంతో నిష్ణాతులుగా ఎదుగుతున్నప్పటికీ, దురదృష్టవశాత్తు ఇది కొంత మంది మహిళల వరకే పరిమితం అవుతోంది. అందుకే అందరూ అభ్యుదయాన్ని సాధించాలంటే తమ హక్కులను తెలుసుకొని పోరాడాల్సిన తరుణం ఆసన్నమైంది. మహిళల్లో చైతన్యం ఉన్నా, ఆచరణలో మాత్రం వెనుకబడిన స్థితి ఉంది. పుట్టబోయేది పాపని తెలియగానే తల్లి కడుపులో రూపు దిద్దుకుంటున్న ఓ పసి ప్రాణాన్ని భ్రూణహత్యకు పాల్పడుతూ కడుపు నుంచి కాటికి పంపుతున్న పరిస్థితులు ఈరోజు వందలాదిగా మన ముందు జరుగుతున్నాయి. ఇప్పటికీ మారని ఈ పరిస్థితి ఆధునిక మహిళను మరింత కుంగదీస్తోంది. సాంప్రదాయం, కట్టుబాట్లతో అవసానదశ వరకు అడుగడుగున అవమానిస్తూనే ఉంది ఈ సమాజం. పుట్టింది ఆడపిల్లగా అయినందుకు కళ్లు తెరిచి తెరవకముందే రక్తపు ముద్దలాంటి పసికందు ప్రాణాల్ని చెత్తకుప్పల పాలవుతున్న పరిస్థితి నుండి మహిళలకు రక్షణ కావాలి. ఈ పరిస్థితులు సమాజంలోని ప్రతి మహిళ దృష్టిలోకి రావాలి. అతి పిన్న వయస్సు బాలికలపై అత్యాచారాలు, యుక్త వయసులోనే ఈవ్ టీజింగ్స్, లైంగిక వేధింపులు, వెకిలి చేష్టలు పరిపాటిగా జరుగుతున్నాయి. మహిళలు అన్ని సమయాల్లో ఒంటరిగా బతకగల శక్తి, సామర్థ్యాలు ఉన్నా, అందుకు తగిన పరిస్థితులు పితృస్వామ్య సమాజంలో లేవు. శతాబ్దాలు మారిన మహిళ అన్ని స్థానాల్లో భౌతికంగా, మానసికంగా పురుషుడి కబంద హస్తాల్లో బందీగా ఉంటూ పురుషుడి అణచివేతకు గురవుతూనే ఉంది. అందుకే మహిళ మొదట విద్యావంతురాలు కావాలి. మహిళాభ్యుదయం, సాధికారత పెంచు కొనేందుకు అన్ని పరిస్థితుల్ని ధైర్యంగా ఆత్మగౌరవంతో ఎదుర్కోవాలి. స్త్రీ శ్రమలో భాగస్వామిగా ఉన్నప్పటికీ సమానంగా శ్రమ ఫలితాన్ని అందుకునే పరిస్థితుల్ని పురుషాధిక్యం విస్మరిస్తోంది. ఒకవైపు దేశంలో సర్వోన్నత శాసన నిర్మాణ సంస్థ అయిన పార్లమెంట్‌తో సహా చట్ట సభల్లో స్త్రీలకు 33 శాతం రిజర్వేషన్‌లు కల్పించాలనే బిల్లును ప్రభుత్వం పార్లమెంట్‌లో ప్రవేశపెట్టినా రాజకీయ రంగంలోని పురుషుల గుత్తాధిపత్యం, ఈ బిల్లుకు అనేకమంది అడ్డు తగులుతున్న తీరు పురుషుల ఆధిపత్యం మహిళలపై ఉన్నదని చెప్పడానికి ప్రబల నిదర్శనం. మరోవైపు మహిళా పార్లమెంట్ సభ్యులు దేశంలోని ప్రగతిశీల, వామపక్ష రాజకీయ పార్టీలు, మహిళా సంఘాలు మహిళా రిజర్వేషన్లు ఆమోదించాలనే అభిప్రాయాన్ని ఏకకంఠంతో నినదిస్తున్నా ప్రభుత్వ వైఖరిలో మార్పు లేదు. మహిళలు చట్ట సభల్లో అధికారాన్ని సాధించటంతో పాటు సమాజంలో ఆర్థికంగా, రాజకీయంగా, సామాజికంగా క్రియాశీలక భాగస్వామ్యం కూడా పొందటానికి ఇంకా ఎంతో పురోగమించాల్సి ఉంది.

సమాజంలో మహిళలపై జరుగుతున్న దౌర్జన్యాలనూ, అమానుషాలనూ ప్రతి మహిళ వ్యతిరేకించాలి. స్త్రీలపై జరిగే హింసా ధోరణులపై ధైర్యంగా పోరాడాలి. వ్యభిచార గృహాల్లో రక్తమాంసాలు అమ్మి సర్వస్వం కోల్పోయి అనారోగ్యాలతో అభాగ్యులుగా అధోగతి పాలయ్యేది ఒకరైతే, సొమ్ము చేసుకునేది మరొకరు. ఈ విధంగా జరుగుతున్న దౌర్జన్యాలను అరికట్టాలంటే ప్రతి మహిళ పోరాటానికి నడుం కట్టాల్సిందే. తన ఇంట్లో తాను కోల్పోతున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను తెలుసుకొని మహిళ అంటే ఎవరికి బానిస కాదు, స్వతంత్రంగా ఆలోచించి బతకగల శక్తి సామర్థ్యాలున్న మనిషి అని ఈ పురుషాధిక్య సమాజానికి తెలియజేయాలి.

మహిళలే ఈ సమస్యల్ని ఎందుకు ఎదుర్కొంటున్నారు. వాటికి గల కారణాలు ఏమిటి? అనే విషయాన్ని ఆలోచిస్తే ఈ రోజు మహిళల పరిస్థితి ఇంతకు దిగజార్చినది పురుషాధిక్యత ఒకటే కాదు, పెరుగుతున్న ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ కారణం. మనిషి కోరికలను, అవసరాలను మరింత పెంచుతున్నాయి. ఈ తరుణంలో స్త్రీలను మారకద్రవ్యకంగా మార్చుకుంటున్నారు. అన్ని రంగాల్లో స్త్రీలు అభివృద్ధి ఎంత సాధించారో అంతకన్నా ఎక్కువ మహిళల పరిస్థితి రోజురోజుకూ దిగజారిపోతోంది. మహిళలు మార్కెట్లో సరుకుగా అమ్ముడుపోతున్న కాలం మారి విశాఖపట్నం జిల్లాలోని వాకపల్లి, మహబూబ్‌నగర్ జిల్లాలోని సంఘటనలు పునరావృతం కాకుండా ఉండాలంటే ప్రతి స్త్రీలో మార్పు రావాలి. అన్ని విషయాల్ని క్షుణ్ణంగా ఆలోచించి ఏ ఒక్క మహిళ హింసా, దాడులకు గురైన దానిని ప్రతీ మహిళ ఖండించి, వ్యతిరేకించాలి. హింసకుపాల్పడిన వారిని శిక్షార్హులను చేసే వరకు హింసా వ్యతిరేక పోరాటానికి సిద్ధం కావాలి. ఈ రోజు సర్వోన్నతమైనటువంటి దేశ ప్రథమ మహిళగా గుర్తించే స్థానంలో ఒక మహిళ ఉండటం ఎంతో సంతోషించే విషయం అయినప్పటికీ మహిళాభ్యుదయం సాధించటంలో ఈ విజయం ఎంతవరకు ఉపయోగకరంగా ఉంటుందో వేచి చూడాల్సిన విషయమే. ◆

**పేదలలో అత్యధిక సంఖ్యాకులకు ఉన్న ప్రధాన వనరు శ్రమ శక్తే కాబట్టి పేదరికం తగ్గింపు చర్యలు సుస్థిరంగా సాగాలంటే వారికి ఉత్పాదక ఉద్యోగ కల్పనను విస్తరించడం ప్రధానమౌతుందంటున్నారు ఎస్. మహేంద్ర దేవ్**

# ఆంధ్రప్రదేశ్‌లో సమ్మిళిత అభివృద్ధి

*(.. గత సంచిక తరువాయి)*

## పేదరికం – ఉపాధి కల్పన

లక్డావాలా కమిటీ సంవిధానాన్ని అనుసరించి చూస్తే అధికారికంగా పేదరికం నిష్పత్తి గ్రామీణ ప్రాంతాల్లో అతి తక్కువగా 11 శాతంగాను, పట్టణ ప్రాంతాల్లో కాస్త ఎక్కువగా 26.6 శాతంగాను ఉంది. 1999-2000 కు సంబంధించిన ఈ గణాంకాలు దేశవ్యాప్తంగా 27 శాతంగాను, 23.6 శాతంగాను ఉన్నాయి. అంటే 1990లలో ఆంధ్రప్రదేశ్‌లో పట్టణ ప్రాంతాలలో పేదరికం నిష్పత్తి అధికారిక గణాంకాల ప్రకారం గ్రామీణ ప్రాంతాల కన్నా రెట్టింపుగా ఉందన్నమాట. కాని, తలసరి ఆదాయంలోనూ, వేతనాలలోనూ గ్రామీణ ప్రాంతాలకు, పట్టణ ప్రాంతాలకు మధ్య ఉన్న తేడాలతో చూస్తే ఈ అంకెలు వాస్తవ దూరంగా కనబడతాయి. అయితే ఆంగస్ డీటన్, జీన్ డ్రీజ్ వంటి నిపుణులైన శాస్త్రవేత్తలు వేసిన ప్రత్యామ్నాయ అంచనాల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో పేదరికం నిష్పత్తి జాతీయ స్థాయికి దరిదాపుల్లోనే ఉంది. అంటే, గ్రామీణ ప్రాంతాల్లో 26 శాతంగాను, పట్టణ ప్రాంతాల్లో 12 శాతంగాను ఉంది. బహుశా అధికారిక గ్రామీణ పేదరికపు గణాంకాలు అంత తక్కువగా ఉండటానికి కారణం దారిద్ర్య గణనకు ప్రాతిపదిక సంవత్సరం 1973-74 కావడం కావచ్చు. ఆ సంవత్సరం భారతదేశం లోని పెద్ద రాష్ట్రాలన్నిటిలోనూ ఆంధ్రప్రదేశ్‌లోనే దారిద్ర్యం అతి తక్కువగా ఉండింది. అందుకు కూడా కారణం ఏమంటే అప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయ కార్మికుల వినియోగ ధరల సూచి కూడా తక్కువగా ఉండేది. అందుకు భిన్నంగా డీటన్, డ్రీజ్‌లు వేసిన అంచనాలు జాతీయ సాంపిల్ సర్వే గణాంకాల ఆధారంగా వినియోగదారుల ధరలను లెక్క గట్టి వాటి ప్రాతిపదికపై రూపొందించిన వాస్తవిక దారిద్ర్యరేఖ ద్వారా వచ్చినవి.

పేదరికం ఎంత ఉన్నది అనే విషయంలో భిన్నాభిప్రాయాలు ఎలా ఉన్నప్పటికీ అటు అధికారిక అంచనాలు, ఇటు డీటన్, డ్రీజ్‌లు వేసిన అంచనాలు రాష్ట్రంలో 1980లకు 1990లకు మధ్య పేదరికం తగ్గిపోయిందని చూపెడుతున్నాయి. దేశ వ్యాప్తంగా కూడా ఇదే ధోరణి కనబడుతుంది.

అయితే 1999-2000 కు సంబంధించిన అంచనాలను జాతీయ సాంపిల్ సర్వే అంతకు ముందూ ఆ తర్వాతా ఇచ్చిన గణాంకాలతో పోల్చడానికి వీలు లేదని గుర్తించాలి. జాతీయ సాంపిల్ సర్వే 2004-05 సంవత్సరంలో వినియోగ వ్యయం గురించి అరవై ఒకటవ దఫా గణాంకాలను ఇటీవలనే విడుదల చేసింది. అదృష్టవశాత్తు ఈ దఫా గణాంకాలు 1993-94 గణాంకాలతో పోల్చదగినవిగా ఉన్నాయి. అందువల్ల 2004-05 సంవత్సరానికి పేదరికపు అంచనాలను లెక్క కట్టడం వీలు అవుతుంది. అలాగే ఈ అరవై ఒకటవ దఫా గణాంకాలు ప్రాతిపదిక సంవత్సరాలను కలగలపిన ఫలితాలను కూడా ప్రకటించాయి. అవి 1999-2000 గణాంకాలతో పోల్చడానికి వీలైనవి. ఈ గణాంకాలన్నిటి కలిపి చూసినప్పుడు పక్కన పట్టికలో చూపినట్టుగా గ్రామీణ పేదరికం 1983లో 27 శాతంగా ఉన్నదల్లా 2004-05 నాటికి 11 శాతానికి తగ్గిందని తేలుతుంది. అలాగే ఇదే కాల వ్యవధిలో పట్టణ పేదరికం 37 శాతం నుంచి 25 శాతానికి తగ్గింది. దేశ వ్యాప్త గణాంకాలతో పోల్చినప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో గ్రామీణ పేదరికం చాలా తక్కువ గాను పట్టణ పేదరికం దాదాపు సమానంగాను ఉన్నదని తేలుతుంది.

అధికారిక పద్ధతి ప్రకారం పేదరికం నిష్పత్తి (ఏకీకృత ప్రాతపదిక కాలం)

| | ఆంధ్రప్రదేశ్ | | | భారతదేశం | | |
|---|---|---|---|---|---|---|
| | గ్రామీణ | పట్టణ | మొత్తం | గ్రామీణ | పట్టణ | మొత్తం |
| 1983 | 27.31 | 37.49 | 29.75 | 45.76 | 42.27 | 44.93 |
| 1993-94 | 16.64 | 37.63 | 22.30 | 37.26 | 32.56 | 36.02 |
| 2004-05 | 10.85 | 25.41 | 14.80 | 29.18 | 26.02 | 28.27 |

మూలం : దేవ్ అండ్ రవి (2007)

ప్రాతిపదిక సంవత్సరాలను కలగలిపి పోల్చి చూసే పద్ధతి ప్రకారం గ్రామీణ, పట్టణ పేదరికపు నిష్పత్తులు 2004-05లో చాలా తక్కువగా 7 శాతం, 19 శాతంగా ఉన్నాయి.

డీటన్ ఉపయోగించిన ప్రత్యామ్నాయ అంచనాల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో గ్రామీణ పేదరికం 20.8 శాతం గాను, పట్టణ పేదరికం

అధికారిక పద్ధతి ప్రకారం పేదరికం నిష్పత్తి (సమీకృత ప్రాతపదిక కాలం)

| | ఆంధ్రప్రదేశ్ | | | భారతదేశం | | |
|---|---|---|---|---|---|---|
| | గ్రామీణ | పట్టణ | మొత్తం | గ్రామీణ | పట్టణ | మొత్తం |
| 1993-94 | 12.42 | 34.00 | 18.24 | 31.60 | 28.51 | 30.79 |
| 1999-00 | 11.28 | 27.91 | 15.78 | 27.50 | 24.33 | 26.62 |
| 2004-05 | 06.90 | 19.10 | 10.17 | 21.90 | 20.68 | 21.52 |

మూలం : దేవ్ అండ్ రవి (2007)

| పేదరికం శాతం : ప్రత్యామ్నాయ అంచనాలు | | | | |
|---|---|---|---|---|
| | ఆంధ్రప్రదేశ్ | | భారతదేశం | |
| | గ్రామీణ | పట్టణ | గ్రామీణ | పట్టణ |
| 1987-88 | 35.0 | 23.4 | 39.0 | 22.5 |
| 1993-94 | 29.2 | 17.8 | 33.0 | 17.8 |
| 1999-00 | 26.2 | 10.8 | 26.3 | 12.0 |
| 2004-05 | 20.9 | 08.4 | 23.1 | 10.2 |
| మూలం : దేవ్ అండ్ రవి (2007) | | | | |

8.4 శాతం గాను ఉంది. ఈ అంకెలు అఖిల భారత అంకెలకు దగ్గరగా ఉన్నాయి. అధికారిక అంచనాల లోను, ప్రత్యామ్నాయ అంచనాల లోను కూడా 1993-94 నుంచి 1999-2000 వరకు ఉండే మొదటి దశ కన్నా, 1999-2005 గా ఉండే రెండవ దశలో పేదరికం తగ్గుదల వేగంగా సాగింది.

కేంద్ర ప్రభుత్వం 2006లో ప్రకటించిన సచార్ కమిటీ నివేదిక జాతీయ సాంపిల్ సర్వే వినియోగ గణాంకాలను పరిగణనలోకి తీసుకొని సామాజిక మత వర్గాలలో పేదరికం నిష్పత్తిని అంచనా వేసింది. ఈ కమిటీ విభిన్నమైన దారిద్ర్య రేఖలను ఉపయోగించినందువల్ల దాని అంచనాలకు, ఇప్పటి వరకు ప్రస్తావించిన అంచనాలకు తేడా ఉంది. పక్కన పట్టిక సచార్ కమిటీ ఇచ్చిన అంచనాలను తెల్పుతుంది.

| సాంఘిక - మత తరగతిని బట్టి పేదరికం శాతం : 2004-05 | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | అందరూ | హిందువులు | | | | ముస్లింలు | ఇతర వెనుక బడినవారు |
| | | అందరూ | ఎస్.సి/ ఎస్.టి. | ఒ.బి.సి. | ఇతరులు | | |
| గ్రామీణ | 8 | 8 | 16 | 6 | 2 | 7 | 4 |
| పట్టణ | 26 | 25 | 41 | 27 | 11 | 35 | 16 |
| మూలం : సచార్ కమిటీ నివేదిక | | | | | | | |

వేరు వేరు సామాజిక మత వర్గాల మధ్య పేదరికం స్థాయి వేరు వేరుగా ఉండడాన్ని ఈ పట్టికలో గమనించవచ్చు. తమ జనాభాతో పోల్చినప్పుడు గ్రామీణ ప్రాంతాలలో 16 శాతంగా, పట్టణ ప్రాంతాలలో 41 శాతం పేదలుగా ఉన్న షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగలు అతి ఎక్కువ పేదరికాన్ని అనుభవిస్తున్నాయి. గ్రామీణ ప్రాంతాలలో 7 శాతంగా, పట్టణ ప్రాంతాలలో 35 శాతంగా ముస్లింలు ఆ తర్వాతి స్థానంలో ఉన్నారు. వెనుకబడిన కులాలలో ఉన్న పేదరికం మొత్తంగా జనాభాలో పేదరికం నిష్పత్తికి దగ్గరగానే ఉంది. పట్టణ ప్రాంతాలలో హిందూ జనాభాలో కన్న ముస్లిం జనాభాలో పేదరికం ఎక్కువగా ఉందని గుర్తించవలసి ఉంది.

వినియోగాలలో అసమానత గ్రామీణ ప్రాంతాలలోను, పట్టణ ప్రాంతాలలోను సంస్కరణల అనంతర దశలో గణనీయంగా పెరిగినట్టు కనబడుతుంది. ఇది కూడా గ్రామీణ ప్రాంతాలలో కన్న పట్టణ ప్రాంతాలలో ఎక్కువ పెరిగింది. ఈ దృశ్యం ఆంధ్రప్రదేశ్‌కూ అఖిల భారత స్థాయికీ సమానంగానే ఉంది.

సంస్కరణల అనంతర దశలో పేదరికాన్ని, పేదరికం తరుగుదలను విడదీసి చూసినప్పుడు అసమానతల వల్ల కలిగిన ప్రతికూల ప్రభావం పాత్ర కనబడుతుంది. పేదరికంలో మార్పులు వృద్ధి వల్ల జరిగాయా, పంపిణీలోపాల వల్ల జరిగాయా అని విడదీసి పరిశీలించినప్పుడు సంస్కరణల అనంతర దశలో పేదరికం తగ్గుదలకు వృద్ధి ఒక ముఖ్య కారణం. అయితే ప్రతికూల పంపిణీ పేదరికం తగ్గుదలను అడ్డుకున్నట్టు కనబడుతుంది. పంపిణీ గనుక అదే స్థాయిలో ఉన్నట్టయితే గ్రామీణ ప్రాంతాల్లో పేదరికం అదనంగా ఒక శాతంతగ్గి ఉండేది. పట్టణ ప్రాంతాలలో 5.46 శాతం తగ్గి ఉండేది.

పేదలకు ప్రతికూలంగా ఉండే ప్రధాన కారణాలలో ద్రవ్యోల్బణం కూడా ఒకటి. సగటు వార్షిక ద్రవ్యోల్బణం రేటు గ్రామీణ ప్రాంతాలలో 1983-94 కాలంలో 8.0 శాతంగా ఉండగా, 1993-2000 కాలంలో 8.3 శాతానికి పెరిగింది. కాని 2000-2005 కాలంలో అది విపరీతంగా తగ్గిపోయి 2.2 శాతానికి పడిపోయింది. పట్టణ ప్రాంతాలలో కూడా ఇదే ధోరణి కనబడింది.

1999-2005 మధ్య కాలంలో ఆంధ్రప్రదేశ్‌లోనూ మొత్తంగా దేశంలోనూ పేదరికం వేగంగా తగ్గిపోవడానికి కారణం తగ్గు ద్రవ్యోల్బణం, సాపేక్షికంగా తక్కువగా ఉన్న ఆహారపు ధరలు కావచ్చు.

తలసరి వ్యవసాయ స్థూల జాతీయోత్పత్తి ద్వారా వ్యక్తీకరించే వ్యవసాయాభివృద్ధి, భూ ఉత్పాదకత, శ్రమ ఉత్పాదకత, భూమి పంపిణీ, వ్యవసాయేతర స్థూల జాతీయోత్పత్తి వృద్ధి, సాపేక్షిక ఆహార ధరలు, ద్రవ్యోల్బణం రేటు, ఆహార నిల్వలు, ద్రవ్య లోటు, అభివృద్ధి వ్యయం, గ్రామీణ వ్యవసాయేతర ఉపాధి, మౌలిక సౌకర్యాలు, మానవాభివృద్ధి, స్త్రీ పురుష సమానత్వం, వికేంద్రీకరణ వగైరా కారణాలు పేదరికం విషయంలో నిర్ణాయకాలుగా పనిచేస్తాయని గ్రామీణ పట్టణ పేదరికాలలో ఉన్న తేడాలను ఈ కారణాల ద్వారా వివరించవచ్చునని అధ్యయనాలు తెల్పుతున్నాయి. పట్టణ జనాభాలో అందరికందరూ, గ్రామీణ జనాభాలో సగానికి ఎక్కువ తమ ఆహార అవసరాలను నికరంగా కొనుక్కుంటారు. అందువల్ల వ్యవసాయోత్పత్తుల ధరలు పెంచే విధానం ఏదీ వ్యవసాయాభివృద్ధిని పెంచడానికి ఉపయోగపడకపోవచ్చు. వ్యవసాయ ధరల పెరుగుదల కొంత కాల వ్యవధితో నైనా వేతనాల పెరుగుదలకు దారి తీస్తుంది. సంస్కరణల కాలంలో సాపేక్షిక ఆహార ధరలలో పెరుగుదల నుంచి పేదలను రక్షించవలసిన అవసరం ఉంది.

సంస్కరణల అనంతర కాలంలోని కొన్ని విధానాలు పేదరికం తగ్గింపు మీద ప్రతికూల ప్రభావం వేసాయి. వ్యవసాయాభివృద్ధిని మెరుగు పరిచే చర్యలు, స్థూలంగా పేదలకు అనుకూల విధానాలు, పారిశ్రామిక గ్రామీణ వ్యవసాయేతర రంగాల అభివృద్ధి, పట్టణాల పెరుగుదలలో ప్రణాళికా బద్ధ కృషి, పేదరిక వ్యతిరేక కార్యక్రమాల సామర్థ్యంలో పెరుగుదల, వ్యక్తులకు, సమూహాలకు, ప్రాంతాలకు మధ్య ఉన్న అసమానతల తగ్గింపు, మానవాభివృద్ధిలో భౌతిక సాధన సంపత్తిలో పెరుగుదల, స్త్రీ పురుష సమానత అభివృద్ధి, పాలనలో వికేంద్రీకరణ, మెరుగుదల వంటి అనేక చర్యలు గ్రామీణ, పట్టణ పేదరికాన్ని తగ్గించడానికీ, అసమానతను తగ్గించడానికీ అవసరమౌతాయి. షెడ్యూల్డ్

| ఆంధ్రప్రదేశ్‌లో ఉద్యోగ కల్పన పెరుగుదల | | | | |
|---|---|---|---|---|
| క్ర. సం. | పెరుగుదల కాలం | గ్రామీణ | పట్టణ | గ్రామీణ, పట్టణ |
| 1 | 1983 నుండి 2004-05 | 1.53 | 2.88 | 1.79 |
| 2 | 1983 నుండి 1993-94 | 2.44 | 4.01 | 2.72 |
| 3 | 1993-94 నుండి 2004-05 | 0.72 | 1.87 | 0.95 |
| 4 | 1993-94 నుండి 1999-2000 | 0.29 | 0.27 | 0.29 |
| 5 | 1999-2000 నుండి 2004-05 | 1.24 | 3.82 | 1.76 |
| మూలం : దేవ్ అండ్ రవి (2007) | | | | |

కులాలు, షెడ్యూల్డ్ తెగలు మొదలైన సామాజికంగా నిరాదరణకు గురైన వర్గాల స్థితి గతులను మెరుగు పర్చేందుకు తగిన విధానాలను సమ్మిళితాభివృద్ధిలో భాగంగా రూపొందించవలసి ఉంది.

## ఉద్యోగ కల్పన-ధోరణులు, సవాళ్లు

పేదలలో అత్యధిక సంఖ్యాకులకు ఉన్న ప్రధాన వనరు శ్రమ శక్తే కాబట్టి పేదరికం తగ్గింపు చర్యలు సుస్థిరంగా సాగాలంటే వారికి ఉత్పాదక ఉద్యోగ కల్పనను విస్తరించడం ప్రధానమౌతుంది. అయితే పెద్ద ఎత్తున వృద్ధి సాగినప్పటికీ అదంతా తప్పనిసరిగా ఉద్యోగ కల్పనకు దారి తీయనక్కర్లేదనే గుర్తింపు ఇటీవలి కాలంలో పెరుగుతోంది. ఆ వృద్ధి దిశ ఏమిటనేది అంటే అది శ్రమాధారితంగా సాగుతుందా, పెట్టుబడి ఆధారితంగా సాగుతుందా అనేది ఉద్యోగ కల్పనను నిర్ణయిస్తుంది.

మౌలికంగా ఉద్యోగ కల్పనలో నాలుగు అంశాలు ఉన్నాయి. మొదటిది ఉద్యోగ కల్పన పెరుగుదల రేటు. రెండవది నిజ వేతనాల ప్రమాణంతో చూసినప్పుడు ఉద్యోగ కల్పన స్వభావం, మూడవది రెండవ దానికే అనుబంధంగా సాగే ఉద్యోగ కల్పన వ్యవస్థలో ఉండే వైవిధ్యం. నాలుగవది ఉద్యోగ కల్పనను గుణంలోనూ, పరిమాణంలోనూ మెరుగు పర్చడానికి అవసరమైన చర్యలు. ఈ విధానాలలో శ్రామికుల మార్కెట్ సంస్కరణలు చాలా ముఖ్యమైన భాగం.

1983 నుంచి 2004-05 మధ్య దీర్ఘకాలికంగా చూసినప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో వార్షిక ఉద్యోగ కల్పన పెరుగుదల రేటు, గ్రామీణ, పట్టణ ప్రాంతాలను కలిపి మొత్తంగా చూసినప్పుడు 1.8 శాతంగా ఉంది.

ఈ దీర్ఘకాలిక వ్యవధిలో రెండు దశలు ఉన్నాయి. మొదటి దశ 1983 నుంచి 1994 వరకు సంస్కరణలకు ముందు దశ. రెండవది 1993 నుంచి 2005 వరకు సాగిన సంస్కరణల అనంతర దశ. ఆంధ్రప్రదేశ్‌లో ఉద్యోగ కల్పన పెరుగుదల సంస్కరణల పూర్వ దశలో 2.72 శాతం ఉన్నదల్లా, సంస్కరణల అనంతర దశలో 0.95 శాతానికి పడిపోయింది. ఈ తరుగుదల గ్రామీణ ప్రాంతాలలోనూ, పట్టణ ప్రాంతాలలోనూ ఉంది. కాగా సంస్కరణల అనంతర దశలో గ్రామీణ ప్రాంతాలలో ఉద్యోగ కల్పన పెరుగుదల కన్నా పట్టణ ప్రాంతాలలో ఉద్యోగ కల్పన పెరుగుదల రెట్టింపుగా ఉంది. సంస్కరణల అనంతర దశలో కూడా మళ్లీ రెండు దశలను చూసినట్టయితే ఉద్యోగ కల్పనలో ఒడిదుడుకులు [illegible]తాయి.

సంస్క[illegible] అనంతర దశలో 1993 నుంచి 2005 మధ్య దేశంలోని అన్ని రాష్ట్రాలలోనూ ఆంధ్రప్రదేశే అతి తక్కువ ఉద్యోగ కల్పన పెరుగుదలను (0.95 శాతం) నమోదు చేయడం ఆందోళన కలిగిస్తుంది. ఇదే సమయంలో దేశవ్యాపిత పెరుగుదల దాదాపు రెట్టింపుగా 1.89 శాతంగా ఉంది. ఆరు రాష్ట్రాలలో వార్షిక ఉద్యోగ కల్పన రేటు 2 శాతం కన్నా ఎక్కువగా ఉంది.

ఈ ఉద్యోగ కల్పనలో కూడా విభిన్న రంగాల పాత్రను విడదీసి చూడడం ఆసక్తికరంగా ఉంటుంది. సంస్కరణల అనంతర దశలో వ్యవసాయ రంగంలో ఉద్యోగ కల్పనలో ఏ పెరుగుదలా లేదు. మరొకవైపు వ్యవసాయేతర రంగంలో ఇదే కాలంలో ఉద్యోగ కల్పన పెరుగుదల మూడు శాతంగా ఉంది. ఉత్పత్తి రంగంలో

| భారతదేశంలో రాష్ట్రాలవారీగా ఉద్యోగ కల్పన పెరుగుదల | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్ర. సం. | రాష్ట్రం | గ్రామీణ | | | పట్టణ | | | గ్రామీణ-పట్టణ | | |
| | | 1993 -00 | 1999 -05 | 1993 -05 | 1993 -00 | 1999 -05 | 1993 -05 | 1993 -00 | 1999 -05 | 1993 -05 |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| 1 | ఆంధ్రప్రదేశ్ | 0.29 | 1.24 | 0.72 | 0.27 | 3.82 | 1.87 | 0.29 | 1.76 | 0.95 |
| 2 | అస్సాం | 1.30 | 3.65 | 2.36 | 3.55 | 3.32 | 3.45 | 1.56 | 3.61 | 2.48 |
| 3 | బీహార్, జార్ఖండ్ | 1.87 | 2.06 | 1.96 | -0.56 | 3.79 | 1.39 | 1.59 | 2.26 | 1.89 |
| 4 | గుజరాత్ | 2.02 | 1.85 | 1.94 | 7.17 | 4.40 | 5.90 | 3.34 | 2.61 | 3.01 |
| 5 | హర్యానా | 0.76 | 5.68 | 2.97 | 1.94 | 5.33 | 3.47 | 1.06 | 5.59 | 3.09 |
| 6 | హిమాచల్ ప్రదేశ్ | -0.12 | 2.26 | 0.96 | 1.59 | 9.94 | 5.30 | -0.01 | 2.82 | 1.27 |
| 7 | కర్ణాటక | 0.13 | 3.06 | 1.45 | 3.31 | 3.39 | 3.35 | 0.94 | 3.15 | 1.94 |
| 8 | కేరళ | 1.27 | 1.62 | 1.43 | 1.20 | 0.62 | 0.93 | 1.25 | 1.37 | 1.32 |
| 9 | ఎం.పి., ఛత్తీసగడ్ | 0.68 | 2.15 | 1.35 | 2.87 | 4.57 | 3.64 | 1.06 | 2.62 | 1.76 |
| 10 | మహారాష్ట్ర | 0.39 | 2.54 | 1.36 | 2.05 | 4.78 | 3.28 | 0.93 | 3.32 | 2.01 |
| 11 | ఒరిస్సా | 0.59 | 2.37 | 1.39 | -0.20 | 3.44 | 1.44 | 0.49 | 2.49 | 1.40 |
| 12 | పంజాబ్ | 1.96 | 2.22 | 2.08 | 5.13 | 3.54 | 4.40 | 2.85 | 2.62 | 2.74 |
| 13 | రాజస్థాన్ | 0.50 | 2.64 | 1.46 | 1.11 | 3.94 | 2.38 | 0.61 | 2.88 | 1.63 |
| 14 | తమిళనాడు | -1.36 | -0.35 | -0.90 | 6.84 | 4.58 | 5.81 | 1.12 | 1.56 | 1.32 |
| 15 | యు.పి.,ఉత్తరాంచల్ | 0.61 | 3.64 | 1.98 | 0.65 | 4.40 | 2.34 | 0.62 | 3.79 | 2.05 |
| 16 | పశ్చిమ బెంగాల్ | 0.37 | 2.96 | 1.54 | 0.53 | 3.43 | 1.84 | 0.42 | 3.10 | 1.63 |
| | **భారతదేశం** | **0.71** | **2.45** | **1.50** | **2.36** | **4.14** | **3.16** | **1.09** | **2.86** | **1.89** |
| మూలం : దేవ్ అండ్ రవి (2007) | | | | | | | | | | |

ఈ పెరుగుదల 2.5 శాతంగా ఉంది. నిర్మాణ రంగం, ద్రవ్య వ్యవహారాల రంగం, రవాణా రంగం, సమాచార సంబంధాల రంగాలలో వార్షిక పెరుగుదల చాలా ఎక్కువగా అయిదు శాతం పైన నమోదైంది.

పేదరికం తగ్గింపుకి గ్రామీణ వృత్తుల వైవిధ్యపూరితమైన విస్తరణ చాలా ముఖ్యం. ఈ దృష్టితో చూసినప్పుడు 1999-2000 నుంచి 2004-05 మధ్య ఆంధ్రప్రదేశ్‌లో గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయేతర ఉద్యోగాల వాటాలో మెరుగుదల ఉంది. ఈ వాటా 21 శాతం నుంచి 28 శాతానికి పెరిగింది. అయితే దీన్ని మరొక వైపు నుంచి చూస్తే గ్రామీణ ప్రాంతాలలో ఇంకా 72 శాతం మంది శ్రామికులు తమ జీవనోపాధి కొరకు వ్యవసాయం మీదనే ఆధార పడవలసిన స్థితి ఉన్నదని తేలుతుంది. అట్లాగే ఇదే కాలంలో మొత్తం మీద ఉద్యోగాలలో వ్యవసాయేతర రంగపు వాటా 34.6 శాతం నుంచి 41.5 శాతానికి పెరిగింది.

అయితే ఇక్కడ ఒక విచారకరమైన అంశం ఏమంటే 1993-2000 కాల వ్యవధితో 1999-2005 కాల వ్యవధిని పోల్చి చూసినప్పుడు నిరుద్యోగం పెరిగింది. నిజ వేతనాల పెరుగుదలలో తగ్గుదల ఉంది. అస్సాం, బీహార్, కేరళ, మధ్యప్రదేశ్, పంజాబ్ రాష్ట్రాలు ఆంధ్రప్రదేశ్ కన్నా ఎక్కువ నిజ వేతనాలు నమోదు చేసుకున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో ఉద్యోగాల పరిమాణం గురించి, గుణం గురించి కూడా ఆందోళన పడవలసి ఉంది. స్థూల రాజకీయార్థిక విధానాలను విశ్లేషించి చూసినప్పుడు సంస్కరణల అనంతర దశలో విధానాలు ఉద్యోగ కల్పనకు అనుకూలంగా లేవు. ద్రవ్య, ఆర్థిక, వ్యాపార సరళీకరణ విధానాలు మరింతగా ఉద్యోగాలకు అనుకూలంగానూ, పేదలకు అనుకూలంగానూ ఉండి ఉండవలసింది.

**ఆంధ్రప్రదేశ్‌లో రంగాన్ని బట్టి ఉద్యోగ కల్పన పెరుగుదల**

| రాష్ట్రం | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | 1993 2000 | 2000 2005 | 1993 2005 | 1993 2000 | 2000 2005 | 1993 2005 |
| **గ్రామీణ** | | | | | | |
| వ్యవసాయం | 0.57 | -0.61 | 5.03 | 0.19 | -0.63 | -0.18 |
| వ్యవసాయేతర | 1.08 | 6.92 | 3.69 | 0.69 | 7.18 | 3.59 |
| గనులు | 2.68 | 7.20 | 4.71 | 2.55 | 9.79 | 5.78 |
| ఉత్పాదకం | -2.76 | 9.75 | 2.74 | -3.14 | 10.31 | 2.76 |
| విద్యుత్ | 0.68 | 1.20 | 0.92 | 0.29 | 1.24 | 0.72 |
| నిర్మాణం | 4.88 | 9.43 | 6.92 | 4.70 | 9.79 | 6.98 |
| వాణిజ్య | 1.05 | 8.78 | 4.49 | 0.66 | 8.82 | 4.29 |
| రవాణా, కమ్యూనికేషన్ | 9.99 | 11.01 | 10.45 | 9,57 | 10.22 | 9.86 |
| ఆర్థిక | 0.68 | 16.25 | 7.48 | 0.29 | 16.29 | 7.27 |
| సేవ | 1.82 | -0.87 | 0.59 | 1.45 | -0.87 | 0.39 |
| అన్ని | **0.68** | **1.20** | **0.92** | **0.29** | **1.24** | **0.72** |
| **పట్టణ** | | | | | | |
| వ్యవసాయం | -7.23 | 5.1 | -1.81 | -8.45 | 4.9 | -2.61 |
| వ్యవసాయేతర | 1.69 | 3.9 | 2.68 | 1.60 | 3.70 | 2.55 |
| గనులు | -13.65 | 17.9 | -0.50 | -11.47 | 13.4 | -0.92 |
| ఉత్పాదకం | 0.95 | 3.9 | 2.28 | 0.62 | 3.9 | 2.11 |
| విద్యుత్ | -11.79 | -13.4 | -12.53 | -12.08 | -13.6 | -12.76 |
| నిర్మాణం | 6.89 | -1.3 | 3.10 | 6.74 | -1.4 | 2.98 |
| వాణిజ్య | 4.55 | 3.8 | 4.23 | 4.59 | 3.2 | 3.93 |
| రవాణా, కమ్యూనికేషన్ | 1.14 | 7.9 | 4.14 | 1.21 | 8.0 | 4.23 |
| ఆర్థిక | 7.01 | 7.3 | 7.12 | 7.28 | 6.6 | 6.98 |
| సేవ | -1.96 | 3.5 | 0.47 | -2.19 | 3.8 | 0.50 |
| అన్ని | **0.60** | **4.0** | **2.13** | **0.27** | **3.82** | **1.87** |
| **మొత్తం** | | | | | | |
| వ్యవసాయం | 0.29 | -0.44 | -0.04 | -0.15 | -0.45 | -0.29 |
| వ్యవసాయేతర | 1.38 | 5.43 | 3.20 | 1.15 | 5.48 | 3.09 |
| గనులు | -2.01 | 9.43 | 3.03 | -1.86 | 10.60 | 3.62 |
| ఉత్పాదకం | -1.20 | 7.25 | 2.56 | -1.55 | 7.59 | 2.50 |
| విద్యుత్ | -7.50 | -5.68 | -6.68 | -7.80 | -5.69 | -6.85 |
| నిర్మాణం | 5.96 | 4.05 | 5.09 | 5.80 | 4.17 | 5.06 |
| వాణిజ్య | 2.94 | 6.07 | 4.35 | 2.77 | 5.73 | 4.11 |
| రవాణా, కమ్యూనికేషన్ | 4.29 | 9.25 | 6.51 | 4.29 | 8.98 | 6.39 |
| ఆర్థిక | 5.77 | 8.95 | 7.20 | 5.87 | 8.48 | 7.05 |
| సేవ | 0.04 | 1.13 | 0.53 | -0.25 | 1.28 | 0.44 |
| అన్ని | **0.66** | **1.77** | **1.17** | **0.29** | **1.76** | **0.95** |

మూలం : దేవ్ అండ్ రవి (2007)

సంస్కరణల అనంతర దశలో అతి పెద్ద వైఫల్యాలలో ఒకటి మౌలిక సౌకర్యాల కల్పనకు ప్రజా ధనం పెట్టుబడులు తగినంతగా లేకపోవడం.

అరవై శాతానికి పైన శ్రామికులు వ్యవసాయ రంగంలో ఉండగా పేదరికాన్ని నిర్మూలించడం కష్టం. గ్రామీణ, వ్యవసాయేతర రంగాన్ని అభివృద్ధి చేయవలసిన ఆవశ్యకత సుస్పష్టమే. ఈ లక్ష్యం సాధించాలంటే వ్యవసాయ రంగంలో నాలుగు శాతం పెరుగుదల, ఉత్పాదక రంగంలో పది శాతం పెరుగుదల ఉండడం అవసరం.

భారతదేశంలో వ్యవసాయేతర కార్యకలాపాలలో శ్రామికుల శాతం

| రాష్ట్రం | గ్రామీణ | | | అన్ని | | |
|---|---|---|---|---|---|---|
| | 1993 1994 | 1999 2000 | 2004 2005 | 1993 1994 | 1999 2000 | 2004 2005 |
| 1 ఆంధ్రప్రదేశ్ | 20.70 | 21.2 | 28.2 | 32.9 | 34.6 | 41.5 |
| 2 అస్సాం | 20.80 | 32.3 | 25.7 | 29.0 | 39.8 | 34.0 |
| 3 బీహార్ | 15.70 | 19.4 | 24.3 | 24.9 | 26.9 | 31.2 |
| 4 గుజరాత్ | 21.30 | 20.2 | 22.7 | 37.7 | 40.5 | 45.1 |
| 5 హర్యానా | 28.10 | 31.5 | 35.9 | 43.4 | 47.2 | 49.7 |
| 6 హిమాచల్ ప్రదేశ్ | 19.70 | 26.4 | 30.4 | 23.4 | 30.4 | 35.9 |
| 7 కర్నాటక | 18.80 | 17.9 | 19.0 | 34.3 | 37.5 | 39.3 |
| 8 కేరళ | 43.60 | 51.7 | 58.0 | 51.5 | 61.5 | 64.5 |
| 9 మధ్యప్రదేశ్ | 10.20 | 12.9 | 16.4 | 22.3 | 26.1 | 30.8 |
| 10 మహారాష్ట్ర | 17.40 | 17.4 | 20.0 | 40.8 | 43.7 | 46.8 |
| 11 ఒరిస్సా | 19.10 | 21.8 | 31.0 | 26.9 | 29.3 | 37.6 |
| 12 పంజాబ్ | 25.30 | 27.4 | 33.1 | 42.6 | 46.7 | 52.4 |
| 13 రాజస్థాన్ | 20.10 | 22.3 | 27.1 | 31.3 | 34.0 | 38.3 |
| 14 తమిళనాడు | 29.50 | 32.1 | 34.6 | 44.8 | 53.6 | 58.7 |
| 15 ఉత్తరప్రదేశ్ | 20.00 | 23.8 | 26.9 | 32.2 | 36.5 | 39.1 |
| 16 పశ్చిమ బెంగాల్ | 36.70 | 36.4 | 37.3 | 52.8 | 53.3 | 54.3 |
| భారతదేశం | 21.60 | 23.7 | 27.3 | 36.0 | 39.6 | 43.3 |

మూలం : దేవ్ అండ్ రవి (2007)

అత్యధికులుగా ఉన్న తక్కువ ఉత్పాదక, తక్కువ వేతన రంగంలో పనిచేస్తున్న అసంఘటిత శ్రామికులకు జీవనోపాధిని, భద్రతను కల్పించడం మరొక ముఖ్యమైన సవాలు. ఈ రంగంలో పనిచేసే శ్రామికుల ఉత్పాదకతను మెరుగుపర్చడానికి వారి అనిశ్చిత స్థితిని, ఇబ్బందులను తగ్గించడానికి చాలా చర్యలు తీసుకోవల్సి ఉంది. ఒకే ప్రాంతంలో పని కల్పించడం, శిక్షణ ఇవ్వడం, వారి నైపుణ్యాలు పెంచడం, పరపతి సౌకర్యాలు పెంచడం, సాంకేతిక పరిజ్ఞానాన్ని అందించడం, సామాజిక భద్రత కల్పించడం అవసరం. పేద శ్రామికుల సమస్య ఆంధ్రప్రదేశ్‌లో ప్రధానమైన సమస్య.

## ప్రత్యక్ష ఉపాధి కార్యక్రమాలు

ఆంధ్రప్రదేశ్‌లో ప్రత్యక్ష ఉపాధి కార్యక్రమాలలో స్వయం ఉపాధి పథకాలు, వేతన ఉపాధి పథకాలు చాలా ముఖ్యమైనవి. ఈ పథకాలకు ఎన్నో సమస్యలు ఉన్నప్పటికీ లబ్ధిదారుల విషయంలోనూ, సమర్థమైన వ్యయ నిర్వహణ విషయంలోనూ సమస్యలు ఉన్నప్పటికీ ఈ పథకాలు పేదరికపు తీవ్రతను తగ్గించడంలోనూ, పేదరికం పెరగకుండా అడ్డుకోవడంలోనూ గణనీయంగా ఉపయోగపడ్డాయి.

స్వయం సహాయ బృందాల ఉద్యమం మొత్తంగానే దేశవ్యాప్తంగా విస్తరిస్తోంది. ఉదాహరణకు నాబార్డ్ ఆధ్వర్యంలో సాగుతున్న స్వయం సహాయ బృందాల - బ్యాంకుల అనుబంధ కార్యక్రమం కింద ఇరవై రెండు లక్షల బృందాలు ఏర్పడ్డాయి. మూడు కోట్లమందికి పరపతి సౌకర్యం దొరికింది. దేశం మొత్తం మీద ఉన్న ఈ స్వయం సహాయ బృందాలలో అతి ఎక్కువ ఆంధ్రప్రదేశ్‌లోనే ఉన్నాయి.

పేదరిక నిర్మూలన కార్యక్రమాలలో దేశం మొత్తం మీద రెండు ముఖ్యమైన నమూనాలు ఉన్నాయి. అవి ఒకటి కేరళ నమూనా, మరొకటి ఆంధ్రప్రదేశ్ నమూనా. కేరళలో అమలు అవుతున్న 'కుడుంబశ్రీ' కార్యక్రమం మొత్తంగా పేదరికాన్ని తగ్గించడంలో చెప్పుకోదగిన ప్రగతి సాధించింది. ఈ కార్యక్రమంద్వారా జరిగిన జోక్యాలు, క్రమాలు, మహిళా సభ్యుల సాధికారత పెంపొందడానికి దారి తీసాయి.

అదే విధంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం కూడా సాంఘిక సమీకరణ, గ్రామీణ పేద మహిళల సాధికారత పునాదిగా రాష్ట్ర వ్యాప్తంగా ఒక గ్రామీణ పేదరిక నిర్మూలన కార్యక్రమాన్ని అమలు జరుపుతోంది. ఈ కార్యక్రమాన్ని 'వెలుగు' లేదా 'ఇందిరా క్రాంతిపథం' అని పిలుస్తున్నారు. ఈ పథకం పేద ప్రజల ఆస్తులను, సామర్థ్యాలను, శక్తిని మెరుగుపరిచి తద్వారా వారు ఎటువంటి ప్రతికూల పరిస్థితిని అయినా ఎదుర్కొనేలా తయారు చేస్తోంది. ఈ పథకం వల్ల కుటుంబ స్థాయిలోనూ, సామాజిక స్థాయిలోనూ మహిళల సాధికారత మెరుగుపడింది.

వేతన ఉపాధి కార్యక్రమాలలో గ్రామీణ జాతీయ ఉపాధి హామీ పథకం చాలా ముఖ్యమైనది. క్షేత్ర స్థాయిలో కొన్ని సమస్యలు ఉన్నప్పటికీ ఈ పథకం పనితీరు మీద సాధారణంగా సానుకూలమైన నివేదికలే వెలువడుతున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో మహబూబ్‌నగర్ జిల్లాలో ఈ పథకం వల్ల వలసలు తగ్గాయని సమాచారం ఉంది. ఈ పథకం పని తీరును ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ సహాయంతో పర్యవేక్షిస్తుండడం వల్ల, సామాజిక పరిశీలన వల్ల, పోస్ట్ ఆఫీసుల ద్వారా వేతనాలు ఇవ్వడం ద్వారా ఆంధ్రప్రదేశ్‌లో ఈ పథకం సాపేక్షికంగా మెరుగ్గా పనిచేస్తోంది. రాజకీయ చిత్తశుద్ధి ఉంటే ఈ పథకాన్ని కొత్త దృక్పథంతో సమర్థంగా నిర్వహించడం సాధ్యమే. లబ్ధిదారుల భాగస్వామ్యం, సామాజిక సమీకరణ, సమాచార హక్కు, పౌరసమాజపు సహకారం, పంచాయితీ రాజ్ సంస్థల తోడ్పాటు వంటి కొత్త దృక్పథం తీసుకుంటే ఇటువంటి ప్రత్యక్ష కార్యక్రమాలు మెరుగు పర్చడం సాధ్యమే.

ఆర్థిక వ్యవస్థలో శ్రామికుల మార్కెట్ సంస్కరణలు తీసుకువస్తే వాటి ప్రభావం ఉపాధి కల్పన మీద ఎలా ఉంటుందనే విషయమై చాలా చర్చ జరిగింది. భారతీయ అనుభవమే చూస్తే సంస్కరణల అనంతర దశలో భారతీయ పరిశ్రమలు తమ శ్రామిక జనాభాను సరళీకరణకు అనుగుణంగా సంస్కరించుకుంటున్నాయని అర్థమౌతుంది. శ్రామికుల రంగంలో ఇంకా ఎక్కువ సంస్కరణలకు, వెసులుబాటుకు వెళ్లేముందు అసంఘటిత రంగంలోని అసంఖ్యాక శ్రామికులకు సామాజిక భద్రత, ప్రయోజనాలు కల్పించవలసి ఉంటుంది.

*(... మిగతా వచ్చే సంచికలో)*

భౌతికవాద దృక్పథం ఉన్నవారికి మాత్రమే ప్రకృతిని గురించీ, మనుషుల స్థానం గురించీ సరైన అవగాహన ఏర్పడుతుందని అంటున్నారు **కొడవటిగంటి రోహిణీ ప్రసాద్**

# విశ్వంలో మనిషి స్థానం

మనిషిని ప్రపంచంలో అత్యున్నత జాతికి చెందిన ప్రాణిగా భావిస్తారు. తక్కిన ప్రాణుల్లో కొన్ని 'ఉన్నతమైనవీ', కొన్ని తక్కువజాతివీ అనే భావన ఉంది. నిజానికి ఈ హెచ్చుతగ్గులకు ఆధారాలున్నాయని చెప్పలేం. ఎందుకంటే పోల్చటానికి మన భూగ్రహం మీద తప్ప మరెక్కడా ప్రాణులున్న దాఖలాలే లేవు. తాత్విక ధోరణిని అవలంబిస్తామనుకునే వాళ్లు సామాన్యంగా ఎనిమిదో శతాబ్దానికి చెందిన ఏ ఆదిశంకరుణ్ణో ప్రామాణికంగా తీసుకుంటారు. అయితే నిజమైన జ్ఞానాన్ని పొందడానికి సమకాలీనమూ, ఆధునికమూ అనిపించే సమాచారాన్ని పరిగణనలోకి తీసుకుని తీరాలి కనుక మనం కళ్లు మూసుకుని ధ్యానం చేస్తూ కూర్చుంటే జరగదు. ఖగోళ పరిశోధనలు విస్తృతంగా జరుగుతున్న ఈ రోజుల్లో భూమి సూర్యుడి చుట్టూ తిరిగే అనేక గ్రహాల్లో ఒకటిని అందరికీ తెలుసు. ఇటువంటి సమాచారం దృష్ట్యా విశ్వంలో భూమిదీ, దానిమీద మనుషులదీ స్థానం ఎటువంటిదో చూద్దాం.

సూర్యుడు పాలపుంత అనే గేలక్సీలో ఒక నక్షత్రం. ఈ నక్షత్ర సముదాయం చాలా పెద్దది. దాని కొలతలకి కిలోమీటర్లు చాలవు. కాంతి సంవత్సరాలు కావాలి. సెకండుకు 186 వేల మైళ్లు ప్రయాణించే కాంతి కిరణాలు ఒక సంవత్సరం పాటు ప్రసరిస్తే తొమ్మిదిన్నర లక్షల కోట్ల కిలోమీటర్లు వెళతాయి. అందువల్ల ఒక కాంతి సంవత్సరం అంటే దాదాపు పది లక్షల కోట్ల కిలోమీటర్లు. ఈ లెక్కన చూస్తే సర్పిలాకారంలో ఉండే పాలపుంత అడ్డుకొలత లక్ష కాంతి సంవత్సరాలు. దీని ఒక అంచునుంచి రెండో అంచుకు చేరడానికి కాంతికే లక్ష సంవత్సరాలు పడుతుంది. ఇది మధ్యలో ఇడ్లీలాగా ఉబ్బి ఉంటుంది. కేంద్రం వద్ద దీని మందం పదివేల కాంతి సంవత్సరాలు. భూమి చుట్టుకొలత నలభై వేల కిలోమీటర్లు మాత్రమే కనుక మనిషికి ఈ దూరాలు ఊహించరానంత పెద్దవి. ఈ బ్రహ్మాండమైన చక్రం ఒకసారి గుండ్రంగా తిరగడానికి ఇరవై కోట్ల సంవత్సరాలు పడుతుంది. విశ్వంలో పాలపుంతవంటి గేలక్సీలు దాదాపుగా వందకోట్లున్నాయి. ఒక్క పాలపుంతలోనే సుమారు వందకోట్ల నక్షత్రాలున్నాయి. వాటిలో చిన్నవీ, మన సూర్యుడి కన్నా చాలా పెద్దవీ అనేకం. సూర్యుడు ఒక సగటు సైజు నక్షత్రం. పాలపుంత వెలపలి అంచులు రెండూ వంపు తిరిగిన బాహువుల్లా ఉంటాయి. అందులో ఒక అంచున వెతికితే కాని కనబడనంత సామాన్యమైన నక్షత్రం 'కోటి ప్రభలతో వెలిగే' మన సూర్యుడు.

మన పాలపుంత గేలక్సీకి సమీపంలో ఇతర నక్షత్ర సముదాయాలు ఇరవై ఉన్నాయి. ఇవన్నీ ఒక జట్టు. ఇవన్నీ కలిసికట్టుగా కదులుతూ ఉంటాయి. 'మన' జట్టుకు చెందినదైన మృగశిర రాశిలోని ఆండ్రోమెడా గేలక్సీ పాలపుంతలాగే పెద్దది. ఇది కాక చిన్నవి కొన్ని ఉన్నాయి. ఇలాంటి మరొక గుంపు కన్యారాశిలో ఉంది. అందులో వేలకొద్దీ గేలక్సీలున్నాయి. మరొక విశేషమేమిటంటే ఇటువంటి 'స్థానిక' జట్లు కొన్ని మహా సముదాయాలుగా కనిపిస్తాయి. ఈ మహాసముదాయాలలో కొన్నిటి అడ్డుకొలత ముప్ఫై కోట్ల కాంతి సంవత్సరాలు ఉంటుందని తెలుస్తోంది. కారణమేమిటో సరిగ్గా తెలియదు గాని విశ్వంలోని పదార్థరాశి అంతా ఇలా మహాసముదాయాల రూపంలో వ్యాప్తమై ఉంది. పైన చెప్పినట్టుగా వీటిలో చిన్న చిన్న జట్లు, ఒక్కొక్క జట్టులోనూ చిన్నా, పెద్దా గేలక్సీలూ, గేలక్సీల్లో వందల కోట్ల నక్షత్రాలూ, వాటిలో కొన్నిటి చుట్టూ తిరిగే గ్రహాల్లో కొన్నిటి మీద జీవరాశి పెరిగే పరిస్థితులూ కనిపిస్తాయి. 'పై' నుంచి మన పాలపుంతను ఎవరైన చూడగలిగితే సూర్యుణ్ని గుర్తుపట్టడమే కష్టం అవుతుంది. విశ్వం సంగతి అలా ఉంచి. మన పాలపుంతలోనే మన సూర్యుడికి గాని, మనకు గాని ప్రత్యేకమైన స్థానం ఏదీ లేదనేది స్పష్టం. 'సృష్టి'లో మనం చాలా గొప్పవాళ్లమనుకునేవారికి అహం ఏదైనా ఉంటే అది అసమంజసమనే అనాలి.

ఒక శతాబ్దం క్రితం దాకా మనిషికి కాలినడకా, మచ్చిక జంతువులూ, తెరచాప పడవలే రవాణాకు పనికొచ్చాయి. దూరాలని 'జయించడం' ఆధునిక పరిణామమే. అయినా 'పృథివి దాటితే' అన్నీ ఇబ్బందులే. మన సౌరకుటుంబం 'పెరడు'ను దాటడానికే ఆధునిక రోదసీనౌకలకు దశాబ్దాల సమయం పడుతోంది. మనకు చాలా దగ్గరలో ఉన్న నక్షత్రం ప్రాక్సిమా సెంటారై మనకు నాలుగున్నర కాంతి సంవత్సరాల దూరాన ఉంది. సాంకేతిక అభివృద్ధి ద్వారా కాంతి వేగంలో పదోవంతు సాధించినా ఈ ప్రయాణానికి నలభై సంవత్సరాల పైనే పడుతుంది. అందుకనే భవిష్యత్తులో జరిగే రోదసీ ప్రయాణాల్లో వెళ్లేవారు కాపురాలు చేసి, పిల్లల్ని రోదసిలోనే కని, పెంచి, నావికులుగా తయారు చెయ్యడం తప్పనిసరి అవుతుంది. ఎందుకంటే ఇవన్నీ ఒక తరంవారికి సాధ్యమయే పనులుకావు.

ప్రకృతి అంటే భయం ఏర్పడడానికి కారణాల్లో మనిషికి తొలినుంచీ తనకున్న పరిమితులని గురించిన అవగాహన ముఖ్యమైనది. ముందు తన పరిసరాల గురించీ, తరవాత మొత్తం భూమి గురించీ, విజ్ఞానం అభివృద్ధి చెందుతున్న కొద్దీ విశ్వం గురించిన సమాచారం తెలుసుకున్న మానవుడికి విశ్వంలో తన ఉనికిని గురించిన జిజ్ఞాస ఎక్కువ అవుతోంది. తన 'అల్పత్వం' తెలిశాక 'వినయభావన' కలుగుతోంది. ఎందుకంటే కొన్ని భౌగోళిక పరిస్థితుల్లో తలెత్తిన

జీవపరిణామం మనిషి రూపాన్నీ, ఆయుర్దాయాన్నీ, శక్తియుక్తులనీ నిర్దేశించిందనేది మరిచిపోరాదు. భూమ్యాకర్షణ శక్తిని అధిగమించి రోజువారి కదలికకూ, పనులకూ తగినంత బరువూ, కండరాల బలమూ మనిషికి ఉన్నాయి. ఒకటిన్నర రెండు మీటర్ల నిడివి కలిగిన శరీరాలూ, డెబ్బై ఏళ్ల జీవితకాలమూ ఉన్న మనుషులకు బుద్ధివికాసం ద్వారా సాధించిన సాంకేతిక పరిజ్ఞానంతో తప్ప స్వతహాగా గ్రహాంతర యానాలను చేసే సామర్థ్యం లేదు. తొలిదశల్లో గెలీలియో మొదలుకొని అనేకమంది శాస్త్రవేత్తలు టెలిస్కోప్‌ల సహాయంతో అంతరిక్షంలోకి చూసి వివరాలు సేకరించారు. 1957లో స్పుత్నిక్ ప్రయోగంతో సోవియట్ యూనియన్ రోదసీ యుగాన్ని ప్రారంభించింది. 1977లో అమెరికా ప్రయోగించిన వొయేజర్ 2 నౌక ప్రస్తుతం సౌరకుటుంబం పొలిమేరలు దాటి అంతరిక్షంలోకి వెళిపోతోంది.

ప్రస్తుతం ఆసక్తి రేకెత్తిస్తున్న విషయం ఇతర గ్రహాల్లో ప్రాణులూ, బుద్ధిజీవులూ ఉన్నారా అనే ప్రశ్నే. ఈ అన్వేషణకు నాసా 1992 నుంచీ ప్రణాళికాబద్ధంగా ప్రయత్నాలు మొదలుపెట్టింది. మనకు తెలిసిన పద్ధతిలో జీవపరిణామం జరగడానికి వాతావరణంలోనూ, ఉష్ణోగ్రత లోనూ కొన్ని పరిమితులూ, నీరు ద్రవరూపంలో ఉండే పరిస్థితులూ అవసరం అవుతాయి. అవన్నీ ఇతర నక్షత్రాల గ్రహ సముదాయాల్లోనూ జరిగే అవకాశం ఉంది. సూర్యుడికీ, భూమికీ ప్రత్యేకత ఏమీ లేదనుకున్నాక ఇలాంటి నక్షత్రాలూ, వాటి చుట్టూ తిరిగే గ్రహాల మీద జీవరాశి పుట్టడానికి అనువైన పరిస్థితులు కలగడం అసాధ్యమేమీ కాదని శాస్త్రజ్ఞుల నమ్మకం. శక్తివంతమైన టెలిస్కోప్‌ల సహాయంతో ఇతర నక్షత్రాల చుట్టూ తిరిగే గ్రహాల్లో భూమిని పోలినవి ఉన్నాయని స్పష్టమైంది. అక్కడికి వెళ్లిరావడం ఇప్పట్లో అసాధ్యం కనక ఈ జిజ్ఞాస పరిశీలనల స్థాయిలోనే మిగిలింది. భూమికి వెలపల మనకు 'తోడు'గా ఎవరైనా ఉన్నారా అనేది తేలితే జీవపరిణామం గురించిన మన అవగాహనకు చాలా లాభం కలుగుతుంది. మనకు అతి సమీప గ్రహమైన కుజుడి మీద సూక్ష్మజీవుల కోసం వెతుకులాట అందుకే.

మరి భూమి మాటేమిటి? చల్లని సాయంత్రాలు హాయిగా ఆరుబయట పచ్చికలో కూర్చుని, అస్తమిస్తున్న సూర్యుణ్ని, మిలమిలలాడ సాగుతున్న నక్షత్రాల్ని చూసి, కవులేకాదు, సామాన్యులు కూడా పరవశిస్తారు. ఆహా, ఎంత రమణీయంగా ఉందీ ప్రకృతి! సరిగ్గా మన మనసుకూ, శరీరానికీ ఆహ్లాదం కలిగించేందుకే సృష్టించబడిందా ఈ లోకం? అప్పుడప్పుడూ, వానలూ, వరదలూ, కరువులూ వస్తూనే ఉన్నా మొత్తంమీద మన బతుకులు 'చల్ల'గానే సాగిపోతున్నాయికదా. మనమే కాదు, పక్షులూ, జంతువులూ అన్నీ బాగానే ఉన్నాయి.

మనకు అన్ని విధాలా సౌకర్యాంగా అనిపించే పరిస్థితులు 'అదృష్టవశాత్తూ' ఏర్పడలేదనీ, ఉన్న పరిస్థితులు సుఖంగా అనిపించే ప్రాణికోటి మాత్రమే భూమి మీద మనగలుతోందనీ విజ్ఞానం చెపుతుంది. మనం పీల్చే గాలీ, చూడగలిగిన వెలుతురూ, తాళగలిగిన ఉష్ణోగ్రతా యాదృచ్ఛికంగా ఏర్పడలేదు. వీటికి తట్టుకోలేని ప్రాణులు ఏవైనా పుట్టినా త్వరలోనే అంతరించిపోయి ఉంటాయి. భూమికి ఉన్న ఆకర్షణ శక్తిని అధిగమించి అవయవాలను కదిలించగలిగే శక్తి మన కండరాలకు ఉంది. వాటి శక్తికి మించి బరువు మనకు లేదు. నేలమీద నడిచే పెద్ద పెద్ద ఏనుగుల కన్నా నీటిలో ఈదే తిమింగలాలు పెద్దవి కావడంలో ఆశ్చర్యం లేదు. అలాగే ఎగిరే పక్షులు తేలికగానే ఉంటాయి. ఈ పరిణామాలకు వెనక ఉన్న భౌతిక కారణాలు మనకు తెలియనివి కావు. మనిషి ప్రమేయం లేకుండా జరిగిన ఈ 'సృష్టి' వెనకాల 'రహస్యాలు' ఏవీ ఉన్నట్టు కనబడదు.

అనంతం అనిపించే విశ్వాంతరాళంలో పాలపుంత గేలక్సీలో సూర్యుడు అనబడే ఒకానొక నక్షత్రం చుట్టూ భూమీ, ఇతర గ్రహాలూ తిరుగుతున్నాయి. సూర్యుడితో సహా ఈ 'సౌరకుటుంబం' అంతా ఒకేసారిగా సుమారుగా 470 కోట్ల సంవత్సరాల క్రితం ఏర్పడింది. సమీపంలో ఒక సూపర్నోవా పేలడంతో ఆ ప్రాంతంలో వ్యాపించి ఉండిన వాయువులన్నీ పోగుపడి, గురుత్వాకర్షణ కారణంగా ఒక 'సౌరమేఘం'గా రూపొంది ఉంటాయి. ఒకే వేగంతో గుండ్రంగా, చక్రంలాగా తిరగసాగిన ఆ బ్రహ్మాండమైన మేఘానికి నడిబొడ్డున సూర్యుడు నక్షత్రమై వెలగడం మొదలయింది. ఆ దరిదాపుల్లో ఉన్న వేడిమికి కాస్త సాంద్రంగా ఉండే సిలికేట్లు కూడ ఏర్పడలేకపోయాయి. సూర్యుడి సరసనే ఉన్న బుధగ్రహపు కేంద్రంలో ఇనుము ఉంది కాని, భూమి మీద ఉన్నంతగా సిలికేట్లు కనబడకపోవటానికి కారణం. ఇదే కావచ్చు. చంద్రుడి మీదా, కుజుడి మీదా ఉన్నవి రాళ్లూ రప్పలేనని తేలింది. సూర్యుడికి దూరాన, శీతలప్రాంతాల్లో వాయువులన్నీ గడ్డకట్టి గురువుతో మొదలుకొని వెలపలి గ్రహాలుగా రూపొందాయి. ఆ మధ్య గురుగ్రహం మీదకు పారాషూట్‌తో దింపిన అంతరిక్ష పరికరం అంతకంతకూ సాంద్రమైన విషవాయువుల్లో ప్రవేశించి, కాసేపటికి వేడిమికి మాడి మసైపోయింది. గురువు కేంద్రంలో ఘనపదార్థం ఉండే అవకాశం లేదని భావిస్తున్నారు.

సూర్యుడికి దూరాన, శీతలప్రాంతాల్లో వాయువులన్నీ గడ్డకట్టి గురువుతో మొదలుకొని వెలపలి గ్రహాలుగా రూపొందాయి. ఈ సౌరకుటుంబం ఏర్పడిన తొలిదశలో బయటి గ్రహాలు ఇంకా రూపుదిద్దు కోలేదు. ప్లూటో కక్ష్య ప్రాంతాల్లో ఘనీభవించిన వాయువుల ముద్దలు అప్పుడప్పుడూ తోకచుక్కలూ, ఉల్కల రూపంలో సూర్యుడికేసి విసురుగా వచ్చిపడుతూ ఉండేవి. ఈ తాకిడి రానురాను తగ్గినా పూర్తిగా ఆగిపోలేదు.

ఆ యుగంలో భూగ్రహం మీద ఇటువంటివి అడపాదడపా పడుతూ ఉండడం వల్లనే నీరు, జీవకోటి ఆవిర్భావానికి దారితీసిన జీవరసాయన పదార్థాలు దిగుమతి అయ్యాయని కొందరు శాస్త్రవేత్తలు ప్రతిపాదిస్తున్నారు. అంతకుముందు భూమి సెగలు కక్కుతూ, వేడిగా ఉండేది. గ్రహంగా ఏర్పడ్డప్పుడు అంత వేడి లేకపోయినా, సూర్యుడిలాగే భూమి పదార్థరాశి గురుత్వాకర్షణవల్ల సంకోచం చెందింది. ఆ కారణంగానూ, అప్పటికీ ఇంకా రేడియోధార్మికత పూర్తిగా క్షీణించని బరువైన అణువులు ఎక్కువగా ఉండడం వల్లనూ భూమి వేడెక్కసాగింది. అందువల్ల నికెల్, ఇనుమువంటి బరువైన లోహాలతో కూడుకున్న కేంద్రం ద్రవరూపాన్ని సంతరించుకుంది. ఆ కారణంగా భూమివంటి గ్రహాలకు అయస్కాంత క్షేత్రం ఏర్పడింది. మన కాళ్లకు తగిలే భూపటలం అనబడే పెచ్చు (క్రస్ట్), దానికింద మేంటిల్ అనే పొరా విడిగా ఏర్పడ్డాయి. లోపలున్న వేడిమివల్ల నష్టం కలగనటువంటి జీవరాశి పుట్టుకొచ్చింది. ఎందుకంటే జీవరసాయనిక పదార్థాలు ఉష్ణోగ్రతలో కలిగే పెద్ద మార్పులకు తట్టుకోలేవు. ఈ రోజుల్లో గ్రీన్‌హౌజ్ వాయువుల ప్రభావాన్ని గురించిన ఆందోళన అందుకే.

ఇక వాతావరణం సంగతి. మొదట్లో తేలికైన వాయువులన్నీ వేడెక్కిన భూమి అంతర్భాగం నుంచి క్రమంగా అగ్నిపర్వతాల నుంచి బైటికి రాసాగాయి. వీటిలో నైట్రొజన్, కార్బన్ డయాక్సైడ్ వంటివి రోదసిలోకి వెళ్లిపోకుండా భూమ్యాకర్షణవల్ల వాతావరణ పొరగా

*(మిగతా 57 పేజీలో)*

## ఎవడైతేనేం ఒకొక్కడు మహా హంతకుడు

సమాజాన్ని అసహనం, అసహ్యం పునాదులుగా నిర్మించలేం. మానవ సమాజం ఉనికి సహజీవన సౌందర్యంలోనే ఉంది. చరిత్రలోకి పోయి చూస్తే ప్రకృతి వైపరీత్యాలు, మతకల్లోలాలు, సామ్రాజ్యవాద యుద్ధాల వల్లనే లక్షలాదిమంది చనిపోయారని తెలుస్తోంది. ప్రకృతి నుంచి తనను తాను రక్షించుకునే ప్రయత్నం మానవాళి నిరంతరం చేస్తూనే ఉంది. ఇక ఎదుర్కోవలసినవి మతకల్లోలాలు, సామ్రాజ్యవాద యుద్ధాలు. నిజం నిలకడ మీద తెలుతుందనే సత్యం గుజరాత్ మారణకాండ విషయంలో మరోసారి రుజువయ్యింది. తెహల్కా హెడ్‌లైన్స్ టుడే టివి ఛానల్ సంయుక్తంగా నిర్వహించిన పరిశోధనలో గుజరాత్ మారణహోమానికి మోడియే బాధ్యుడన్న విషయం తేట తెల్లమైంది. ప్రవీణ్ తొగాడియా ప్రోత్సాహం, మోడి కల్పించిన రక్షణలతో వి.ఎచ్.పి., ఆర్.ఎస్.ఎస్., భజరంగ్ దళ్, కిసాన్ సంఘ్, ఎ.బి.వి.పి., భాజపా కార్యకర్తలు బృందాలుగా ఏర్పడి హత్యాకాండ సాగించినట్టు సాక్ష్యాధారాలు స్పష్టం చేస్తున్నాయి. ఆరు మాసాలపాటు గుజరాత్‌లో హంతకుల మధ్య జీవించి, హంతకులచే మాట్లాడించి కెమెరాలో నమోదు చేసి సమాజం ముందుంచిన తెహల్కా ప్రతినిధి అశీష్ ఖేతాన్‌ను, మొత్తంగా ఆ బృందాన్ని అభినందించాల్సిందే. దేశవ్యాప్తంగా మళ్లీ దీనిపై నిరసనలు. ఖండనలు వ్యక్తమయ్యాయి. రాబోతున్న అసెంబ్లీ ఎన్నికల్లో గుజరాత్ సమాజం ఏమని తీర్పు ఇస్తుందో చూడాలి.

## జనాదేశ్

ఆదివాసులు, గిరిజనులు 'ఏక్తాపరిషత్' అనే గాంధేయవాద సంస్థ ఆధ్వర్యంలో 'జనాదేశ్' పేరుతో పాదయాత్ర చేపట్టి అక్టోబర్ 29న ఢిల్లీ చేరుకున్నారు. అక్టోబర్ 2న గ్వాలియర్‌లో ప్రారంభమై నాలుగు వారాలపాటు ఈ యాత్ర కొనసాగింది. ఈ యాత్రలో పన్నెండు రాష్ట్రాలకు చెందిన ఇరవై ఐదు వేలమంది గిరిజనులు పాల్గొన్నారు. వారంతా ముక్తకంఠంతో 'మేమేమీ అడుక్కోవడం లేదని, న్యాయంగా మాకు దక్కాల్సిన హక్కులు కోరుతున్నామని', 'మేము చేతులకు ఆయుధాలు ఇమ్మని అడగడం లేదని, మాకు పారలు, రెండు చేతులకు పనులు ఇమ్మని అడుగుతున్నామని అన్నారు. భూమి సమస్యను పరిష్కరించమని కోరుతున్నా'మన్నారు. ఏక్తాపరిషత్ జాతీయ కన్వీనర్ పి.వి. రాజగోపాల్ మాట్లాడుతూ ఈ 'అభివృద్ధి' ప్రజల మేలుకై ఉద్దేశించిందా, కొద్ది మంది వ్యాపార వర్గాలకు మేలు చేయడానికా అని ప్రశ్నించారు. వాస్తవ స్థితి ఇలా ఉంటే మరోవైపు ప్రపంచంలోనే కుబేరులుగా ముకేష్ అంబానీ రు. 2,49,108 కోట్ల ఆస్తులతో మొదటి స్థానంలోనూ, లక్ష్మీ మిట్టల్ రు. 2,01,055 కోట్ల ఆస్తులతో ఐదవ స్థానంలో నిలిచారు. బహుశా వీరిని చూసే మనం 'ఇండియా షైనింగ్' అని అనుకోవాలేమో.

## శ్రీకృష్ణ కమిషన్ రిపోర్ట్‌ను అమలు చేయాలి

శ్రీకృష్ణ కమిషన్ రిపోర్ట్‌ను అమలు చేయాలంటూ అరవై ముస్లిం ప్రజాసంఘాల ఐక్యవేదిక ఆధ్వర్యంలో ముంబైలోని ఆజాద్ మైదాన్‌లో అక్టోబర్ 25న 'న్యాయ్ ఆందోళన్' పేర బహిరంగ సభ జరిగింది. 1992-93లలో బొంబాయి అల్లర్లలో నష్టపోయిన కుటుంబ సభ్యులకు నష్టపరిహారాన్ని పెంచి ఇవ్వాలనీ, సులేమాన్ బేకరీ కేసులో నిందితులుగా పేర్కొన్న మాజీ పోలీస్ జాయింట్ కమిషనర్ ఆర్.డి. త్యాగినీ, కమిషన్ రిపోర్ట్‌లో పేర్కొన్న 31 మంది పోలీసులనూ వెంటనే అరెస్ట్ చేసి జైల్లో పెట్టాలని డిమాండ్ చేశారు. మొత్తంగా శ్రీకృష్ణ కమిషన్ రిపోర్ట్‌ను డిసెంబర్ 5లోగా అమలు చేయకపోతే 'జైల్‌భరో' ఆందోళన చేపడతామని ఐక్యవేదిక మహారాష్ట్రలోని కాంగ్రెస్ - నేషనలిస్ట్ కాంగ్రెస్ ప్రభుత్వాన్ని హెచ్చరించింది. ఏళ్లు గడిచిపోయినా ముస్లింలు న్యాయం కోసం పడిగాపులు గాస్తున్నారు.

## అన్నదాతల నిశ్శబ్ద నిష్క్రమణ

అధికారిక లెక్కల ప్రకారం 1997-2005 మధ్య అంటే ఈ తొమ్మిదేళ్లలో దాదాపు లక్షన్నర మంది అన్నదాతలు ఆత్మహత్యల పాలయ్యారని తెలుస్తోంది. ఆ ఆత్మహత్యల్లో మూడింట రెండువంతులు మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, మధ్యప్రదేశ్ (ఛత్తీస్‌ఘడ్‌తో సహా), కేరళ రాష్ట్రాల్లో ఉన్నాయి. ఇలాంటి అనేక బాధాకర సత్యాలు ప్రొ. కె. నాగరాజు రైతాంగ ఆత్మహత్యలపై తన అధ్యయనంలో వెల్లడించారు. 'ది హిందూ' దినపత్రికలో పి. సాయినాథ్ వీటిపై విశ్లేషణలను నవంబర్ నెలలో వరుసగా అందించారు. మొత్తంగా ఈ తొమ్మిదేళ్ల కాలంలో దేశవ్యాప్తంగా వివిధ కారణాల వల్ల 9,77,107 మంది ఆత్మహత్యలు చేసుకోగా, వారిలో 1,49,244 మంది రైతులు ఉండడం పెద్దఎత్తున వ్యవసాయ సంక్షోభాన్ని మన ముందుంచుతోంది. చాలా ఎక్కువగా ఆత్మహత్యల రేటు ఉన్న రాష్ట్రాలుగా కేరళ, తమిళనాడు, పుదుచ్చేరి, పశ్చిమ బెంగాల్, త్రిపురలు ఉన్నాయి. తర్వాతి స్థాయిలో ఎక్కువగా ఆత్మహత్యల రేటు, రైతుల ఆత్మహత్యలు ఉన్న రాష్ట్రాలలో కర్ణాటక, మహారాష్ట్ర, గోవా, మధ్యప్రదేశ్ (ఛత్తీస్‌గడ్ తో కలిపి), ఆంధ్రప్రదేశ్‌లు ఉన్నాయి. వేలాది అన్నదాతలు ఆత్మహత్యల పాలవుతుంటే మొత్తంగా సమాజం బతికే అర్హతనూ, నోటికాడి ముద్దనూ కోల్పోతోంది.

## కాశ్మీర్‌లో నిరసనలకు అరవై ఏళ్లు

కాశ్మీర్‌లో భారతసైన్యాలు అడుగుపెట్టి అరవై ఏళ్లు అయిన సందర్భంగా అక్టోబర్ 27న అక్కడి కాశ్మీర్ 'వేర్పాటువాద సంస్థలు' చేపట్టిన సమ్మెకు జనజీవనం స్తంభించింది. దుకాణాలు, వాణిజ్య సంస్థలు విద్యాలయాలు, ప్రభుత్వ కార్యాలయాలు మూసివేసారు. మిర్వైజ్ ఉమర్ వర్గం హురియత్ నేతలు జమ్మూలో 'నిశ్శబ్దయాత్ర' చేపట్టారు. ఒక హురియత్ నేత మాట్లాడుతూ ఈ ర్యాలీకి నాయకత్వం వహించాల్సి ఉన్న జాఫర్ అక్బర్ భట్‌ను గృహ నిర్బంధంలో ఉంచడాన్ని ఖండించారు. వీరికి సమాజం నుంచి ఉన్న మద్దతును చూసైనా ప్రజాభిప్రాయం ఏమిటో పాలకులు తెలుసుకునే ప్రయత్నం చేయాలి.

## దామాషా పద్ధతిన సామాజిక న్యాయం

అరవై ఏళ్లు దేశంలో కులాల జనాభా గణన చేపట్టకపోవడం వలన దేశమేమి కులరహితం అయిపోలేదని, సామాజిక న్యాయం దామాషా పద్ధతిన అన్ని కులాల వారికి అందించడానికి కులాల వారి జనాభాను లెక్కించాలని పట్టలి మక్కల్ కచ్చి (పి.ఎం.కె.) పార్టీ కేంద్ర ఒ.బి.సి. కోటా కేసుకు మద్దతుగా సుప్రీం కోర్టుకు విన్నవించింది. భారత ప్రభుత్వాన్ని కులాలవారిగా జనాభాను 2011 జనాభా లెక్కలలోనైనా గణించేలా ఆదేశించాలని కోరింది. ఇప్పటికీ 1931లో బ్రిటిష్‌వారు చేపట్టిన కుల గణాంకాల ఆధారంగానే వెనుకబడిన తరగతుల వారిని అంచనా వేయడం జరుగుతోందనీ, జనాభాలో 20 శాతం కన్నా తక్కువ ఉన్న అగ్రకులాలవారు మెరిట్ పేరిట 50 శాతం సీట్లు అన్నిటా అనుభవిస్తున్నారని ఒ.బి.సి. కోటా రిజర్వేషన్ల అమలుకై పి.ఎం.కె. తరఫున హాజరైన సీనియర్ న్యాయవాది రవివర్మ కుమార్ ఛీఫ్ జస్టిస్ కె.జి. బాలకృష్ణన్ ప్రభృతులతో కూడిన ధర్మాసనం ముందు తెలియజేశారు. దేశాన్ని ముందుకు నడిపించడానికీ గ్రామీణ ప్రాంతాలలో, నష్టపోయిన వర్గాలవారి అభ్యున్నతికీ సరైన దిశగా సామాజిక న్యాయం అందించడానికి కులాల వారి జనాభా గణన మరింత తోడ్పడుతుందన్నారు. ◆

## పాకిస్తాన్‌లో ఎమర్జెన్సీ

పాకిస్తాన్ అధ్యక్షుడు జనరల్ ముషారఫ్ దేశంలో ఎమర్జెన్సీ విధించారు. తీవ్రవాద కార్యకలాపాలని అరికట్టడానికి తీవ్రవాదులకి పరోక్షంగా సాయపడుతున్న మీడియాని, న్యాయవ్యవస్థని నియంత్రించడానికీ ఈ ఎమర్జెన్సీ అవసరమని, అయితే దాన్ని ఎక్కువకాలం కొనసాగించమని, త్వరలోనే ఎన్నికలు జరిపిస్తామని ముషారఫ్ అన్నారు. ఎమర్జెన్సీకి నిరసనగా పాకిస్తాన్‌లో భారీ ఎత్తున నిరసన కార్యక్రమాలు జరిగాయి. సాధారణ ప్రజలు, ప్రతిపక్ష పార్టీలు, న్యాయవాదులు, మీడియా ప్రతినిధులు అనేకమంది నిరసనలో పాల్గొన్నారు. ఎమర్జెన్సీ విధించగానే ప్రతిపక్ష నేతలైన ఇమ్రాన్ ఖాన్, బెనజీర్ భుట్టోలని గృహనిర్బంధంలో ఉంచారు. అలాగే పౌరహక్కుల కార్యకర్త అస్మా జహంగీర్‌ని కూడా నిర్బంధంలో ఉంచారు. కొన్ని టెలివిజన్ ఛానెళ్లని బహిష్కరించారు. సుప్రీంకోర్టు న్యాయమూర్తులు కొందరిని బర్తరఫ్ చేశారు. ఈ పరిణామాల పట్ల వివిధ దేశాల ప్రభుత్వాలు, అంతర్జాతీయ మానవ హక్కుల సంస్థలు, జర్నలిస్టుల సంస్థలు తమ ఆందోళనను, దిగ్భ్రాంతిని వెలిబుచ్చాయి.

## జార్జియాలో ప్రజా నిరసన

జార్జియా అధ్యక్షుడు మిఖైల్ సాకాష్‌విలికి వ్యతిరేకంగా కొన్ని వేలమంది జార్జియా ప్రజలు ఏకబిగిన ఆరు రోజులు నిరసన ప్రదర్శనలు జరిపారు. 2003లో అమెరికా మద్దతుతో 'రోజ్ రెవల్యూషన్' ద్వారా అధికారానికి వచ్చిన సాకాష్‌విలి ఈనాడు అవినీతికీ, రాజకీయ హత్యలకీ మారుపేరుగా మారాడని ప్రతిపక్షాలు ఆరోపిస్తున్నాయి. రష్యాకి అనుకూలంగా ఉన్న ప్రభుత్వాన్ని శాంతియుతంగా పడగొట్టి, అమెరికా సహకారంతో అధికారం చేజిక్కించుకున్న సాకాష్‌విలీకి వ్యతిరేకంగా ఇంత పెద్ద ఎత్తున ప్రదర్శనలు జరగడం ఇదే మొదటిసారి. పూర్వపు సోవియట్ యూనియన్ నుండి వేరుపడిన ప్రాంతాల్లో పట్టు సాధించడానికి అమెరికా పథకం ప్రకారం అమలుచేసిన ప్రభుత్వ మార్పిడి విధానంలో తొలి విజయం జార్జియానే. అటువంటి జార్జియాలో ప్రజలు ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరగబడడమనేది అమెరికాకి తల నొప్పిగానే పరిణమించవచ్చు.

## దుబాయ్‌లో వర్కర్ల సమ్మె

దుబాయ్‌లో మొదటిసారిగా నలభై వేలమంది నిర్మాణ కార్మికులు జీతాలని పెంచాలని, మెరుగైన పనిచేసే వాతావరణాన్ని కల్పించాలని సమ్మె చేశారు. ఇందులో చాలామంది భారతీయులు కావడం గమనార్హం. వీరందరూ దుబాయ్ కంపెనీ అరబ్‌టెక్‌లో పని చేస్తున్నారు. సమ్మె కంపెనీ నడుపుతున్న ముప్ఫై ఆరు క్యాంపులకి విస్తరించింది. దుబాయ్‌లో సమ్మె చేసే హక్కు, యూనియన్లు పెట్టుకునే హక్కు కార్మికులకి లేదు. అయినా కూడా ఈ కార్మికులు సమ్మెకు దిగారంటే అక్కడ వారి పరిస్థితులు ఎలా ఉండి ఉంటాయో అర్థం చేసుకోవచ్చు. కార్మికులకు, కంపెనీకి మధ్య జీతాల పెంపుదల మీద చర్చలు నడుస్తున్నాయి.

## మలేషియాలో ప్రజల ప్రదర్శన

మలేషియాలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రతిపక్ష కూటమి కౌలాలంపూర్‌లో జరిపిన ప్రదర్శనలో కొన్ని వేల మంది ప్రజలు పాల్గొన్నారని అంచనా. నాలుగేళ్ల క్రితం అధికారంలోకి వచ్చిన అబ్దుల్లా అహ్మద్ బదావీకి వ్యతిరేకంగా రాజకీయ నిరసన వ్యక్తం కావడం ఇదే మొదటిసారి. నిరసనకారుల్లో కొంతమంది రాజభవనానికి వెళ్లి రాజుకి పిటిషన్ కూడ సమర్పించారు. స్వేచ్ఛాయుతమైన ఎన్నికల వాతావరణాన్ని కల్పించాలన్నదే వారి ప్రధాన డిమాండుగా పేర్కొన్నారు.

## తుపాను బీభత్సం

వేరు వేరు ప్రాంతాల్లో రేగుతున్న తుపానుల, వరదల కారణంగా తీవ్రమైన ప్రాణనష్టం, ఆస్తి నష్టం, పర్యావరణ కాలుష్యం సంభవించాయి. రష్యాకి సమీపంలో ఉన్న 'బ్లాక్ సీ'లో సంభవించిన పెను తుపాను కారణంగా చమురు తీసుకెళ్తున్న నౌక రెండు ముక్కలుగా చీలిపోవడంతో రెండు వేల మెట్రిక్ టన్నుల చమురు సముద్రంలో కలిసిపోయింది. ఇదొక పెద్ద పర్యావరణ సమస్యగా మారింది. ఇంకొక పక్కన వియత్నాంలో నెలరోజులుగా కురుస్తున్న కుంభవృష్టి మూలంగా వరదలు సంభవించి, రెండు వందల మందికి పైగా మరణించడమే కాకుండా, ఐదు వేల మొసళ్ళు వాటిని ఉంచిన ప్రదేశం నుంచి తప్పించుకొన్నాయి. వియత్నాం ప్రజలకి వరద బాధే కాకుండా, మొసళ్ల బెడద కూడా పట్టుకుంది. బంగ్లాదేశ్‌లోనూ తుపాను, వరదల కారణంగా తీర ప్రాంతాలన్ని ముంపుకు గురైయ్యాయి. కనీసం 3,500 మంది మరణించారు, వెయ్యికి పైగా జాడ లేకుండా పోయారు. 32 లక్షల మంది నిర్వాసితులయ్యారు.

## ఫ్రాన్స్‌లో సార్వత్రిక సమ్మె

నికొలాస్ సార్కోజీ ప్రభుత్వం చేపట్టిన ఆర్థికరంగ, విద్యారంగ విధానాలకు వ్యతిరేకంగా ఫ్రాన్స్‌లోని విద్యార్థులు, రైల్వే కార్మికులు, ప్రభుత్వ రంగ సంస్థల ఉద్యోగులు – దాదాపు ఐదు మిలియన్ల శ్రామికులు సమ్మె చేస్తున్నారు. ముందుగా రైల్వే కార్మికులు, విద్యార్థుల సమ్మెలతో మొదలై సార్వత్రిక సమ్మెగా రూపుదిద్దుకుంది. పడిపోతున్న కొనుగోలు శక్తి, ఉద్యోగావకాశాలు, పెరగని వేతనాలకి వ్యతిరేకంగా ఈ సమ్మె జరుగుతోంది. 24 గంటల సార్వత్రిక సమ్మె కారణంగా మొత్తం ఫ్రాన్స్ జనజీవితం స్తంభించిపోయింది. విద్యార్థులు విద్యా వ్యవస్థ ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా సమ్మెలో పాల్గొంటున్నారు. ముందుగా సమ్మె చేస్తున్న కార్మికులతో మాట్లాడడానికి విముఖత చూపించిన ప్రభుత్వం ఇప్పుడు దిగివచ్చి కార్మికులతో మాట్లాడడానికి తన సంసిద్ధత ప్రకటించింది.

## ఒపెక్ సమావేశం

చమురు ఎగుమతి దేశాల సమూహం ఒపెక్ రియాద్‌లో రెండు రోజుల సమావేశాన్ని నిర్వహించింది. ఒపెక్ దేశాల అధినేతలందరూ ఈ సమావేశంలో పాల్గొన్నారు. 1960లో ఒపెక్ స్థాపించినప్పటినుండి ఇది వారి మూడవ సమావేశం. ఇందులో దేశాధినేతలు పాల్గొనడమనేది చాలా అరుదైన విషయం. పెరుగుతున్న చమురు ధరల గురించి, పర్యావరణ సమతుల్యం దెబ్బ తినకుండా చమురు ఉత్పత్తులని, వాడకంని ఎలా పెంచడం అనే విషయాల గురించి సమావేశం విస్తృతంగా చర్చించింది. ఒపెక్‌కి తనదంటూ ఒక బ్యాంక్ ఉండాలని, ఒపెక్ దేశాల మధ్య మరింత సహకారం పెరగాలని వెనిజులా సూచించింది. ◆

# వీక్షణం 2007 సూచిక

**జూన్ 2007** **సంచిక 71**

**❖ ఫోకస్ : రాజకీయ రంగంలో అవినీతి**



**జూలై 2007** **సంచిక 72**

**❖ ఫోకస్ : నీటి పారుదల పథకాలు - వివాదాలు**



**ఆగస్ట్ 2007** **సంచిక 73**

**❖ ఫోకస్ : అరవై సంవత్సరాల స్వాతంత్ర్యం**



**సెప్టెంబర్ 2007** **సంచిక 74**

**❖ ఫోకస్ : ఆంధ్రప్రదేశ్‌లో భూమి సమస్య - పరిష్కారాలు**

---

*(52 పేజీ తరువాయి)*

ఏర్పడ్డాయి నీటి ఆవిరి వర్షంగా కురిసి సముద్రాలు, మహాసముద్రాలూ ఏర్పడడానికి దారితీసింది. కురిసిన చోట ఉండిన లవణాలు నీటిలో కరగి సముద్రాలన్నీ ఉప్పునీటితో నిండాయి. కార్బన్ డయాక్సైడ్ శిలలతో రసాయనికంగా కలవగా కార్బొనేట్లు ఏర్పడి ఉంటాయి. అవి నీటిలో కరిగి లవణాలుగా రూపొందాయి. ఈనాడు అగ్నిపర్వతాలనుంచి వెలువడే వాయువుల్లో ఆక్సిజన్ ఉండదు.

ఇదే పరిస్థితి అప్పుడూ ఉండేదని అనుకుంటే ఈ రోజుల్లో కనబడుతున్న 21 శాతం ఆక్సిజన్ ఆ తరువాత ఇతర మార్పుల కారణంగా గాలిలో చేరింది. నీటిలో తొలిగా అవతరించిన మొక్కలు సూర్యరశ్మి వల్ల కిరణసంయోగం ద్వారా కార్బన్ డయాక్సైడ్‌ను పీల్చుకుని ఆక్సిజన్‌ను విడుదల చేస్తూ ఉండేవి. ఇది క్రమంగా పెరిగి, సుమారు 57 కోట్ల సంవత్సరాల కిందట నీటిలోనూ, గాలిలోనూ ఎంతగా కలిసిందంటే ఆక్సిజన్‌ను పీల్చి బతకగలిగిన జంతువులు పుట్టుకురావడం ఆ తరవాతనే సాధ్యమైంది. మరికొంతకాలానికి, అంటే 40 కోట్ల సంవత్సరాల కిందట, గాలి పీల్చే భూచరాలు కూడా ఆవిర్భవించాయి.

దీని వల్ల తేలుతున్నదేమంటే ప్రాణుల ఆవిర్భావానికి అడ్డు తగలనివీ, దోహదపడేవీ అనేక పరిస్థితులు ఒక్కసారిగానో, క్రమంగానో కలిసిరావడం వల్ల ఇతర గ్రహాలకు భిన్నంగా ఒక భూమి మీద మాత్రమే జీవాలు పుట్టుకు రాగలిగాయి. సరిగ్గా ఇటువంటి పరిస్థితులే మరే గ్రహం మీద ఒనగూడినా జీవరాశి ఉద్భవించే అవకాశం ఉంటుందని భావిస్తున్నారు. కుజగ్రహం మీద ఒకప్పుడు నీరు ఉండేదని కచ్చితంగా తెలుస్తోంది. ఆ కాలంలో జీవకణాల పుట్టుకకు దారితియ్యగలిగిన పరిస్థితులు ఉండేవేమోనని శాస్త్రవేత్తలు ఆశగా అన్వేషిస్తున్నారు. ఉల్కల్లోనూ, తోకచుక్కల్లోనూ సేంద్రియ (ఆర్గానిక్) కణాలున్నాయని వారు అనుమానిస్తున్నారు. భూమికి వెలుపల ఎక్కడ జీవకణాలు దొరికినా అది అద్భుతమైన విషయంగా అనిపిస్తుంది.

భౌతికవాద దృక్పథం ఉన్నవారికి మాత్రమే ప్రకృతిని గురించీ, మనుషుల స్థానం గురించీ సరైన అవగాహన ఏర్పడుతుంది. ఆ తరవాత మనందరికీ జీవవైవిధ్యాన్నీ, పర్యావరణాన్నీ కాపాడుకోవడమనేది ఎంత అవసరమో ప్రత్యేకంగా వివరించవలసిన అవసరం ఉండదు. ◆

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. ఆ సహజ మరణపు వయోపరిమితి దేశ కాల పరిస్థితులను బట్టి, జీవన ప్రమాణాలను బట్టి అరవైల నుంచి తొంభైల దాకా ఉండవచ్చు. కాని మన సమాజంలో సాధారణ ఆయు ప్రమాణం 63 సంవత్సరాలు అయినప్పటికీ ఎంతోమంది పుట్టుకలోనే మరణిస్తున్నారు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ మరణం అనేక రూపాలలో సంభవిస్తోంది. ఆకలి, అనారోగ్యం, మానసిక ఆందోళనలు, సామాజిక అసమానతలు, వరకట్న మరణాలు, నిర్లక్ష్యం, అంటరాని తనం, వ్యవసాయం, చేనేత వంటి రంగాల్లోని సంక్షోభాలు, పారిశ్రామిక అశాంతి, జీవనోపాధి లేమి అసహజ మరణాలకు లెక్కలేనన్ని కారణాలున్నాయి. మన పక్కనె మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైనపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే, ఈ శీర్షిక విజయవంతమైనట్లే. వీక్షణం ఆధారంగా ఈ సంవత్సరంలో అసహజంగా చనిపోయినవారి మొత్తం సంఖ్య **8136**

| తేది | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు తెలియని | ఆకలి | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| జనవరి | 73 | 7 | 248 | 3 | - | - | 42 | 25 | - | 6 | 131 | 63 | 30 | 7 | - | - | 12 | - |
| ఫిబ్రవరి | 68 | - | 97 | 3 | - | - | 46 | 29 | 17 | - | 124 | 106 | - | 6 | - | - | 5 | - |
| మార్చ్ | 97 | - | 87 | 4 | - | - | 54 | 27 | 4 | 22 | 163 | 103 | 27 | 2 | 4 | 2 | 23 | - |
| ఏప్రిల్ | 79 | 1 | 111 | 2 | - | - | 58 | 37 | 3 | 25 | 126 | 91 | 9 | 5 | 1 | 3 | 39 | - |
| మే | 71 | - | 100 | 5 | - | - | 59 | 49 | 1 | 29 | 227 | 107 | 17 | - | - | 1 | 19 | 16 |
| జూన్ | 51 | - | 130 | 4 | - | - | 62 | 54 | 6 | 17 | 239 | 131 | 23 | 2 | 9 | - | 27 | 426 |
| జూలై | 66 | 1 | 86 | 1 | - | - | 53 | 47 | 2 | 13 | 142 | 165 | 21 | 4 | - | - | 31 | 90 |
| ఆగస్ట్ | 47 | - | 108 | 2 | - | - | 38 | 30 | 1 | 12 | 117 | 116 | 41 | 1 | - | - | 9 | 1 |
| సెప్టెంబర్ | 42 | - | 57 | 1 | - | - | 34 | 37 | - | 16 | 173 | 159 | 88 | 15 | - | - | 11 | 17 |
| అక్టోబర్ | 29 | - | 53 | 1 | - | - | 66 | 28 | 3 | 24 | 214 | 147 | 43 | - | - | - | 15 | 52 |
| నవంబర్ | 64 | - | 75 | 5 | - | - | 55 | 51 | 2 | 32 | 150 | 101 | 42 | 5 | - | - | 9 | 13 |
| డిసెంబర్ | 44 | 2 | 134 | 2 | | | 60 | 46 | 1 | 20 | 191 | 158 | 42 | 2 | - | - | 20 | 5 |
| మొత్తం | 731 | 11 | 1286 | 33 | | | 623 | 460 | 40 | 216 | 1997 | 1447 | 383 | 49 | 14 | 6 | 220 | 620 |

ఈ శీర్షికకు సహకారం అందిస్తున్న వారు : హైదరాబాద్ - డి. విజయభాస్కర్; మెదక్ - కె. రాజు; మహబూబ్‌నగర్ - ఏసురత్నం;
కడప - ఎన్.ఎస్. ఖలందర్; గుంటూరు - బి. అంజమ్మ; శ్రీకాకుళం - జి. సుధీర్

*గమనిక : మీ అందరి సహకారంతో అన్ని జిల్లాల పూర్తి సమాచారంతో భవిష్యత్తులో ఈ శీర్షికను మరింత సమగ్రంగా అందించే ప్రయత్నం చేస్తాం.*

KLVA106M287
RNI Regn.No.APTEL/2006/... Published 27/11/2007 PRINTED BOOK





# వినూత్నం... విజయవంతం!

## ప్రతి పథకం ప్రజలకే సొంతం

**విజయవంతమవుతున్న పథకాలు**

| | |
|---|---|
| జలయజ్ఞం | : 1.30 కోట్ల రూపాయలతో 1 కోటి ఎకరాల సాగు |
| ఇందిరమ్మ | : ఈ ఏడాది 20 లక్షల గృహాల నిర్మాణం. వచ్చే మూడేళ్లలో 80 లక్షల గృహాల నిర్మాణం లక్ష్యం. |
| ఇందిరాక్రాంతి పథం | : పావలా వడ్డీకే రుణాలు, 6500 కోట్ల రూపాయలు పంపిణీ. |
| రాజీవ్ గృహకల్ప | : పట్టణ పేదలకు సొంతఇల్లు |
| ఉపాధి హామీ పథకం | : 19 జిల్లాల్లో పేదలకు ఉపాధి, 36.50 లక్షల కుటుంబాలకు ప్రయోజనం. |
| ఇందిరప్రభ | : 500 కోట్లతో అసైన్డ్ భూముల అభివృద్ధి |
| ఆరోగ్యశ్రీ | : నిరుపేదలకు ఉచితంగా వైద్యం, శస్త్ర చికిత్సలు |













ఇవి... రాష్ట్ర ప్రభుత్వం అమలు చేస్తున్న వినూత్న పథకాల్లో ప్రముఖమైనవి. ప్రజల భాగస్వామ్యంతో అమలవుతున్న ఈ పథకాలు రాష్ట్రాన్ని హరితాంధ్ర ప్రదేశ్ వైపు నడిపించే దిశగా విజయవంతంగా అమలు జరుగుతున్నాయి.

## ఇందిరమ్మ రాజ్యం - ఇంటింటా సౌభాగ్యం

R.O.No.552/Sou/Advt.I/2007-08

జారీచేయువారు: సమాచార, పౌరసంబంధాలశాఖ

Printed, Published and Owned by V. Hanumantha Rao and Printed at Charita Impressions for Nutan Art Printers, 11-5-417-420, Red Hills, Lakdi-ka-pool, Hyderabad-500 004 and published at 8-3-898/22, Nagarjuna Nagar, Hyderabad-500 073. Editor : V. Hanumantha Rao



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA106M287 |
| పుస్తకం పేరు | వీక్షణం |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 61 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Naveeda |
| పేజీలు విడదీసినది | Naveeda |
| స్కాన్ చేసినది | APS001 |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |